ఆమె కళ్ళలో
పరవళ్ళుతొక్కే అందం.



ఆ ఆకర్షణనుపెంచే
ఆమె నొసటి కుంకం

శింగార్...రంగులలోని అత్యుత్తమమైన పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకి సరితూగేలా...మీ
బట్టలకి అనుగుణంగా. భారతదేశంలోని
అత్యంత సౌందర్యవతులంతా దీనిని ఎంచుకుంటున్నారు.

శింగార్ కుంకుమ్ బొట్టు—
భారతదేశపు సౌందర్యతిలకం.

everest/78/SH/135-II

# క్రొత్త స్టేఫ్రీ
# బెల్టులేని నేప్‌కిన్లు




ఈ ఎడ్హెసివ్ పట్టీ నేప్‌కిన్‌ను మీ బిగువైన చెడ్డీలలో సురక్షితంగా నిలుపుతుంది.




## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవుసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేప్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.




### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చేటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మ నిలిచి పోతుంది. మరి. 3–వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి–400 036
లైసెన్స్ యూజర్. స్టేఫ్రీ, జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్ © J & J '79

OBM/1638 TEL

### ఈ సామాజిక వ్యవస్థ మారాలి!

అబలల అసమానతలను విశదీకరిస్తూ బులుసు రామలక్ష్మిగారు జూలై సంచికలో రాసిన వ్యాసం వాస్తవికతను ప్రతిబింబిస్తున్నది కానీ ఆమె సమస్యలకు మూలకారణం గ్రహించినట్లుగా తోచడం లేదు. స్త్రీ సమస్యలు తీరటం లేదు. నిజమే. రానురాను సమాజంలో స్త్రీ స్థానం దిగజారిపోతోంది. స్త్రీ తన అభిరుచి ప్రకారం నడుచుకోవటానికి పైకి అన్ని అవకాశాలూ వున్నట్లు కన్పిస్తున్నా అన్ని విధాలుగా అవరోధాలూ వున్నాయి. స్త్రీని వ్యాపార ప్రకటనలకి వుపయోగించుకుంటున్నారు. రామలక్ష్మిగారన్నట్లు స్త్రీ అమ్మబడుతోంది; కొనబడుతూంది. 'కళ' పేరుతో స్త్రీ శరీరాన్ని బహిర్గతం చేయడం చూస్తున్నాం. స్త్రీని విలాస వస్తువుగా భావిస్తున్నారు. ఆమె ద్వారా వ్యాపారం జరుగుతోంది. మధ్య తరగతి స్త్రీ సమస్తమైన నీతినీ భుజాల మీద వేసుకొని భారత స్త్రీ జాతి ప్రతినిధిగా వుంటోంది. దొంగ పొగడ్తల కోసం. ఎంతమంది స్త్రీల జీవితాలు వడ్డించిన విస్తళ్ళుగా వున్నాయి ఈ దేశంలో? మధ్య తరగతి స్త్రీ అన్నిరకాల సమస్యలతో నలిగిపోతోంది. సమస్యలన్నీ ఆమెవే. మౌలికమైన సిద్ధాంతాల ద్వారా సమాజంలో మార్పు రావాలి. మొత్తం సామ్యాజిక వ్యవస్థ మారాలి. అప్పుడే ఈ స్త్రీ సమస్యలు సమూలంగా పరిష్కరించబడతాయి. అంతేకానీ స్త్రీ సమస్య ప్రత్యేకించి ఒక సమస్య కాదు. వంద సమస్యల్లో అది ఒకటి. ప్రస్తుతం మనం వున్న వ్యాపార నాగరికతలో స్త్రీ విలాస వస్తువుగానే వుంటోంది. అది ఈ వ్యవస్థ లక్షణం. ఈ నాగరికత ఇట్లాగే అభివృద్ధిచెందితే రామలక్ష్మిగారు ఆశించినట్లు 21 వ శతాబ్దం చివరికైనాసరే మార్పు రాదు. స్త్రీ పురుషుల అసమానతలు ఇలాగే వుంటాయి. ఆర్థిక అసమానతలు తొలగి వర్గరహిత సమాజం ఏర్పడిననాడు స్త్రీ పురుషుల అసమానతలు తొలగిపోతాయి. అంతవరకూ ఎన్ని "విమెన్స్ లిబ్ మూవ్‌మెంట్స్" వచ్చినా మూలసమస్యలను పరిష్కరించలేవు. ఈ సత్యాన్ని ముందు మనం తెలుసుకోవాలి. ఇకపోతే పురాణాలని ప్రామాణిక గ్రంథాలుగా తీసుకునే (పైకి తీసుకుంటున్నట్లు కనీసం నటించే) పవిత్ర భారత దేశంలో పురాణాలను విమర్శించ కూడదు. అవునా? సాహిత్యంలో స్త్రీ పాత్రని హీనంగా చిత్రీకరిస్తున్నారని విచారిస్తారెందుకు? జీవితంలో హీనత్వం తొలగిపోతే సాహిత్యంలో కూడా మార్పు వస్తుంది. జీవితం సాహిత్యంలో ప్రతిబింబించాలి కద!

**శివలెంక రాజేశ్వరీ దేవి** — **జగ్గయ్య పేట**



'అభిప్రాయాలు'
శీర్షికలో ప్రచురింపబడే
ప్రతి లేఖకూ చిన్న
పారితోషికం ఇరుదు రూపాయలు

### వినియోగదార్ల ఉద్యమాలు రావాలి!

ఆగస్ట్ సంచికలో వినియోగదార్ల శీర్షికలో ప్రచురించిన 'నాణ్యతగల వస్తువులు ఎన్నుకోవడం ఎలా?' వ్యాసం ఉపయుక్తంగా వుంది. ధరలన్నీ అడ్డూ అదుపూ లేకుండా ఆకాశానికందుతున్న ఈ రోజుల్లో వినియోగదార్ల ఉద్యమాలు రావాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. అంతధర పోసికొన్నా ఆ వస్తువులు కొన్నిటిలో నాణ్యత అనేది మచ్చుకైనా కనిపించడం లేదు. ఫిర్యాదుచేసినా 'చెవిటివాడి ముందు శంఖం వూదినట్ల'వుతోందే తప్ప ప్రయోజనం కనిపించడం లేదు. వ్యాపారస్తులు ఎంతసేపు ఏ విధంగా దగా చేసి డబ్బు సంపాయిద్దామా అని చూస్తారే తప్ప ప్రజాక్షేమం గురించి ఆలోచించరు. అది వారి సహజ ప్రవృత్తి అని మనం సరిపెట్టుకు పోయినంతకాలం వస్తువుల నాణ్యత దిగజారుతూనే వుంటుంది; ధరలు పెరుగుతూనే వుంటాయి. అందువల్ల ప్రతి ఊరిలోనూ వినియోగదార్ల సంఘాలు ఏర్పాటుకావాలి. తమ సమస్యలను సమావేశమై చర్చించుకోవాలి. ఆ వ్యాపారస్తులకు, ప్రభుత్వానికీ కాగితాలు పంపుతూ న్యాయం చేకూరేటట్లు చూడాలి. ఒకవేళ అప్పటికీ ప్రయోజనం కనిపించకపోతే ఆ వస్తువులని బహిష్కరిస్తూ ఉద్యమాలు లేవదీయాలి. ఇలా ఒక్కొక్క ఊరిలో ఏర్పడిన వినియోగదార్ల సంఘాలన్నీ సంఘటితమై రాష్ట్ర స్థాయిలో ఒక మాతృ సంస్థని స్థాపించుకోవాలి. అప్పుడు ఒక వస్తువును బహిష్కరించ దలచుకున్నప్పుడు కేవలం ఆ ఊరిలోనే కాక రాష్ట్ర స్థాయిలో ఆ పని జరుగుతుంది కాబట్టి ఆ వ్యాపారస్తులు తలవంచక తప్పదు. ఈ రాష్ట్ర స్థాయి సంఘాలన్నీ జాతీయ స్థాయిలో దేశానికంతటికీ ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకోవాలి. అసలు మన దేశంలో బొంబాయి కేంద్రంగా వినియోగదార్ల సలహా సంఘం ఒకటి వుందన్న విషయం ఎంత మందికి తెలుసు? ఈ సంవత్సరం మార్చి నెలలో అఖిల భారత వినియోగదార్ల వారోత్సవాలు జరిగాయన్నది ఎంత మంది విన్నారు? ఇలా వుంది మన దేశంలోని వినియోగదార్ల ఉద్యమం. అభివృద్ధి చెందిన దేశాలలో వినియోగదార్ల ఉద్యమాలు ప్రజలకు ఎన్నో మేళ్ళు చేశాయి – చేస్తున్నాయి. ఆ విధంగా మన దేశంలోను ఊరూరా వినియోగదార్ల ఉద్యమాలు వర్ధిల్లిననాడు నాణ్యతగల వస్తువులూ లభిస్తాయి. ధరలు అదుపులోకి వస్తాయి. అంతవరకూ ఇంతే.

**పి. పూర్ణిమ** — **విజయవాడ**


**వనిత**

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 5 సంచిక: 3
సెప్టెంబర్: 1979
విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ప చందా: ఇరవైనాలుగు రూపాయిలు
శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)
మలేషియా: 90 సెంట్స్

చిరునామా:
చందమామ బిల్డింగ్స్
మద్రాసు-600 026

## జాతకాల పిచ్చి!

"అయ్యో పాపం! ఆ పిల్ల జాతకమలాటిది!" "అలాటి శకునాలు నా జాతకంలోనే లేవు!" ఇలాటి మాటలు మన సంఘంలో నూటికి యాభై మంది దగ్గర వింటుంటాం! మాకు తెలిసినవారి కుటుంబంలోని ఒక అమ్మాయికి పెళ్ళి చూపుల కొచ్చారు. అమ్మాయి, అబ్బాయి ఒకరికొకరు నచ్చారు! కానీ వారి జాతకాలు సరిపోలేదట. అబ్బాయి జాతకంలో ఇంటికి పెద్ద కూతురుగా ఉన్న అమ్మాయినే చేసుకోవాలిట! లేకుంటే అభివృద్ధి ఉండదట! అందుకని ఆ మహానుభావుడు వాదస్తపు ముసుగు కప్పుకుని వెళ్ళిపోయాడు ఈ అమ్మాయి వద్దంటూ! ఇంకా కొంతమంది ఏం చేస్తారంటే పెళ్ళి చూపులకు ముందే ఒకరి జాతకాలు మరొకరికి పంపించి పరిశీలించి జాతకాలు సరిపోయాయనే సంతృప్తి వినపడగానే పెళ్ళి చూపులకు ఏర్పాటు చేస్తారు! పెళ్ళికొడుకు ఎంత అనాకారి అయినా అప్రయోజకుడైనా ఆ అమ్మాయికి నచ్చకపోయినా చేసుకోవాల్సిందే! "నాకీ సంబంధం వద్దు" అని ఆ పిల్ల అనిందనుకోండి "అయ్యో ఇంత మంచి జాతకం గల కుర్రాడు ఇన్నాళ్ళకు దొరికాడు. ఇది వదులుకుంటే ఇంకెన్నేళ్ళు పదుతుందో నీకు పెళ్ళికావటానికి" అనేస్తారు! మాకు తెలిసిన ఇంకో అమ్మాయి జాతకంలో 'పెళ్ళవగానే మొగుడు చస్తాడు' అని ఉందట! ఆ అమ్మాయికి కాబోయే మొగుడి జాతకంలో కూడా "పెళ్ళవగానే పెళ్ళాం చస్తుంది" అని ఉండాలిట! అలాటి జాతకం గలవాడినే ఈ అమ్మాయి పెళ్ళి చేసుకుంటే ఏ దోషం ఉండదట! సరి! అలాటి జాతకం గలవాడి కోసం ఎక్కడ దండోరా వేయింవాలి?

అంతే! ఆ అమ్మాయి బ్రహ్మచారిణిగా మిగిలిపోయింది. ఆడపిల్లలకు ఈ విధంగా కూడా అన్యాయం జరుగుతోంది!

మరికొంతమంది బిడ్డ పుట్టగానే "జాతకం రాయించారా?" అంటుంటారు! మా అబ్బాయి జాతకంలో పన్నెండో ఏట నీళ్ళ గండం ఉంది. అందుకే సైడు కాలువలో పడ్డాడు. దాంతో దోషం పోయింది అంటుంది మా పక్కింటావిడ! ఈ జాతకాల పిచ్చి గలవాళ్ళను చూస్తే నవ్వాలో ఏడవాలో అర్థం కాదు! మనం అన్నిటిలోనూ పురోగమిస్తున్నాం! కాలాన్నిబట్టి మారుతున్నాం! సనాతన ఆచారాలు మూఢనమ్మకాలు వదిలేసి సాగిపోతున్నాం అని ఆత్మవంచన చేసుకోవటమే తప్ప మనకు తెలియకుండానే ఈ మూఢాచారాలన్నీ మన వెన్నంటి వస్తున్నాయనే సంగతి మనం గుర్తించలేకపోతున్నాం. ఈ విధంగా ఉంటే ప్రగతిపథంలో మనమేమి సాధిస్తాం?

ఎ. జయలక్ష్మీరాజు — అనంతపురం



ఈ సంచికలో 'ఊహల వీణ' అన్న చిట్టికథ (35 వ పేజీలో) వచ్చింది. ఈ చిట్టి 'కథా రచయిత్రి' – చెరువు కవిత. చలనచిత్ర రచయిత చెరువు ఆంజనేయశాస్త్రిగారి అమ్మాయి. మద్రాసులోని శారదా విద్యాలయంలో పదవ తరగతి చదువుతున్నది. "కథలు, గేయాలూ రాయాలన్నది నా సంకల్పం. నా రచన తొలిసారిగా అచ్చు కావడం ఇదే మొదటిసారి" అన్నది కవిత.

### వనిత సంవత్సర పరీక్ష

గత సంచికలో ఇచ్చిన 'వనిత సంవత్సర పరీక్ష' పత్రాలు పంపవలసిన తేదీ—జూలై 16 గా తప్పుపడింది. అది జూలై కాదనీ, ఆగస్టు 16 గా గమనించవలసిందనీ, సవరణ చేస్తూ దిన పత్రికల్లోనూ, 'విజయచిత్ర'లోనూ ప్రకటనలు ఇచ్చాము. అయినా కొందరు పాఠకులు సందేహాలను వెలిబుచ్చారు; ఉత్తరాలు రాస్తూనే వున్నారు. అందువల్ల, పరీక్షా పత్రానికి సమాధానాలను పంపవలసిన గడువు తేదీని, సెప్టెంబర్ 5వ తేదీకి పొడిగిస్తున్నాము. ఆ తేదీలోగా సంవత్సర పరీక్ష సమాధాన పత్రాలు మాకు అందేలా పంపగోరుతున్నాము.

గెలుపొందిన వారి పేర్లు అక్టోబర్ సంచికలో ప్రచురింపబడతాయి —వ. సం.

పూర్వం రోజుల్లో, కొన్ని దేశాల్లో భర్తలు ఊరు విడిచి వెళ్తూ, భార్యల శీలం చెడవచ్చునేమోనన్న శంకతో–"శీల రక్షణి" (Chastity Belt) లను బిగించేసి, తాళాలు వేసేవారుట. ఈ దారుణ క్రియలు నేటికీ కొన్ని ప్రాంతాల్లో అమల్లో వున్నాయా? దీన్ని గురించిన వ్యాసం—

**'శీల రక్షణి'**

—వచ్చే సంచికలో చదవండి!

### స్త్రీ కేవలం కీలు బొమ్మేనా?

మీరు 'వనిత'లో ప్రచురించే కథలను చదువుతుంటే "ప్రచురణకు స్వీకరించేది కూడా స్త్రీ లేనా?" అనిపిస్తోంది. ప్రతి కథ, ప్రతి వ్యాసం మగవారిని విమర్శిస్తూ, ద్వేషిస్తూ, స్త్రీలపై సానుభూతిని కురిపిస్తున్నట్లే వుంటున్నాయి. అదే వనిత మాస పత్రిక యొక్క ధ్యేయమా? అది బాగాలేదు. చాలా మంది స్త్రీలకు అన్యాయం జరుగుతున్న మాట వాస్తవమే. అలాంటి వారు తమ జీవితాన్ని ఎలా గడపాలో తమ భర్తలను ఎలా, తమ వైపు తిప్పుకోవాలో రచయిత్రులు వారి కథల ద్వారా తెలియజేస్తే బాగుంటుంది. ఈ రోజుల్లో నాటికలు వినబోయినా సినిమాలు చూడబోయినా, కథలు చదవబోయినా పురుషుల చేతిలో కీలు బొమ్మగా మారిన స్త్రీ గాథ తప్ప మరేమీ వుండదు. అది చూసిన పురుషులు "ఎలాగూ ముద్రపడింది" కదా అని, అదే దారిన పయనిస్తారు. అలా కాకుండా భార్యను సుఖపెట్టే భర్త మంచి మనసును, భార్యకు స్వేచ్ఛ నిచ్చిన భర్త విశాల హృదయాన్ని—కథల ద్వారా తెలియజేస్తే కఠినమైన మగవారిలో కూడా మార్పు రావచ్చు. కనుక ఇక మీదట అటువంటి కథలు మానేసి ఓర్పుతో నేర్పుతో మగవారిని ఎలా మార్చాలో స్త్రీలకు, స్త్రీలను ఎలా గౌరవించి, ఆదరించాలో పురుషులకు కథల రూపంలో అందిస్తే కథల్లో కొత్తదనమూ, పాఠకులకు ఉత్సాహమూ వుంటుందని నా అభిప్రాయం.

మంత్రవాది రాధ — నారాయణవనం.




ఆగస్టు 79 సంచికలో విజయ పద్మగారు, వి. సి మద్రాసు గార్లు రవివర్మ చిత్రాలు అనర్ఘ్యంగా వున్నాయని వ్రాశారు. రవివర్మ ప్రపంచ ప్రసిద్ధి పొందిన ట్రెడిషనల్ ఆర్టిస్ట్. మన భారత జాతికి గర్వకారణమైన చిత్రకారులలో అగ్రగణ్యుడు. ఆయన వ్రాసిన వర్ణ చిత్రాలు కొన్ని చాలా ఆర్ట్ గ్యాలరీలలో కూడా వున్నాయి. ఆ చిత్రాలలో వాస్తవికత వుట్టిపడుతూ వుండడమే కాక వర్ణ విశ్లేషణలో ఎంతో మెళకువ కన్పిస్తుంది. రవివర్మవంటి మహా చిత్రకారుల చిత్రాలు సేకరించే మా వంటి చిత్రకారులను, కళాభిమానులను మీ(మా)వనిత నిరుత్సాహపర్చదని ఆశిస్తూ ఈ ఉత్తరం వ్రాస్తున్నాము.

—టీవీయస్నెమ్ పద్మ, సుశీల, శైలజ, తెనాలి

బామ్మగారు చెప్పే పెళ్ళిమంత్రాలు శీర్షిక చదువుతుంటే 'అబ్బా ఈ మంత్రాలకు అర్థం ఇదా' అనిపిస్తున్నది. అవన్నీ పలికినట్లే నాకు గుర్తులేదు!

—బి. మృదులా కమలాకర్, రాజమండ్రి

ఆగస్టు సంచికలో 'నాణ్యతగల వస్తువులు ఎన్నుకోవటం ఎలా?' గురించి వినియోగదార్లకు తెలియజేసిన విషయాలు ప్రయోజనాత్మకంగా ఉన్నాయి. 'నింగినుండి నేలకు' సీరియల్ చాలా యింటరెస్టింగ్‌గా ఉంది. ''మన దేవాలయాలు'' శీర్షిక ద్వారా ఎన్నో పుణ్య క్షేత్రాల వివరాలు తెలియజేస్తూ మమ్మల్ని అమితా కర్షితుల్ని గావిస్తున్నారు. ''వైద్య విశేషాలు'' శీర్షిక పత్రికకే హైలైట్.

—లోకం సరస్వతి నర్సయ్య, నవీపేట

ఆగస్టు నెల 'వనిత'లో ''నేటి సమాజంలోని దురాచారాలను ఈనాటి వీరేశలింగం ఎలా ఎదుర్కొంటాడు?'' వ్యాసరచన పోటీలో ఉత్తమ బహుమతి పొందిన కె. యస్. కృష్ణకుమారిగారి వ్యాసం ఎంతో ప్రయోజనాత్మకంగా ఉంది! ''స్త్రీ స్వాతంత్ర్యం వైవాహిక బంధం'' విద్యార్థినుల శీర్షికలో బహుమతి పొందిన మూడు వ్యాసాలూ చక్కని అభిప్రాయాలను అందించాయి! వరకట్నపు పిశాచాల దురంతాల కోరలకు ఆహుతయిన 'రాధ' కథ ఎంతో హృదయ విదారకంగా ఉంది! పాటిబండ్ల విజయలక్ష్మిగారి 'ఈ జీవితమింతే!' కవితలో అంతు తెలియని ఆవేదన స్ఫురించింది!

—శ్రీమతి నజీర్‌హుసేన్, కావలి

ఆగస్టు వనితలో 'సీత' కథానిక బాగుంది. రచయిత్రి స్త్రీల మనస్తత్వం చక్కగా తెలియచేశారు. విద్యాజ్ఞానం లేని స్త్రీలకు, విద్యావంతులైన స్త్రీలకు చీరలు, నగలపై ఉన్న అభిలాష ఒకే తీరుగా వుంటుంది. స్త్రీ స్వాతంత్ర్యం, వైవాహికబంధం పై వ్యాసాలు మెచ్చుకో తగ్గవిగా ఉన్నవి.—రాచమల్లు ఇందిర, కోరగుంటపల్లె

ఆగస్టు సంచిక 'వనిత'లో 'నివురుగప్పిన నిప్పు' కథ చదివిన తరువాత ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోతున్నాను. అందులో పాత్రలన్నీ నా హృదయాన్ని కదలించివేసి మనసును స్పందింపచేశాయి. ఇటువంటి కథను వ్రాసినవారికి ప్రచురించిన మీకు నా ధన్యవాదాలు.

—జుత్తాడ సావిత్రి, విశాఖపట్టణము

''క్రిందటి సంచికలో గార్ల సరస్వతిగారు గోళ్ళకి రంగు ఎలా తయారు చేయాలో చెప్పారు - బాగానే ఉంది. కానీ తయారు చేయటానికి - అసిటోన్, అమైల్ అసిటేట్, టార్టారిక్ ఆమ్లము మొదలగు పదార్థాలు కావాలన్నారు. కానీ యిలాంటి పేర్లు చాలామంది గృహిణులకు (ముఖ్యంగా తక్కువ చదువుకున్నవారికి) కొత్తగా ఉండొచ్చు. అవి లభ్యమయ్యే చోటు కూడా తెలియకపోవచ్చు. కనుక, సులభంగా లభించే పదార్థములతో వీలుపడే వస్తువుల తయారీని సూచించమని, కోరుతున్నాను.

—వి. సీతామహాలక్ష్మి, తెనాలి

## వనిత మాటల కొలువు – 49

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | ద | 13 ర | 14 బా | ద | 15 ర | | 16 ఆ |
| త్మ | | 2 వి | ర | | 3 హి | 17 త | వు |
| | | 4 క | సా | 18 యి | | గు | |
| 5 జి | 19 జ్ఞా | | 6 ల | నే | | 7 లా | 20 లి |
| 8 లి | ని | 21 మా | | | | 9 ట | వి |
| బి | | 10 సి | రి | 22 గం | ద | ము | |
| 11 లి | 23 కి | క | | గ | | | 24 డొ |
| | ల | | 12 అ | మ్మ | క | చె | ల్లె |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు: పదకొండు మంది. వారు:

1. యం. బి. శ్రీనివాసలక్ష్మి, కావలి 2. ఎస్. లక్ష్మి, కాకినాడ 3. వి. కాత్యాయని, మహబూబ్‌నగర్ 4. డి. వసుంధర, కావలి 5. కె. గిరిజ, మినగల్లు 6. కె. మంజులాదత్త, ఆదోని 7. టి. భారతి, హైద్రాబాదు 8. ఆర్. దీప, కోరగుంటపల్లి 9. ఆర్. రజనీ రెడ్డి, కోరగుంటపల్లి 10. డి. హైమ, ఆత్మకూరు 11. ఎమ్. వసంత, వరంగల్.

బహుమతి మొత్తం రూ. 150 లను సమంగా పంచి వారికి అందజేస్తున్నాము.

## లోపల



మీ(మా)వనితలోని వెరైటి మాకెంతో నచ్చింది. ప్రపంచం శీర్షిక ఎన్నో విజ్ఞాన విషయాలు, వైద్య విశేషాలు, నేటి ప్రపంచ విజ్ఞానమంతా అందిస్తోంది. వాసిరెడ్డి సీతాదేవి నవల నింగినుండి నేలకు ఎంతో వాస్తవంగా ఉన్నది.

—డి. శకుంతల, పెద్దపాళ్యం

మీరు వనితలో వేసిన కుమారి కాంతి శ్రీదేవిగారి చిత్రం, పరిచయం చాలా బాగున్నవి.

—సి. పద్మాదేవి, కుప్పం




ప్రపంచంలో వనితలకి ఈ రోజున ప్రముఖ స్థానం లభిస్తోంది. రాజకీయాలలో వారు ప్రవేశించి ప్రధాన పదవులు స్వీకరించడంతో చరిత్ర చెప్పుకోదగ్గ మలుపు తిరిగింది. అయితే ప్రపంచ దేశాలలో వనితలు ప్రధాన మంత్రి పదవి స్వీకరించడం ఆసియా దేశాలలోనే ప్రారంభమవడంతో, ఆసియా ప్రపంచానికి మార్గం చూపింది. అలా ఆసియాలో ప్రారంభమయిన యీ 'చరిత్ర' యూరప్‌లో యిప్పుడు అడుగు పెట్టింది.

ఇంగ్లండులో మార్గరెట్ థాచర్ ప్రధాన మంత్రి పదవి స్వీకరించి, ప్రముఖ ప్రజాస్వామ్య దేశంగా చెప్పుకునే ఇంగ్లండు చరిత్రలోనే 'చరిత్ర' సృష్టించారు. ఆ తర్వాత పోర్చుగల్‌లో యిటీవల కుమారి మరియాడే లోర్డిస్ పింటాసిల్గో ప్రధాని కావడంతో ప్రపంచ రాజకీయాలలో వనితలు మరో అడుగు ముందుకు వేశారు. పోర్చుగల్ పేరు చెబితే నియంత సాలజార్ పేరు ఎవరికయినా జ్ఞాపకం వస్తుంది. 1968 లో సాలజార్ మరణం తర్వాత కెటానో కొంత ఉదారంగా పరిపాలించినా 1974 లో విప్లవం చెలరేగి ఆ ప్రభుత్వమూ పడిపోయింది. ఆ తర్వాత యీ రోజున మరియాడే నాయకత్వాన పోర్చుగల్‌లో పదకొండవ ప్రభుత్వం ఏర్పడింది. ఇంజనీర్‌గా, దౌత్యనీతిలో అందె వేసిన చేయిగా మరియాడే ఎంతో పేరు గడించింది. 1974 తర్వాత ఏర్పడిన రెండు ప్రభుత్వాలలో సాంఘిక సంక్షేమ శాఖా మంత్రిగా మరియాడే పదవీ బాధ్యతలు నిర్వహించింది. 1975 నుంచి 'యునెస్కో' లో పోర్చుగల్ రాయబారిగా మరియాడే వ్యవహరించింది. నలభయి ఎనిమిది సంవత్సరాల కుమారి మరియాడే లోర్డిస్ పింటాసిల్గో ప్రధానిగా పోర్చుగల్ చరిత్రని కొంత వరకయినా మార్చవచ్చు.

*

ప్రపంచంలో 'నిమిషనిమిషానికి' ప్రభుత్వాలు పడిపోయే దేశం మరొకటి వుంది. పేరు ఫ్రాన్స్. ఫ్రాన్స్ రాజకీయాలలోనూ మరో వనిత అగ్రస్థానానికి చేరుకుంటోంది. యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థ (యూరోపియన్ ఎకనమిక్ కమ్యూనిటీ) అధ్యక్షురాలుగా శ్రీమతి సిమోనీ వీల్ తన ప్రతిభని, ప్రత్యేకించి నిరూపించుకుంది. యాభయి మూడు సంవత్సరాల శ్రీమతి సిమోనీ వీల్ 1974 లో ఆరోగ్య మంత్రి పదవిని నిర్వహించి ఫ్రాన్స్‌లో వనితలకి మేలు కలిగించే చట్టాలు ఎన్నో చేశారు. అలా విస్తారమయిన పరిపాలనా అనుభవంతో ఫ్రాన్స్ రాజకీయాలలో శ్రీమతి సిమోనీ వీల్ అగ్రస్థానానికి చేరుకున్నారు.

*

ప్రపంచ దేశాలలో ప్రజాస్వామ్యానికి గట్టి పునాదులు పడిన దేశాలు కొన్ని వుంటే, నియంతృత్వపు చీకటి నుంచి ప్రజాస్వామ్యపు వెలుగులోకి రాలేకపోతున్న దేశాలు మరికొన్ని కనిపిస్తాయి. పెద్ద పెద్ద దేశాలలోనే కాక చిన్న చిన్న దేశాలలోనూ చరిత్ర గతి మారిపోతూ వుంటుంది.

లాటిన్ అమెరికాలోని నికరాగ్వా చాలా చిన్న దేశం. జనాభా కేవలం ఇరవయి లక్షలు. 1821 లో స్పెయిన్ నుంచి స్వాతంత్ర్యం పొంది 1838 లో సర్వ స్వతంత్ర దేశంగా రూపొందింది నికరాగ్వా. 1934 నుంచి సోమోజా వంశస్థులు నికరాగ్వా రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించడం ప్రారంభించారు. 1967 లో అధికారానికి వచ్చిన అనస్టాసియో సోమోజా నియంతృత్వ ధోరణులని నికరాగ్వాలోని ప్రజలు సహించలేక ఈ మధ్యనే తిరగబడ్డారు. తన 'పదవి'కి రాజీనామా యిచ్చి అమెరికాలో ఆశ్రయం వెదుక్కుంటూ అనస్టాసియో పలాయనం చిత్తగించాడు. అలా పారిపోతూ తిరిగి స్వదేశం రాగలననే నమ్మకంతో ప్రతినిధుల సభ అధ్యక్షుడు ఫ్రాన్సిస్కో ఉర్క్యూకి అధికారం అప్పగించాడు. నికరాగ్వాలో నియంతృత్వాన్ని అరికట్టాలని 1934 లో వీరోచితంగా పోరాడి మరణించిన శాండినిస్ట పేరుమీద జాతీయ విముక్తి సంఘటన నేటి సోమోజాకి వ్యతిరేకంగా పోరాటం నడిపింది.

1934నుంచి ప్రజలలో రాజకీయ చైతన్యం ఏర్పడి ప్రజాస్వామ్యాన్ని స్థాపించాలనే పోరాటం జరుగుతూ వచ్చినా, ప్రతి నికరాగ్వా నియంతకీ అమెరికా నుంచి అన్నిరకాల సహాయం లభించడం చేత వారి ఆటలు సాగుతూ వచ్చాయి. అయితే ప్రజలు గెరిల్లా పోరాటం ప్రారంభించడం, వారికి చుట్టుపక్కల దేశాలు చిన్నవయినా చేతనయిన సహాయం చేయడంతో అనస్టాసియో ఆటలు కట్టాయి. తన కొడుకుని తనకి వారసుడిగానూ మరో నియంతగానూ అనస్టాసియో 'తీర్చిదిద్దినా' దేశానికే తాను దూరం కావలసివచ్చి, కుమారుడికి పట్టాభిషేకం చేయలేకపోయాడు అనస్టాసియో.

*

1977 లో భారత దేశంలో రాజకీయంగా పెద్ద మార్పు వచ్చింది. ముప్ఫయి సంవత్సరాలుగా పాలనలో వున్న కాంగ్రెస్‌ని గద్దె దింపి జనతా పార్టీ అధికారాన్ని స్వీకరించింది. సమభావాలు గల కొన్ని పార్టీలు ఏకమయి జనతా పార్టీగా ఆవిర్భవించి ఎన్నికలలో నెగ్గాయి ఆ రోజున. ఆ మార్పుని ప్రపంచ దేశాలన్నీ ఎంతో ఆసక్తితో గుర్తించాయి. పత్రికా స్వాతంత్ర్యం కాపాడడానికి, ప్రజాస్వామ్యపు విలువలని పరిరక్షించడానికి జనతా ప్రభుత్వం చేసిన కృషిని పత్రికలు, ప్రజలు గుర్తించి ప్రశంస లందచేశారు.

అయితే భారత దేశంలో వివిధ రాజకీయ పక్షలలో ఏదో ఒక కారణం వలన చీలికలు ఏర్పడినట్లే జనతా పార్టీలోనూ ఏర్పడి, భారత దేశ రాజకీయాలలో మరో మార్పు సంభవించింది. మొరార్జీ దేశాయ్ ప్రధాని పదవికి రాజీనామా యివ్వడం, జనతా నుంచి విడిపోయిన రాజ్‌నారాయణ్ వర్గం సెక్యూలర్ జనతాగా రూపొందడం అతి శీఘ్రగతిలో జరిగిపోయాయి. జనతా (సెక్యూలర్) నాయకుడు చరణ్ సింగ్ రాష్ట్రపతి సంజీవ రెడ్డి కోరిన ప్రకారం ప్రధాన మంత్రిగా మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు. లోక్‌సభలో సభ్యుల సంఖ్య 538 కాగా చరణ్ సింగ్ మద్దతుదారులు 262 వరకూ వున్నారనే అంచనాతో ఆయనని మంత్రివర్గ నిర్మాణానికి రాష్ట్రపతి ఆహ్వానించారు. ఇక లోక్‌సభలో అధిక సంఖ్యాకులు తనని బలపరుస్తున్నారని చరణ్ సింగ్ నిరూపించుకోవాలి.

మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ లోక్‌సభలో సభ్యురాలు కాకపోయినా, ఆవిడ నాయకురాలుగా వున్న ఇందిరా కాంగ్రెస్‌కి లోక్‌సభలో 71 మంది సభ్యులు వున్నారు. చరణ్ సింగ్ లోక్‌సభలో తన మెజారిటీ నిరూపించుకోవాలన్నా, చరణ్‌సింగ్‌కి వ్యతిరేకంగా ప్రవేశపెట్టే అవిశ్వాస తీర్మానం నెగ్గాలన్నా అంతా ఈ 71 మంది సభ్యుల మీదే ఆధారపడి వుంది. ప్రధానిగా చరణ్ కొనసాగడమో, మధ్యంతర ఎన్నికలకి దేశం సిద్ధమవడమో ఈ సంచిక విడుదలయేసరికి తేలిపోతుంది. □

# చూపుకి
# అందం
# కంటికి
# చలవ
# అదే
# ఐటెక్స్
# కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలన్నూ కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033

# ముఖచిత్రం: షిరీన్ పీటర్స్





ఒక థియేటరు. పాట కచేరీ జరగబోతోందని, వినడానికి అభిమానులంతా కూచుని వున్నారు. తెర లేచింది. ఆర్కెస్ట్రా బృందం ఒక్కొక్కరే వస్తూ శ్రుతులు కలుపుకుంటున్నారు. అయితే వాళ్ళు రావడానికి ముందే, గాయని రంగస్థలం మీద కూర్చుని వున్నది. వాళ్లురాగానే, తనూ శ్రుతి కలిపి, హాయిగా పాడేసి ప్రేక్షకుల కరతాళ ప్రశంసలు అందుకుంది. ఆ గాయని పేరు - షిరీన్ పీటర్స్. అయితే, ఆ అమ్మాయి ముందే అలా కూర్చుని ఎందుకు కనిపించింది ? —

ఆమె నడవలేదు !! చిన్నతనంలోనే ప్రాప్తించిన 'పోలియో మైలిటిస్ 'తో ఆమె కాళ్లు బలహీనమైపోయి, ఆమె లేచి నడవగలిగే స్థితిని పోగొట్టాయి ! అదే దురదృష్టం ! అంత చక్కని కంఠం, సంగీత జ్ఞానం; వాటికి తోడు ఆకర్షణీయమైన ముఖం వున్న అమ్మాయికి, ' కాళ్లు పని చెయ్యవు ' అని చెబితే, ఎవరైనా నమ్ముతారా? —

తల్లిదండ్రులకు షిరీన్ ఒక్కతే సంతానం. ఆ దంపతులకు ఆ అమ్మాయే - కంటికి దీపం. సుకుమారంగా, కోమలంగా ఆడుతూ పాడుతూ వచ్చింది షిరీన్. ఆమెకు ఏడో సంవత్సరం రానున్నదని, ప్రతి సంవత్సరం లాగే ఆ సంవత్సరమూ పుట్టినరోజు పండగ జరపాలని, తల్లిదండ్రులు ఏర్పాట్లు చేస్తున్నారు....

ఆ రోజుకు కొద్దిరోజుల ముందు - షిరీన్‌కు విపరీతమైన జ్వరం కాచింది. పరీక్షించిన డాక్టర్లు ' పోలియో మైలిటిస్ ' అన్నారు ! అలా ఆడుతూ పాడుతూ, ఛెంగు ఛెంగున ఎగిరే అమ్మాయి, మళ్ళీ నడవగలదా ?—ఆ తల్లిదండ్రుల శోకం చెప్పడానికి లేదు. భగవంతుడి మీద భారంవేసి, అవసరమైనంత డబ్బు ఖర్చుచేసి, దివా రాత్రులూ అమ్మాయి అంగవైకల్యాన్ని పోగొట్టడానికి శ్రమించారు. ఆమె బాగానే కోలుకున్నా, కాళ్లు మాత్రం ఇంకా బలహీనంగానే వున్నాయి....

అయితే, షిరీన్‌గాని, ఆమె తల్లిదండ్రులుగాని, నిరుత్సాహ పడిపోలేదు. ' నడవలేకపోవడం ' అన్న వికలత్వాన్ని తలచుకుని బాధపడి ప్రయోజనం లేదు. ఎలాగైనా షిరీన్ బాగా చదువుకోవాలి; సంగీతమూ అభ్యసించాలి !

అప్పుడామె, మద్రాసు చర్చ్ పార్క్ కాన్వెంట్‌లో చదువుకుంటున్నది. షిరీన్‌కు ఉపాధ్యాయినులు ఎంతో సహాయపడ్డారు. ఆమెకు ఎప్పటికప్పుడు పాఠాలు ఇంటికే పంపించేవారు. ప్రైవేట్‌గా ఆమె ఒక ఉపాధ్యాయిని పర్యవేక్షణలో పరీక్ష రాయడానికి కూడా అనుమతించారు.

తర్వాత షిరీన్ విద్యోదయాలో చేరింది; తర్వాత ఎతిరాజ్ కళాశాలలో చేరింది. ఇప్పుడు ఆమె - ఎమ్. ఎ. (ఎకనమిక్స్).

" నేను స్కూల్లోనూ, కాలేజీలోనూ చదువుకుంటున్నప్పుడు, నాపట్ల ఎంతో అభిమానం, కరుణ చూపిస్తూ నాకెంతో సహాయపడ్డారు - ఉపాధ్యాయులూ; సాటి మిత్రులూ. వాళ్లందరి సహకారం లేకపోతే, నేను ఎమ్. ఎ. వరకూ వచ్చి వుండేదాన్నా !" అన్నది షిరీన్. ఆ కృతజ్ఞతా భావాన్ని ఆమె కళ్ళు విస్పష్టంగా విప్పి చెప్పాయి.

దాన్ని నేర్చుకుందామన్న ఆశతో, చిన్నతనంలో అడుగులు వెయ్యడం నేర్చుకుంటున్నా, తర్వాత ఆ అదృష్టం తనకి లేదని ఆమె దిగులుపడిపోకుండా, ఆ ఉత్సాహాన్ని పాట మీదికి మరల్చింది. కర్ణాటక సంగీతాన్ని క్షుణ్ణంగా నేర్చుకుంటూనే, సుగమ సంగీతంలో కూడా పాటలు పాడసాగింది; 'గాయని ' గా పేరూ తెచ్చుకున్నది !

కుంటుపడిన తన జీవితాన్ని చూసుకుంటూ షిరీన్ తల్లడిల్లిపోలేదు; చింతలతో, దిగులుతో ఏడుస్తూ కూచోలేదు. తానొకటి తలిస్తే భగవంతుడు ఒకటి తలిచినా, ' విధివ్రాత ' ను ధిక్కరించ దలచుకుంది; సాధించింది ! మామూలు జీవితాన్ని గడపలేని అనేకమందికి, ఆమె ' ఆదర్శ వనిత ' గా 'నిలబడ గలిగింది' !

షిరీన్‌కు బొమ్మలు పెయింట్ చెయ్యడం, చక్కని అల్లికలు చెయ్యడం కూడా వచ్చు. వాటిల్లో కూడా ప్రవీణురాలు అనిపించుకోడానికి ఆమె కృషి చేస్తున్నది.

షిరీన్_కచేరీలలో జేసుదాస్, జాలీ అబ్రహం మొదలైనవారితో పాడింది. చాలా స్టేజి నాటకాల్లోనూ, రేడియోలోనూ, టెలివిజన్‌లోనూ పాడింది; సినిమాల్లో కూడా పాడుతున్నది. భక్తి పాటలతో గల గ్రామఫోన్ రికార్డులు కూడా ఆమెవి వున్నాయి. చిత్ర సంగీత దర్శకుడు దక్షిణామూర్తి, షిరీన్ గాత్రంలోని మాధుర్యాన్ని విని, చిత్రాల్లో అవకాశాలు కల్పించారు. కొన్ని తమిళం, మలయాళ చిత్రాల్లో షిరీన్ పాటలు పాడింది.

" నా అభిమాన గాయని దక్షిణ దేశంలో జానకి; ఉత్తర దేశంలో లతామంగేష్కర్ " అని చెప్పింది షిరీన్. □

"ఒక వ్యక్తి మరో వ్యక్తిదగ్గర మంచి పన్నెండు వేల రూపాయలు అప్పుగా తీసుకున్నాడు. ఎంత కాలమైనా అది తిరిగి యివ్వకపోయేసరికి రగడ ప్రారంభమైంది. 'అసలు నేను అప్పే తీసుకో లేదు. అది నా సంతకం కాదు' అంటాడు మొదటి వ్యక్తి. దాంతో విషయం కాస్తా కోర్టుకెక్కింది. నేను పత్రాల మీద వున్న సంతకాన్ని, ఆ వ్యక్తి సంతకంతో అతిశ్రద్ధగా పోల్చి చూశాను. రెండింటికీ తేడా కనిపించింది. సాక్ష్యాధారాలతో సహా ఆ విషయం నిరూపించాను. ఎవరో అతని సంతకం పెట్టి దొంగ పత్రాలు సృష్టించారనీ, అతను అసలు అప్పు తీసుకోలేదనీ రుజువయింది. దాంతో ఒక అమాయక ప్రాణి ఎటువంటి యిబ్బంది పాలూ కాకుండా తప్పించుకుని బయట పడగలిగాడు." అని చెప్పారు శ్రీమతి జయాదేవి—యిటువంటి కేసుల్లో వేలి ముద్ర నిపుణుల పాత్ర గురించి తెలియజేస్తూ.

బెంగళూరుకు చెందిన శ్రీమతి వి. జయాదేవి ప్రారంభంలో వృత్తిరీత్యా న్యాయవాది. ఆ వృత్తిలో వుండగానే ఆమె వేలిముద్రలను, చేతి వ్రాతలను కనిపెట్టడంలో శిక్షణ పొందారు. కర్ణాటక రాష్ట్రంలో ఆ విధంగా శిక్షణ పొందిన ప్రథమ మహిళా న్యాయవాది ఆమె కావడం విశేషం!

"మా తండ్రి శ్రీ జి. వీరప్పగారు ప్రముఖ న్యాయవాది, వేలి ముద్రల నిపుణుడు. ఆయన పనిలో నేను కూడా సహాయపడుతూ వుండేదాన్ని. ఆయన నాకు ఏ విధంగా పరీక్షించాలో సూచనలు యిస్తూ వుండేవారు. ఆ విధంగా నాకు ఈ వృత్తి పట్ల అభిరుచి ఏర్పడింది" అంటారు శ్రీమతి జయాదేవి. ఆమె 1972లో స్వతంత్రంగా ప్రాక్టీసు ప్రారంభించారు.

జయ, సాధారణంగా రోజూ చాలాసేపు తన గదిలోని న్యాయసూత్ర గ్రంథాల మధ్య, దుర్భిణీ ద్వారా వేలిముద్రలను పరిశీలిస్తూనూ గడుపుతూ వుంటారు. కొన్ని కేసులలో ఆమె నిర్ణయం అతి విలువైనది. ఆ నిర్ణయం పైనే తీర్పు ఆధారపడి వుంటుంది. కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలలో జరిగే సివిల్ కేసులనే ఆమె చాలామటుకు తీసుకుంటూ వుంటారు.



వేలి ముద్రలు కనిపెట్టడంలో తను తీసుకునే జాగ్రత్తలను గురించి చెబుతూ "ముందుగా నేను ముద్దాయి తనది కాదు అని వాదించే సంతకాన్ని పరిశీలిస్తాను. అతని సంతకాన్ని ఆ సంతకంతో పోల్చి చూస్తాను. ఇందుకు ఫొటోగ్రఫీ చాలావరకు సహాయపడుతుంది. బాగా పెద్ద సైజులో ఆ సంతకాన్ని ఫొటో కాపీ తీసి క్షుణ్ణంగా పరిశీలిస్తాను. అందులోని ప్రతీ అక్షరం కూడా క్షుణ్ణంగా చూడాలి. అప్పుడే అది నిజమైన సంతకమా... దొంగ సంతకమా అన్నది తేల్చడానికి సాధ్యపడుతుంది. దాన్ని ఆధారం చేసుకుని కోర్టు వారికి ఒక నివేదికను సమర్పిస్తాను" అన్నారు జయ. ఆమె ఈ ఆరేళ్ళ కాలంలోనూ ఎందరో అమాయకులకు శిక్ష పడకుండా తప్పించారు.



"అలా సంతకాలు పోల్చి చూస్తున్నప్పుడు ఎంతో ఏకాగ్రత, పరిశీలనా దృష్టి అవసరం" అంటారు ఆమె. జయాదేవి సంతకాలు, వేలిముద్రలు పోల్చి చూసేందుకు దుర్భిణీ, భూతద్దాలు, ఫ్లాష్, మాగ్నిఫైర్‌వంటి సాధనాలు వుపయోగిస్తారు. ఇవి కాక ఆమెవద్ద కొన్ని అత్యంత ఆధునిక పరికరాలు కూడా వున్నాయి.

ఈ వృత్తి చేపట్టడానికి తగిన శిక్షణ యిచ్చే కేంద్రాలు ఏవైనా వున్నాయా? అని అడిగితే - "మనదేశంలో ప్రభుత్వ గుర్తింపు పొంది ప్రత్యేకించి వేలి ముద్రలకంటూ శిక్షణా కేంద్రాలు ఏవీ లేవనే చెప్పాలి." అన్నారు జయ. ఆమె ప్రస్తుతం న్యూయార్క్‌లోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అప్లైడ్ సైన్స్'లో పోస్ట్ ద్వారా ప్రత్యేక శిక్షణ పొందుతున్నారు. ఈ శిక్షణవల్ల ఆమె వేలిముద్రల గురించి ఎన్నో నూతన విషయాలు తెలుసుకో గలుగుతున్నారు.

శ్రీమతి జయాదేవి ఒక పక్క తన వృత్తిని కొనసాగిస్తూనే మరోవైపు కుటుంబ భారాన్ని కూడా సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.

"ఏ విద్యలోనైనా రాణించాలంటే ముఖ్యంగా ఆ వృత్తిపై అభిరుచి, పైకి రావాలన్న అభిలాష, దాని మీద పూర్తిగా మనస్సును లగ్నం చేయడం అవసరం. నా వరకు-నేను చేపట్టిన వృత్తి ఎంతో వుత్సాహజనితంగానూ, నన్ను సవాలు చేస్తున్నట్లుగానూ అనిపిస్తూ వుంటుంది" అంటారు జయ. ☐

—కమలాకుమార్

# జర్మనీలో స్త్రీలు

[న్యూ ఢిల్లీలోని ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ దౌత్య కార్యాలయంలో ప్రథమ కార్యదర్శి పదవిని నిర్వహిస్తున్నారు డా॥ (కుమారి) గురున్ లీటోఫ్. ఇటీవల ఆమె మద్రాసుకు వచ్చినప్పుడు 'వనిత' ఆమెతో జరిపిన ప్రత్యేక గోష్ఠిని ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

**మీ దేశంలో స్త్రీలకు వున్న హక్కులను గురించి చెబుతారా?**

జనాభాలో పురుషులకన్నా స్త్రీలే ఎక్కువగా వున్న దేశం మాది. అయినా పందొమ్మిదో శతాబ్దారంభం వరకు స్త్రీలు వంటింటి కుందేళ్లుగానే తమ బ్రతుకులు వెళ్లబుచ్చారు. ఆ శతాబ్ద మధ్యకాలం నుంచి స్త్రీలు హక్కుల కోసం పోరాటాన్ని ప్రారంభించారు. దాని పర్యవసానంగా 1877 సం॥ నుంచి వారికి ఓటు హక్కు లభించింది. 1893 లో బెర్లిన్ విశ్వవిద్యాలయంలో స్త్రీలకోసం ప్రత్యేక పాఠ్య విభాగం ప్రారంభించబడింది. 1899 లో కార్మిక వనితా సంఘం ప్రారంభించబడింది. 1900 లో అమలులోకి వచ్చిన సివిల్‌కోడ్ ద్వారా స్త్రీలకు మరికొన్ని హక్కులు లభించాయి. 1908 లో రాజకీయాలలో పాల్గొనడానికి స్త్రీలు అనుమతించబడ్డారు. చట్టం ముందు స్త్రీ పురుషులు సమానులే అన్న ప్రాథమిక చట్టం 1949 లో అమలులోకి వచ్చింది.

**చట్ట ప్రకారం స్త్రీలకు వుండే హక్కులు వివరించారు. అయితే ఇవన్నీ కార్యాచరణలో సాధ్యమవుతున్నాయా?**

మంచి ఉద్యోగం, డబ్బు, ఆత్మ విశ్వాసం — ఈ మూడే సమాజ వ్యతిరేకశక్తుల్ని అదుపులో పెట్టగలవు. వీటివల్ల స్త్రీ సాంఘిక అంతస్తు పెరుగుతుంది. అయితే మా దేశంలో సాధారణంగా స్త్రీలు పురుషుల కన్నా తక్కువగానే సంపాయిస్తున్నారు. అంచేత ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో నైతం పురుషుల కన్నా వెనుకబడే వున్నారు. ఐతే, ఈ స్థితి పోగొట్టడానికి ప్రస్తుతం ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంటోంది. ఉదాహరణకు ఒకటి చెబుతాను. వివాహితలైన స్త్రీలకు మా దేశంలో మంచి గౌరవాదరాలు వుంటాయి. కాని విడాకులు పుచ్చుకున్న వారిని గౌరవించడం లేదు. అంచేత 1972 లో అమలులోకి వచ్చిన పెన్షన్ రిఫార్మ్ ఆక్ట్ ప్రకారం - విడాకులు తీసుకున్న స్త్రీలకు — ఆమె భర్తతో కాపురం చేసిన కాలం అనుసరించి వారికి పెన్షన్ ఏర్పాటు చేయాలన్న మార్పు తీసుకొచ్చింది.

**మీ దేశంలో కుటుంబ జీవితం గురించి కొంచెం వివరంగా చెప్పగలరా?**

కుటుంబ నిర్వహణలో స్త్రీ పురుషులిద్దరికీ సమానమైన హక్కు, బాధ్యతలు వున్నాయి. ప్రాథమిక చట్టం ద్వారా తల్లిదండ్రులకు పన్నులలో ఎన్నో రాయితీలు, సహాయాలు, సంరక్షణ ఇవ్వబడ్డాయి. బెర్లిన్‌లో నూతన దంపతులకు 'వివాహ ఋణం' కూడా మంజూరు చేయబడుతోంది. కుటుంబ ఆదాయం ఎలా వున్నప్పటికీ మొదటి పాప పుట్టగానే 50 మార్క్సు (203 రూపాయలు); రెండో పాపకు 80 మార్క్సు (326 రూపాయలు) ఆ తర్వాత పుట్టే ఒక్కొక్క పాపాయికీ 150 మార్క్సు (610 రూ॥) అలవెన్సు ఇస్తారు. గృహస్థులకు అద్దె అలవెన్సు, వయోధికులైన దంపతులకు విశ్రాంతి గృహాలు ప్రభుత్వం ఏర్పరుస్తుంది. అంతేకాదు. కుటుంబ ఆదాయం మరీ తక్కువ వున్నవారు ప్రభుత్వం నుంచి ఉపకార వేతనం పొందడానికి అవకాశం వుంది. ఆదాయం చాలినంత వున్నవారు పొదుపు చేయడానికి - పెట్టుబడి పెట్టడానికి ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది.

కుటుంబ పెద్ద ఆరోగ్యం చెడి చికిత్స పొందే పక్షంలో ఆరు వారాలపాటు పూర్తి వేతనం ఇస్తారు. ప్రమాదవశాత్తు లేదా తీరని జబ్బువల్ల ఉద్యోగం చేయలేకపోయినప్పుడు - అలాంటి వారికి పిల్లల సంఖ్యను బట్టి, పెన్షన్ ఇవ్వబడుతుంది. ఒకవేళ



ఆయన చనిపోయినట్టయితే-పెన్షన్ పొందే హక్కు భార్యకూ పిల్లలకూ వుంటుంది.

విడాకులు తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు - విడాకులు తీసుకునే వారిలో ఎక్కువ సౌకర్యాలు వున్నవారు (సాధారణంగా పురుషులు) అటువంటి సౌకర్యాలులేని వారికి సరైన జీవనోపాధి చూసుకునేవరకు ధన సహాయం చేయవలసి వుంటుంది. విడాకులు తీసుకునేప్పుడు పిల్లల చదువు, సంరక్షణ మొదలైన విషయాలు కూడా జాగ్రత్తగా గమనించబడతాయి. ఇక పెళ్లి కాకుండానే తల్లులైనవారు, వితంతువులు మొదలైన వారి పిల్లలకు తగిన భద్రత, సహాయ సహకారాలు అందజేస్తారు. ఆ పిల్లలు పెరిగి ఏదైనా ఒక వృత్తి విద్యను నేర్చుకునేవరకు

వారిని సంరక్షించి పోషించే బాధ్యతను ప్రభుత్వం వహిస్తుంది.

**ఉద్యోగినులైన స్త్రీల స్థితిగతులు మీ దేశంలో ఎలా వున్నాయి ?**

మా దేశంలో ఒక కోటిమంది అంటే మొత్తం కార్మిక జనావళిలో దాదాపు మూడైపైశాతం మంది స్త్రీలు. చట్టప్రకారం స్త్రీలు ఎలాంటి వృత్తినైనా చేపట్టవచ్చు. అయితే మా వనితలు చాలామంది కార్యాలయాలలో ఉద్యోగం చేయడానికి, వైద్య రంగంలో సహాయకులుగా వుండడానికి, శిరోజా లంకరణ మొదలైన వృత్తులను స్వీకరించడానికి



ఎక్కువ ఆసక్తి చూపుతున్నారు. ఉద్యోగినులైన వనితలలో దాదాపు నాలుగు శాతం మంది మాత్రమే నిర్వహణాధికారులుగా వుంటున్నారు. ఇంచుమించు ఒక కోటి నలభై లక్షల మంది స్త్రీలు కుటుంబ నిర్వహణ భారంవల్ల ఉద్యోగాలకు వెళ్ళడం లేదు. వారిలో ఎవరైనా పై చదువులు చదవాలన్నా ఉద్యోగాలు చేయాలన్నా వారికి ఇతోధిక సహాయ సహకారాలు అందజేయడానికి ప్రభుత్వం సంసిద్ధంగా వుంది. ఇటీవలి కాలంలో పెళ్ళయిన స్త్రీలు ఉద్యోగం చేయడం ఎక్కువైంది. వారి పిల్లలను చూసుకోడానికి 'డే మదర్స్' అనబడే ఆయాలు వున్నారు. ఉద్యోగం చేసే స్త్రీలకు 'ఆరోగ్య భీమా పథకం' అమలులో వుంది.

**మీ దేశంలో స్త్రీ విద్య గురించి చెప్పగలరా ?**

ఇటీవల స్త్రీలకు చదువుకునే అవకాశం ఎక్కువయింది. మాదేశ విద్యా విధానంలో ప్రైమరీ, సెకండరీ స్థాయి I, సెకండరీ స్థాయి II, ఉన్నత విద్య అని నాలుగు స్థాయిలు వున్నాయి. ప్రాథమిక విద్య, ఉన్నత విద్య ఉచితంగానే బోధించబడుతుంది. చాలామందికి పాఠ్య పుస్తకాలు ఇతర పరికరాలు ఉచితంగానే ఇవ్వబడతాయి. కిండర్ గార్డన్ పిల్లలకు ఉచితంగానే 'ప్రమాద భీమాలు' వున్నాయి. కిండర్ గార్డన్‌లలోనూ, ఇతర పాఠశాలలలోనూ పదిహేడు మందికి ఒక టీచర్ చొప్పున వుంటారు. ఏ చదువు చదవాలన్నా స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యం వుంది. అయితే చాలామంది స్త్రీలు - ఆర్ట్స్ సబ్జక్ట్సులోనే ఎక్కువ ఆసక్తి కనబరుస్తారు.

**జర్మనీ ప్రజా జీవితంలో స్త్రీల పాత్ర గురించి చెబుతారా ?**

నేను ఇంతకుముందే చెప్పినట్లు - బాధ్యతాయుతమైన గొప్ప పదవులను కొందరు నిర్వహిస్తున్నప్పటికీ వారు సంఖ్యలో చాలా తక్కువ. ప్రజా జీవితంలో కూడా వారి స్థాయి అలాగే వుంది. స్త్రీల కుటుంబ జీవితం, ఉద్యోగం, సాంఘిక, రాజకీయ రంగాలలో వనితా జన ప్రగతికోసం పాటు



పడాలనే సంకల్పంతో కొన్ని స్త్రీ సంఘాలు సంఘటితమై - 'ది జర్మన్ విమన్స్ కౌన్సిల్' స్థాపించారు. ఇందులో అరవై లక్షలకు పైగా సభ్యులు వున్నారు. దీని ప్రభావంతోనే ఇటీవల స్త్రీలు సాంఘిక ప్రగతి కార్యక్రమాలలో ఎంతో ఉత్సాహంతో పాల్గొంటున్నారు.

**భారతదేశం గురించి – స్త్రీల స్థితి గురించి మీ అభిప్రాయం ఏమిటి ?**

భారతీయ సంస్కృతిపట్ల జర్మన్ దేశస్థులకు గల ఆసక్తి కారణంగా ఈ రెండు దేశాల మధ్య శతాబ్దాల తరబడి ప్రగాఢమైన సాంస్కృతిక సంబంధ బాంధవ్యాలు నెలకొని వున్నాయి. ఢిల్లీలోని ఐక్య జర్మనీ రిపబ్లిక్ దౌత్య కార్యాలయంలో ఒక సంవత్సరంగా ఉద్యోగం చేస్తున్నాను. ఈ ఒక్క సంవత్సరంలో భారతదేశం అన్ని ప్రాంతాలను తిరిగి చూసే అవకాశం కల్గింది. పాశ్చాత్య నాగరికతను కొంతవరకు అనుకరిస్తున్నప్పటికీ - భారతీయుల సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, అలవాట్లు, ప్రాచీన భారతీయ సంస్కృతికి అనుగుణంగానే వున్నాయి. భారతీయులు నిష్కపటులు. ఎంతో సహనం, సర్దుకుపోయే మనస్తత్వం, మతానురక్తి వీరిలో ఎక్కువగా కనిపిస్తుంది. మా దేశంలోని స్త్రీలకన్న ఇక్కడివారు కుటుంబం మీద, పిల్లల మీద ఎంతో ప్రేమ, ఆప్యాయత, శ్రద్ధ కనబరుస్తున్నారు. జర్మనీలో ఉద్యోగావకాశాల నిమిత్తంగా కుటుంబ సభ్యులు వివిధ ప్రాంతాలకు విడి పోవడం జరుగుతుంది. అలాంటిది ఇక్కడ అంతగా లేనందు వల్లనో ఏమో–కుటుంబం అంటే ఎంతో ప్రేమానురాగాలు కలిగి వుంటారు. వరకట్నం, బాల్య వివాహాలు లాంటి సమస్యలు భారత స్త్రీలను ఇంకా వేధిస్తూనే వున్నాయి. ఈ సమస్యలన్నీ తీరిపోయి పురుషులతోపాటు స్త్రీలు అన్నివిధాలా సమానస్థాయికి చేరుకోగలిగే కాలం రావాలి. అలాంటి మంచి రోజులు త్వరలోనే రావాలని ఆశిస్తున్నాను. □

వివాహం విద్యకు ఆటంకమవుతుందంటారు పెద్దలు. సాధారణంగా వనితల విషయంలో అది నిజమేననిపిస్తుంది. ఎంచేతంటే చాలా మంది- చిన్నప్పటి నుంచి నాట్యం, సంగీతం మొదలైన కళలపట్ల అభిరుచి పెంచుకుని, ఆ విద్యలను నేర్చుకుని తమ ప్రతిభను కనబరుస్తారు. కాని వివాహం కాగానే తగిన ప్రోత్సాహం లభించక పోయేసరికి, తాము నేర్చుకున్న విద్యలకు తిలోదకాలిచ్చేసి, సంసారసాగరంలో మునిగిపోతారు.

పెళ్లి అయిన తర్వాత కూడా తాము నేర్చుకున్న విద్యకు న్యాయం జరగాలన్న పట్టుదలతో భర్తను ఒప్పించి - ఒక ప్రక్క కుటుంబ జీవితాన్ని కొనసాగిస్తూనే తమ తమ కళారంగాలలో రాణించే వనితలు చాలా అరుదుగా వుంటారు. అటువంటి వారిలో ఒక వనిత — ప్రముఖ నాట్య కళాకారిణి శ్రీమతి పరిమళ కల్పన. ఆమె హైదరాబాదు వాస్తవ్యురాలు. ప్రసిద్ధ నాట్య కళావేత్త అయిన శ్రీ నటరాజ రామకృష్ణ శిష్యురాలు.

కల్పనకు నాట్యం నేర్చుకోవాలన్న ఆసక్తి చిన్నప్పటి నుంచీ వుండేది. కాని ఆమెకు మొదటి నుంచీ మొట్టమొదట నిరుత్సాహమే ఎదురయ్యేది. ఇంట్లో పెద్దలు కల్పనను నాట్య ప్రదర్శనలకైతే, తీసుకువెళ్లేవారే కాని నాట్యం నేర్చుకుంటానంటే కోప్పడేవారు. అంచేత - ఆమె కలల్లోనే తననొక 'నర్తకి'గా వూహించుకుని-మురిసిపోతూ వుండేది. ఆ కల చెదిరితే, ఆమె కళ్లల్లో నాట్యానికి బదులు కన్నీరే మిగిలేది!

కల్పనకు వివాహమైన తర్వాత-తన ఆశయాన్ని భర్తకు చెప్పింది. మొదట నిరుత్సాహమే ఎదురైంది. ఐనా - పట్టువదలలేదు. చివరికి ఎలాగైతేనేం-భర్తను ఒప్పించింది! ఆ తర్వాత....

"మొట్టమొదట ప్రఖ్యాత నాట్యాచార్యులు, నాట్య శాస్త్ర రచయిత అయిన శ్రీ నటరాజ రామకృష్ణ గారి శిష్యరికం లభించడమే నా అదృష్టం. వారి వద్ద శిక్షణ పొందడం ప్రారంభించాను. తొలి రోజులలో నాట్యం నేర్చుకోవడం నాకు చాలా కష్టం అనిపించింది. ఒళ్ళంతా నొప్పులతో బాధ పడేదాన్ని. ఐనా, లెక్కచేసేదాన్ని కాదు. జ్వరం వచ్చినాసరే, తరగతికి హాజరయ్యేదాన్ని.

వర్ణచిత్రం: సత్యకుమార్



# కల్పన

"మా గురువుగారు – సామాన్యంగా ప్రతివారు చేసే భరతనాట్యం, కూచిపూడి అంశాలేకాక, ప్రాచీనకాలం నుండీ మన దేశంలో ఆలయాల్లో ప్రదర్శింపబడే అపూర్వ నృత్యాలను నేర్పించారు. దేవాలయాల్లో ప్రదర్శించే నవసంధి, బలిహరణ నృత్యాలు ప్రత్యేకంగా చెప్పించారు. 'భామా కలాపం' తెలుగువారి నృత్యకళలో ఒక విశిష్టమైన అంశం. అది నేర్చుకోవాలన్న అభిలాష కనబర చాను. పూర్వం పిఠాపురం సంస్థానానికి చెందిన కుంతి మాధవస్వామి ఆలయానికి చెందిన కీ॥ శే॥ శ్రీమతి పెండేల సత్యభామ, మండపేట వాస్తవ్యురాలు కీ॥ శే॥ శ్రీమతి దుగ్గిరాల మాణిక్యమ్మ, శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నమ్మ యిత్యాది కళావేత్తలచే ప్రదర్శింపబడిన అపూర్వ బాణీ 'భామాకలాపం' నాకు మా గురువుగారు నేర్పించారు. ఈ బాణీ తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో విశేష ప్రచారంలో వున్నది. దేవాలయ నృత్యాలలో శైవ, వైష్ణవ ఆగమరీతిలో ప్రదర్శించే నృత్యాలలో కూడా శిక్షణ యిచ్చారు. ఇలా పలు నృత్యరీతులలో శిక్షణ పొంది '77 అక్టోబర్ 20న హైదరాబాదులోని రవీంద్రభారతిలో తొలిసారిగా రంగప్రవేశం చేశాను. అప్పటి నుంచీ పలు చోట్ల ప్రదర్శనలు యిస్తూ వస్తున్నాను" అన్నారు కల్పన.



తనకు నాట్యంలోని ప్రాచీన కళారూపాలపట్ల ప్రత్యేకమైన ఆసక్తి ఏర్పడడానికి గల కారణాలను వివరిస్తూ ఆమె యిలా అన్నారు.

"ఒక రోజు సాయంత్రం మాకు క్లాసు జరుగుతుండగా ముమ్మిడివరం నుంచి ఇద్దరు పెద్దలు వచ్చారు. అందులో ఒకరు వృద్ధులు. వారు గురువుగారిని ప్రత్యేకంగా ఒక పదం అభినయించమని కోరారు. "ఎవడేవాడు.... మొన్నటి నుండియు.... మన యింటి చుట్టును... మరులు కొన్నట్టుల తిరుగాడుచున్నాడు." ఈ పదాన్ని గురువుగారు ఒక గంటకాలం అభినయించారు. వాద్యగోష్ఠి లేదు. ఆహార్యం లేదు. కేవలం పాట, మృదంగ వాద్యం- వీటితో అంత చక్కని రీతిలో జరిగిన కళా ప్రదర్శనను నేను ఎక్కడా చూడలేదు. ఆ సమయంలో నేను పొందిన తన్మయత్వం యింతా అంతా కాదు. ఆ సాత్వికాభినయంలో ప్రత్యేక కృషి చేయాలన్న సంకల్పం కలిగి, నా అభిలాషను గురువుగారికి తెలియజేశాను.

"వారు క్షేత్రయ్య, సభాపతయ్య, అన్నమయ్య యిత్యాది ప్రసిద్ధ పదకర్తల పదాలు, జావళీలు కాక, అల్లసాని పెద్దన రాసిన మనుచరిత్రలోని కొన్ని పద్యాలు, పుష్పబాణ విలాపం, కృష్ణకర్ణామృతంలోని శ్లోకాలు, శ్రీ వేంకట పార్వతీశకవుల 'ఏకాంతసేవ' పద్యాలు, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి పద్యాలకు సాత్వికాభినయం నాకు నేర్పించారు. ఈ విభిన్న కళా రూపాలను కూడా కళాభిమానులు, ప్రేక్షకులు ఆదరిస్తూ వుండడంతో-నాకు వీటిని ప్రదర్శించడం పట్ల ఎక్కువ ఉత్సాహం ఏర్పడింది:"

కల్పన పలు నాట్య ప్రదర్శనలు యిచ్చినా, తను యింకా విద్యార్థి దశలోనే వున్నానంటుంది. "గృహిణిగా వుంటూ - ఈ సాధన కొనసాగించడం కష్టమే. ఐనా, నన్ను ప్రోత్సహిస్తున్న భర్త లభించారు. ఎప్పుడూ నా అభివృద్ధిని కాంక్షిస్తూ, నన్ను ఆశీర్వదించే గురువుగారు లభించడం నాకు కలిగిన మరో అదృష్టం. పెద్దల ఆశీర్వాదాలతో-ముందు ముందు ఈ నాట్య కళారంగంలో మరికొన్ని పాఠాలు నేర్చుకుని, కళారాధనలో తరించాలన్నదే నా ఆశయం!" అంటారు కల్పన. ❋

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

—'బ్రాహ్మీదేవి'

"నేను ప్రేమా-ధనం గురించిన కథలే వ్రాస్తాను. ఇంతకంటె వ్రాయతగింది ఏముందసలు?" అన్నది ప్రఖ్యాత బ్రిటిషు నవలా రచయిత్రి జేన్ ఆస్టెన్. విశ్వవిఖ్యాతి పొందిన ఆమె నవల "ప్రైడ్ అండ్ ప్రిజుడిస్" – ప్రేమా ధనముల పరస్పర సంఘర్షణకు ఉత్తమ ఉదాహరణ ఐన సుఖాంత సాంఘిక నవల.

క్రీ. శ. 1775 డిశంబరు 16న ఇంగ్లాండులో హేంప్‌షైర్‌లోని చిన్న గ్రామంలో ఒక మతాచార్యునికి కుమార్తెగా జన్మించింది జేన్ ఆస్టెన్. ఆమెకు ఆరుగురు సోదరులు - ఒక సహోదరి. చదువంతా ఇంటి దగ్గరే జరిగింది ఆమెకు. తండ్రి ఉద్యోగ విరమణం తరువాత వారి కుటుంబం బాత్ అనే సముద్రతీర పట్టణానికి మారింది. జేన్ మొత్తం ఆరు పెద్ద నవలలు వ్రాసింది. చిన్నప్పటి నుంచి తన చుట్టూ ఉన్నదాన్ని, జరుగుతున్నదాన్ని, విన్పిస్తున్నదాన్ని నిశితంగా పరిశీలించడంవల్లనే ఆమె గొప్ప రచయిత్రి అయింది.

'సెన్స్ అండ్ సెన్సిబిలిటీ' - 'ఎమ్మా' అనే నవలలు కూడా కొంత పేరు పడ్డాయిగాని ఆమె పేరు చెప్పగా వెంటనే జ్ఞాపకం వచ్చేది మాత్రం 'ప్రైడ్ అండ్ ప్రిజుడిస్' నవలే. ఈ పుస్తకంలో ఆమె ఉత్సాహం, రచనాశక్తి ఉరకలువేస్తూ కన్పిస్తాయి. ఆ కాలంనాటి ఆంగ్ల సంఘ మధ్య తరగతి కుటుంబాలు, వారి చుట్టూ అల్లుకున్న ఆచారాలు, ఆర్థిక సమస్యలూ–అలవాట్లూ మొదలైనవన్నీ యీ నవలలో చెక్కు చెదరకుండా కన్పిస్తాయి.

కథ : బెన్నెట్ పెండ్లి కావలసిన అయిదుగురు అమ్మాయిల తండ్రి. మధ్య తరగతి కుటుంబీకుడు. చిన్న భూస్వామి, బింగ్లీ అనే ధనికుడైన బ్రహ్మచారి వీరున్న ప్రాంతాలకు వస్తాడు. అతనికెట్లాగైనా ఒక కుమార్తెను అంటగట్టాలని బెన్నెట్ భార్య ఆలోచిస్తుంది. బెన్నెట్ తొందర వద్దంటాడు. భార్య బలవంతం మీద బెన్నెట్ బింగ్లీతో పరిచయం చేసుకుంటాడు.

ఒక విందు సందర్భంలో బెన్నెట్ కుటుంబం బింగ్లీ కలుస్తారు. బింగ్లీతో అతని స్నేహితుడు డార్సీ కూడా వస్తాడు. డార్సీ కూడా ధనికుడు, బ్రహ్మచారి. అతని దురహంకార ప్రవర్తనకు బెన్నెట్ రెండవ కుమార్తె ఎలిజబెత్ బాధపడి అతని పైన ద్వేషాన్ని పెంచుకుంటుంది. అయితే ఆమె అక్క జేన్‌కూ బింగ్లీకి పరస్పరం సదభిప్రాయం కల్గుతుంది. బింగ్లీ అతని తోబుట్టువులు క్రమంగా జేన్‌కు సన్నిహిత స్నేహితులౌతారు. డార్సీకీ ఎలిజబెత్‌కూ ఎత్తి పొడుపులూ, వెక్కిరింపులూ. ఒకనాడు జేన్ బింగ్లీ కుటుంబాన్ని చూడటానికి వచ్చి అకస్మాత్తుగా జబ్బుపడి వారి దగ్గర కొన్నాళ్లు ఉండిపోవలసి వస్తుంది. ఎలిజబెత్ అక్క రోగం నయమయ్యేదాకా దగ్గర ఉండాలని



బింగ్లీ ఇంటికి వానలో తడిసి మూడు మైళ్ళు నడిచి వస్తుంది. ఆమె ఆ విధంగా రావడం బింగ్లీ సోదరి కేరొలిన్ వెక్కిరిస్తుంది. ఎలిజబెత్ అక్కకు పరిచర్య చేస్తుండగా అక్కడనే ఉన్న డార్సీ ఆమెను మెచ్చుకుంటాడు. అతనిపై ఆశలు పెంచుకున్న కేరొలిన్ మండి పడుతుంది. అతనికి ఎలిజబెత్ మీద అసహ్యం కలిగించాలని ప్రయత్నం చేస్తుంది కానీ ఫలించలేదు. డార్సీకి బెన్నెట్ భార్య మీద సదభిప్రాయం లేదు. ఆమె పన్నాగాలు పన్నుతుందని. ఎలిజబెత్ చెల్లెళ్ళ మీద కూడా అంతే. అందులో లిడియా సైనిక ఉద్యోగులంటే పిచ్చి అభిమానం చూపిస్తుందని - మిగిలిన యిద్దరు తెలివి తక్కువ దద్దమ్మలనీ. ఈ అభిప్రాయాల మూలాన ఎలిజబెత్‌తో అతను తన హృదయం విప్పి చెప్పలేకపోతాడు.

ఇంతలో కాలిన్సు అనే బంధువొకడు బెన్నెట్ ఇంటికి వచ్చి కొన్నాళ్ళు తిష్ఠవేశాడు. అతడు అధిక ప్రసంగం మనిషి. ఆర్భాటం ఆడంబరం అతనికి సహజం. తనకు ఆశ్రయమిచ్చి ఉపాధి కల్పించిన జమీందారిణి కేధరిన్ వెంటనే పెండ్లి చేసుకోమన్నదనీ ఆమె ఆజ్ఞ శిరసావహించి ఎలిజబెత్‌ను పెండ్లాడతాననీ అతడు బెన్నెట్ దంపతులకు చెప్పాడు. ఎలిజబెత్ అతన్ని నిరాకరిస్తుంది. తండ్రి ఆమె నిర్ణయాన్ని ఆమోదిస్తాడు. తల్లి బాధపడుతుంది. కాలిన్సు మళ్ళీ ఒకసారి ప్రయత్నించినా ఎలిజబెత్ తన నిర్ణయాన్ని మార్పు చేసుకోలేదు. తరువాత అతడు ఎలిజబెత్ స్నేహితురాలు 'చార్లొటీలూకాస్' అనే ఆమెను పెండ్లి చేసుకుంటాడు.

డార్సీకి పరిచయస్థుడొకడు జార్జివిఖాం సైనికోద్యోగి. మంచి చురుకుగలవాడు. ముందుకు తోసుకుపోయే ఆర్భాటం కలవాడు. అతను ఎలిజబెత్‌తో డార్సీని గురించి అబద్ధాలు చెప్పి– క్రూరుడనీ – దుర్మార్గుడనీ – తండ్రి వీలునామా

ప్రకారం తనకీయవలసిన సొమ్ము యివ్వలేదనీ చెప్పి -అయిష్టత కలిగిస్తాడు.

ఇంతలో బింగ్లీ తన మకాం లండనుకు మార్చాడు. బింగ్లీ చెల్లెళ్ళు అతడు జేన్‌ను పెండ్లి చేసుకోకుండా ఆపుతున్నాడనీ – వాళ్ళ దృష్టిలో యిది తక్కువ సంబంధంగా ఉన్నదనీ బెన్నట్ కుటుంబానికి తెలిసిపోతుంది. జేన్ బాధపడినట్లు కన్పించదు. లండన్‌లో ఉన్న మేనత్త యింటికి జేన్ వెళ్ళి కొన్నాళ్ళు ఉంటుంది-అక్కడ బింగ్లీని చూచే అవకాశం ఉంటుందేమోనని. ఎలిజబెత్ కూడా తరువాత వెళ్ళగా బింగ్లీ వచ్చి జేన్‌ను కలుసుకోనేలేదనీ–అసలు బింగ్లీకి జేన్ లండన్‌లో ఉన్నట్లు తెలియకుండా డార్సీ చేశాడని గ్రహిస్తుంది.

ఎలిజబెత్ లండన్ నుంచి కెంట్ వెళ్ళి తన స్నేహితురాలిని చూచింది. స్నేహితురాలు చార్లొటి లూకాస్ పరిస్థితి దయనీయంగా ఉంది. ఆమె మరొక గత్యంతరం లేక కాలిన్సును పెండ్లాడిందని గ్రహించింది ఎలిజబెత్.

కెంట్‌లో ఉండగా అక్కడ తన మేనత్త జమీందారిణి కేథరిన్‌ను చూడటానికి వచ్చిన డార్సీని కలుసుకుంది ఎలిజబెత్. డార్సీకి ఎలిజబెత్ పైన ప్రేమ బయటపడి తన్ను పెండ్లి చేసుకోమని దురుసుగా అడుగుతాడు. ఎలిజబెత్ సమాధానం చెప్పకుండా జార్జివిఖామ్‌కు అన్యాయం ఎందుకు చేశావనీ_జేన్ లండన్‌లో ఉన్నట్లు బింగ్లీకి ఎందుకు తెలియకుండా చేశావనీ నిగ్గతీసి అడుగుతుంది. డార్సీ మౌనంగా ఆమె ఆరోపణలు విని వెళ్ళి మర్నాడొక దీర్ఘలేఖ వ్రాశాడు. జార్జివిఖామ్-ఉత్త అబద్ధాలకోరనీ అతనికి తానేమీ అన్యాయం చెయ్యలేదనీ వివరాలు వ్రాశాడు. పైగా అతడు డార్సీని గురించి ఎలిజబెత్ మనస్సు పాడుచెయ్యడానికే పన్నాగాలు పన్నాడని నిరూపించాడు. జేన్‌రాక బింగ్లీకి చెప్పని కారణమేమంటే - తాను మనస్ఫూర్తిగా బెన్నెట్ కుటుంబ సంబంధం బింగ్లీ అంతస్థుకి తగినది కాదని విశ్వసిస్తున్నానని వ్రాశాడు.

ఈ లేఖ మూలాన డార్సీ నిజాయితీపరుడనీ-కల్మషం లేనివాడనీ ఎలిజబెత్‌కు అర్థమైంది. తన తల్లీ చెల్లెళ్ళను గురించి అతనికి మంచి అభిప్రాయం లేకపోయినా అతడు సజ్జనుడేనని ఆమెకు అర్థమైంది. పూర్వమొకప్పుడు డార్సీ కుటుంబానికి సేవకుడుగా పని చేసినవాడొకడు తటస్థపడి డార్సీ యోగ్యతను గురించి అతని కుటుంబాన్ని గురించి ఎలిజబెత్‌కు చెప్పాడు. ఆమెకు డార్సీ పైన మంచి భావం వృద్ధికాసాగింది.

ఎలిజబెత్ మేనత్తతోనూ మేనత్త పెనిమిటితోనూ ప్రయాణం చేస్తుండగా డార్సీ మళ్ళీ కన్పిస్తాడు. వాళ్ళ మధ్య మరికొంత అనురాగం విస్తరించింది. ఎలిజబెత్ చెల్లెలు లిడియా జార్జివిఖామ్‌తో లేచి పోయిందని వర్తమానం రాగా ఆ సంగతి ఆమె డార్సీకి చెప్పి – తల్లిదండ్రుల్ని ఓదార్చటానికి ఇల్లు చేరింది.

లిడియా చేసిన పనివలన తన కుటుంబానికి అప్రతిష్ఠ వచ్చిందనీ అందుచేత డార్సీ తన్నిక పట్టించుకోడనీ ఎలిజబెత్ ఆందోళనపడింది-ఆమెకు డార్సీ పైన ప్రేమ దృఢం అవటంచేత. కాని ఎలిజబెత్ మీద తనకున్న గాఢప్రేమ మూలంగా డార్సీ విఖామ్‌ను వెదకి పట్టుకుని అతనికున్న అప్పులు తీర్చి అతనికి లిడియాతో చట్టసమ్మతమైన వివాహం చేసి-అవసరాలకు కొంత ధనమిచ్చాడు. ఇదంతా రహస్యంగా చేస్తాడు.

బెన్నెట్ కూడా లిడియాకోసం వెదకుతూ వెళ్ళి కనుక్కోలేక తిరిగివచ్చిన తరువాత లిడియా

కనిపిస్తున్న రవీంద్రనాథ టాగూర్ చిత్రంలోని తెల్లటి జుత్తు, గడ్డం ఎంతో సహజంగా వున్నాయి కదూ-కాని అది రేఖా చిత్రం గానీ, పెయింటింగ్ కానీ కాదు దారంతో చేసిన టాగూర్ చిత్రం!

అంత అద్భుతంగా ఆ 'చిత్రాన్ని' రూపొందించిన వనిత – శ్రీమతి రేఖా చక్రవర్తి. ఆమె 1953 లో ఉషా ఎంబ్రాయిడరీ కుట్టుపని తనంలో ఉత్తీర్ణురాలయ్యారు. 1964 లో సూది పనితనంలో లేడీ బ్రాబర్న్ డిప్లొమా పొందారు.

ఆమె ఈ విధంగా సుభాస్ చంద్రబోస్, నెహ్రూ, ప్రసిద్ధ బెంగాలీ కవి నజ్రుల్ ఇస్లాం, ఫుట్‌బాల్ క్రీడాకారుడు పీలె, లెనిన్ వంటి ప్రముఖుల చిత్రాలు వివిధ రంగాలలోని కార్మికులు, పక్షులు, ప్రకృతి దృశ్యాలు అనేకం రూపొందించారు. ఇవి చెయ్యడానికి ఆమె ఉపయోగించిన పరికరాలు—మామూలు దారం, కుట్టుమిషను. సూది--అంతే.

"వీటితోబాటు కాస్త బొమ్మలు గీసే పరిజ్ఞానం వుంటేచాలు. మనం ఎంచుకున్న వ్యక్తి గానీ, దృశ్యం గానీ మనసులో మననం చేసుకుంటూ వుంటే రేఖా చిత్రం గీసుకోవడం సులభం. ఆ తరువాత దారాలతో దాన్ని తీర్చిదిద్దవచ్చును" అని చెప్పారు రేఖ.

ఆమె నలుపు తెలుపు చిత్రాలేకాక పలు రంగుల దారాలతో వర్ణ చిత్రాలు కూడా తయారు చేశారు. వాటిల్లోని రంగుల మేళవింపు ఎంతో సహజంగానూ, 'ఇది నిజమైనదా' అన్న భ్రాంతి కలిగించేటట్లుగానూ వుంటాయి. వాటిల్లో అర్ధరాత్రి చల్లని వెన్నెలలో ప్రకాశిస్తున్న జపానీయుల కోట 'పగోడా' చెప్పుకోదగ్గది. నీలి ఆకాశం నీడలలో ఆ కోట



రేఖా చక్రవర్తి

మిళితమవడం ఆమె అత్యద్భుతంగా రూపొందించారు.

ఐతే, ఆమె నలుపు తెలుపు దారాలతో చేసిన చిత్రాలలోనే ప్రసిద్ధి గాంచారు. 'జీసస్ క్రైస్ట్', 'గృహ నిర్మాణంలో నిమగ్నుడైన కార్మికుడు'-చిత్రాలు ఛాయాచిత్రాలా అన్నంత భ్రమ కలిగించే విధంగా, దగ్గరకు వెళ్లి ముట్టుకుని చూసిన తరువాతగాని అవి దారాలతో చేసినవని నమ్మకం కలగనంత సహజంగా వున్నాయి. ఆమె చేసిన చిత్రాల్లో మరో గొప్ప చిత్రం – 'ఫెయిర్' (సంత). ఈ చిత్రం మాత్రం ఆమె ఒక ఛాయాచిత్రం చూసి ప్రభావితురాలై చేశారు. అందులో ఒక గ్రామానికి చెందిన చిన్నారి బాలిక, తమ గుడిసె బయట వున్న కొయ్యస్తంభం పట్టుకుని నోరు తెరిచి, గుడ్లప్పగించి భయంతో దూరంగా కనిపిస్తున్న ఏదో దృశ్యం చూస్తూ వుంటుంది. ఆ చిత్రంలోని చిన్నారి పాపను చూస్తూ వుంటే ఆ పాప నిజంగా మన ముందు నిల్చుని వున్న అనుభూతి కలుగుతుంది.



"ఎంబ్రాయిడరీ పనితనంతో నిలువెత్తు లెనిన్ చిత్రాన్ని తయారు చేయాలన్నది నా చిరకాల వాంఛ. అది ఈ మధ్యనే నెరవేరింది. లెనిన్ కార్మిక నాయకుడు. రష్యా దేశపు వనితలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని ప్రసాదించిన వ్యక్తి. అందుకే ఈ అంతర్జాతీయ మహిళా దశాబ్దంలో ఆ చిత్రాన్ని రూపొందించాలనుకున్నాను" అన్నారు రేఖ.

ఆ ఏడడుగుల ఎత్తు లెనిన్ చిత్రాన్ని ఆమె కలకత్తాలోని రష్యన్ దౌత్య కార్యాలయం వారికి సమర్పించారు. ఆ చిత్రాన్ని వారు మాస్కోలోని లెనిన్ సెంట్రల్ మ్యూజియంకి పంపారు. అక్కడ ప్రదర్శింపబడుతున్న ఈ చిత్రాన్ని వివిధ దేశాల నుంచి వచ్చిన అనేకమంది యాత్రికులు చూసి, మెచ్చుకుంటున్నారు.

శ్రీమతి రేఖా చక్రవర్తి పలు బహుమతులు, అవార్డులు పొందారు. టెలివిజన్, రేడియో ప్రసంగాలు చేశారు. ప్రస్తుతం ఆమె కలకత్తాలోని ఎంబ్రాయిడరీ శాఖలో వుద్యోగం చేస్తున్నారు. □

భర్తతో వచ్చి తాము పెండ్లి చేసుకున్నామని-డార్సీ ఎంతో సహాయం చేశాడనీ చెప్పుతుంది. ఎలిజబెత్ సంతోషపడుతుంది. డార్సీ చేసిన మంచి పని అంతా ఎలిజబెత్ మేనత్త లండన్‌లో చూచి ఉండటం వలన లేఖ ద్వారా ఎలిజబెత్‌కు తెలుపుతుంది. ఎలిజబెత్‌కు డార్సీ పైన గౌరవం పెరుగుతుంది. లిడియా విఖాం వెళ్ళిపోయిన తర్వాత బింగ్లీ మళ్ళీ బెన్నెట్ కుటుంబ పరిసరాలకు వస్తాడు. జేన్‌తో అతని వివాహం నిశ్చయమైంది.

జమీందారిణి కేథరిన్ కోపంతో బెన్నెట్ గృహానికి వచ్చింది. డార్సీ ఎలిజబెత్‌ను వివాహం చేసుకోబోతున్నాడని వదంతి ఆమె విన్నందువలన ఆమెకు కోపం వచ్చింది. తన కూతుర్నే డార్సీకి ఇద్దామనుకున్నదసలు. అయితే ఆ కూతురు వెర్రిబాగులది. జమీందారిణి ఎలిజబెత్‌ను డార్సీపై ప్రేమ పెంచుకోవద్దని బెదిరించింది. ఎలిజబెత్ తెలివితక్కువదికాదు. చాలా శాంతంగానే ఆమెతో "ఇది మీకు సంబంధించిన సంగతి కాదు. మీరు కల్పించుకోకండి" అని చెప్పింది.

జమీందారిణి వెళ్ళి డార్సీతో ఎలిజబెత్ చెప్పిన మాటలు చెప్పగా అతడు సంతోషపడ్డాడు ఎలిజబెత్ తన్ను గాఢంగానే ప్రేమిస్తున్నదని. డార్సీ వినయంతో ఎలిజబెత్‌ను కలుసుకొని తన్ను స్వీకరించమని అర్థించాడు. ఆమె సంతోషంతో అంగీకరించింది.

ముగ్గురు కుమార్తెల వివాహాలు పూర్తి అయినవని బెన్నెట్ భార్య ఆనందించింది. అయితే బెన్నెట్ మాత్రం ఇంకా ఇద్దరు కుమార్తెల వివాహాలు ఎప్పుడౌతాయోనని ఎదురు చూడసాగాడు.

ఈ కథలో జేన్ ఆస్టెన్ రచనా శిల్పం ఎక్కడ ఉన్నదంటే-ఆమెకు తెలిసిన సాంఘిక పరిధుల్లో ఆవేశ ప్రగాఢత్వాలను సృష్టించడంలో.

జేన్ ఆస్టెన్ బ్రతికి ఉండగా ఆమె రచనలకు కీర్తి రాలేదు. ఆమె 18 జూలై 1817 నాడు మరణించింది. ఇప్పుడామె ఆంగ్ల సాహిత్య ఆకాశంలో ఉజ్జ్వలతారగా ఉన్నది. □



# పొగతాగడం మాన్పించలేరూ?

"వయసులో వున్న తరుణీమణులు మీ చేరువకు రావాలని ఆశిస్తున్నారా? చనిపోయేవరకు నవయౌవనంతో వుండాలని మీరు కోరుకుంటున్నారా? ఐతే ఇవాళే సిగరెట్ కాల్చడం మొదలెట్టండి." ఇది ఒక పొగాకు కంపెనీ వ్యాపార ప్రకటన!

విచిత్రమైన ఆ ప్రకటన చూసిన ఒక అధికారి– ప్రకటన చేసిన వ్యాపారిని "ఏమిటీ వ్యాపార ప్రకటన? ఇలాంటి అబద్ధాల ప్రకటనలు చెయ్యొచ్చా?" అని మందలించాడట. అయితే ఆ వ్యాపారి నవ్వుతూ "అబద్ధం కాదండి.... ఆ ప్రకటన అక్షరాలా నిజం. పొగతాగేవాళ్ళలో పుంసత్వం నశిస్తుంది. అంచేత ఎలాంటి సంకోచమూ లేకుండా యువతులు వాళ్ళ దగ్గరికి వెళ్లొచ్చు. ఇక పొగ పీల్చేవాళ్ళు చిన్న ప్రాయంలోనే పోతారు గనుక ముసలితనం వచ్చే ప్రసక్తే లేదు కదండీ" అన్నాడట!

పాశ్చాత్యదేశాలలో తప్ప మన దేశం స్త్రీలలో అంతగా లేనప్పటికీ పొగపీల్చే దురలవాటు ఎక్కువ మంది పురుషులకు పసిప్రాయంలోనే పట్టుకుంటోంది. అయినా పొగతాగడం వల్ల ఏర్పడే దారుణ-పర్యవసానాలు తెలుసుకుని-భర్తను, అన్నదమ్ములను, పిల్లలను, పెద్దలను ఈ అలవాటుకు లోను కాకుండా చూసుకోడం; అలా వుంటే దానిని పోగొట్టడానికి ప్రతి గృహిణీ ప్రయత్నించడం– ఎంతైనా శ్రేయస్కరం.

అసలీ దురలవాటు ఎలా ఏర్పడుతుంది? పరిశోధకులు చెప్పే కారణాలు ఇవి:

ఇంట్లో పెద్దలు పొగపీల్చడం చూసినప్పుడు తాము కూడా పీల్చాలనే ఉబలాటం పసి హృదయాలలో తలెత్తుతుంది. తాము అభిమానించే సినిమా నటుల్నీ, ఆటగాళ్లనీ నాయకులనీ అనుకరించాలనే ఉబలాటంతో ఈ అలవాటుకు కొందరు లోనవుతారు. తమ స్వతంత్ర భావాలను వ్యక్తీకరించే సంజ్ఞలుగా, పెద్దల ఆధిక్యాన్ని వ్యతిరేకించే భావవ్యక్తీకరణగా కూడా కొందరిలో సిగరెట్ కాల్చడం మొదలవుతుంది. పాపగా వున్నప్పుడు అమ్మ ఒడిలో పాలు పట్టిన తియ్యటి అనుభూతి అంతశ్చేతనంలో అణగారి, వున్నట్టుండి పైకి రావడంతో ఆ అసంకల్పిత ఆశలను తీర్చుకునేందుకు బాలలు పొగపీల్చడానికి పూనుకుంటారన్నది– కొందరి మనస్తత్త్వ వేత్తల విచిత్రమైన భావన! 'మూడ్' కోసం కొందరు సిగరెట్ కాలిస్తే 'కంపెనీ' కోసం మరికొందరు ఈ అలవాటును తోడు చేసుకుంటారు. "మనశ్శాంతి లేనప్పుడు క్లిష్టమైన పరిస్థితుల్లో ఒక్క సిగరెట్ కాలిస్తే చాలు ఎంతో రిలీఫ్ ఫీలవుతాం" అంటారు మరి కొందరు.

కారణం ఏదైతే ఏం?—ఇవాళ సామాన్య మానవుడి సాధారణ బలహీనతగా మిగిలిపోయింది సిగరెట్ కాల్చడం!

అయితే సాధారణమైన ఈ బలహీనత, మనిషిని అసాధారణమైన ఎన్నో రోగాలకు గురిచేస్తోంది.

కేన్సర్‌తో ప్రాణాలు కోల్పోయేవాళ్ళల్లో చాలా మందికి శ్వాసకోశాల ఆరోగ్యం దెబ్బతినడమే కారణం. శ్వాసకోశాల అనారోగ్యానికి ముఖ్య కారణం పొగత్రాగడం! పొగత్రాగడం మానడంతో శ్వాసకోశాల అనారోగ్యం చాలావరకు మెరుగయ్యాయని వైద్య పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. కొందరికి శ్వాసకోశాలు బాగున్నా-నోరు, పెదవులు నాలుక, కొండ నాలుక మొదలైన చోట్ల కేన్సర్ రావడానికి అవకాశం వుంది. శ్వాసకోశాల కేన్సర్‌ను ప్రారంభదశలో కనుగొన్నట్టయితే - శస్త్రచికిత్స ద్వారా నయం చెయ్యొచ్చు. అయితే దురదృష్టవశాత్తు వ్యాధి బాగా ముదిరితే తప్ప, రోగలక్షణాలు బయట పడటం లేదు.

పొగత్రాగడం – నోరు, నాలుక, గొంతు శ్వాసకోశాలలో కేన్సర్ రావడానికి ప్రత్యక్షంగానూ, మూత్రకోశం, ఆహారనాళం మొదలైన చోట్లలో కేన్సర్ రావడానికి పరోక్షంగానూ దోహదం చేస్తుంది. గుండెజబ్బు, ఆస్త్మా మొదలైన రోగాలు పొగపీల్చడం వల్ల ఉధృతమౌతాయి.

పొగాకువల్ల కొందరికి అలెర్జీ ఏర్పడుతుంది. దీన్ని అశ్రద్ధ చేయడం వల్ల 'యాంబ్లియోపియా' అనే నేత్రవ్యాధి వస్తుంది. కంటిపొరనరాలను పొగ బాధించడమే దీనికి కారణం.

సిగరెట్ పొగలో రకరకాల రసాయనిక పదార్థాలు వున్నాయి. సిగరెట్‌ను - ఆఖరువరకు కాల్చడం వల్ల నికోటిన్, తార్, కార్బన్



**ఇంటికి వచ్చే బంధుమిత్రులు కొందరు సిగరెట్ కాలుస్తూ మాట్లాడుతారు. వారు వెళ్ళాక కూడా పొగ వాసన కొడుతూనే వుంటుంది. అలాంటప్పుడు అక్కడ కొవ్వొత్తి వెలిగిస్తేచాలు–ఆ సిగరెట్ వాసన పోతుంది!**

మీ ఇంట్లో ఎవరైనా సిగరెట్లు కాల్చే వారు వుంటే వారిచేత సిగరెట్లు మాన్పించాలనీ మీరు పలువిధాల ప్రయత్నాలు చేస్తూ వుంటే – ఈ లెక్క చెప్పి ఇలా కూడా ప్రయత్నించి చూడండి:

సగటున ఆ వ్యక్తి రోజుకు రెండు పాకెట్లు కాలుస్తారనుకుందాం. పాకెట్టు ఖరీదు ఒక రూపాయి అనుకోండి. అంటే రోజుకు 2 రూపాయిలయింది. నెలకు 60 రూపాయలయింది। సంవత్సరానికి 720 రూపాయలయింది. ఆయన తన ఇరవయ్యోఏట సిగరెట్లు తాగడం ఆరంభించి, అరవయ్యోఏడు వచ్చేవరకూ–దాదాపు 40 సంవత్సరాలపాటు సిగరెట్లు కాల్చినట్టుగా లెక్క వేదాం. అంటే 28 వేల 8 వందల రూపాయలు - ఆ వ్యక్తి తన జీవిత కాలంలో కేవలం సిగరెట్ల మీద ఖర్చు చేస్తున్నారన్నమాట. ఇంకా ఖరీదైన సిగరెట్లు కాల్చేవాళ్ళయితే, ఆ ప్రకారంగా లెక్క వేసి చూడండి. ఇంకా ఎక్కువ వస్తుంది. అంటే ఒక జీవిత కాలంలో ఒక వ్యక్తి సిగరెట్ల మీద సగటున దాదాపు 30 వేల రూపాయలు తగలేస్తున్నాడన్నమాట. అలా అంత డబ్బు వృధా చెయ్యకుండా ఆదా చేస్తే - చిన్న స్థలం కొనుక్కుని ఇల్లు కట్టుకునే ప్రయత్నమే చెయ్యొచ్చునే।

—రాధ

[ఈ 'సిగరెట్ల లెక్క' కొంతకాలం క్రితం 'వనిత'లో వచ్చినదే. అయితే, ఈ వ్యాసంతో పాటు వుంటే, ఉచితంగా వుంటుందన్న వూహతో మళ్లీ ప్రచురించాము. —వ సం]

మోనాక్సైడ్..రక్తంలోని హెమోగ్లోబిన్‌తో కలిసి ప్రాణవాయువును గ్రహించే శక్తిని మందగిస్తుంది. నాశికాద్వారం రెండుగా విడివడేచోట పొగ ఎక్కువగా తగులుతుంది. అందుకే శ్వాసకోశ కేన్సర్ ఇక్కడే ప్రారంభమవుతుంది. శ్వాసద్వారాల కండరాలు పెద్దవిగా వాచి ఆరోగ్యం చెడుతుంది. శ్వాసకోశం గాలి అరలలో ఒక విధమైన ద్రవం స్రవించి వాయుప్రసరణకు ఆటంకం కలిగిస్తుంది. గాలి అరలు సంకోచించి, చిన్నవి కావడంతో వాయుప్రసరణ మరీ తగ్గుతుంది. పర్యవసానంగా గాలి అరలలో విషపు అణువులు వ్యాపించి 'ఎంఫిసిమా' అన్న వ్యాధికి దోహదం చేస్తుంది.

సిగరెట్ పొగలోని నికోటిన్—గుండె, రక్తనాళాలు మొదలైన అనిచ్ఛా కండరాలను అదుపులో వుంచే నాడీమండలాన్ని దెబ్బతీస్తుంది. కాళ్ల చేతులలోని ధమనులు సంకోచం చెందడానికి పొగ త్రాగడం ముఖ్యకారణం. ధమనుల సంకోచం వల్ల చీముపట్టి వ్రణం ఏర్పడి శస్త్రచికిత్స ద్వారా కాలూ చెయ్యీ తీసివేయవలసిన అపాయం ఏర్పడవచ్చు. పొగపీల్చడం వల్ల కడుపులో అధికంగా ఆమ్లాలు స్రవించి పెప్టిక్ అల్సర్ రావడానికి దోహదకారి అవుతుంది.

1979 జనవరిలో అమెరికా ప్రభుత్వ ఆరోగ్య విద్యా సంక్షేమ శాఖ ఈ విషయంలో విస్తృతంగా పరిశోధనలు జరిపి ఒక సుదీర్ఘ నివేదికను సమర్పించింది. అందులోని ముఖ్య అంశాలు ఇవి:

గర్భిణీస్త్రీలు (అక్కడ చాలామంది స్త్రీలు కూడా పురుషులతో సమానంగా పొగ తాగుతారు) పొగ పీల్చినట్టయితే పుట్టే శిశువులకు నయం కాని దీర్ఘకాల వ్యాధులు సంక్రమిస్తాయి.

శ్వాసకోశ కేన్సర్‌తో బాధపడే స్త్రీల సంఖ్య 1955 సం॥ తర్వాత మునుపటికన్నా ఐదురెట్లు ఎక్కువయింది.

రాతినార (అస్బెస్టాస్) రబ్బరు, రాళ్ళసిబొగ్గు, యురేనియం మొదలైనవాటికి సంబంధించిన పరిశ్రమలలోనూ, బట్టల పరిశ్రమ, రసాయనిక పరిశ్రమలలోనూ పని చేసేవారు పొగ త్రాగడం వల్ల మరింత అపాయానికి గురౌతారు.

తల్లిదండ్రులు పొగ పీల్చడంవల్ల - వారి దరిదాపుల్లో వుండే పిల్లలకు కూడా శ్వాసకోశ వ్యాధులు వస్తాయి. పొగ పీల్చే వారి ఆరోగ్యమే కాకుండా వారి కుటుంబీకులకు, సహోద్యోగులకు కూడా ఆరోగ్యం దెబ్బ తినే ప్రమాదం వుంది. అందుకే పదిమంది కలిసి కూచునే స్థలాల్లో – ముఖ్యంగా సినిమా హాల్సులాంటి వాటిల్లో ధూమపానాన్ని నిషేధించారు.

ముప్పై అయిదేళ్ళ ప్రాయంలో వున్న ఒకడు రోజుకు ఇరవై సిగరెట్ల చొప్పున కాల్చాడంటే అతని ఆయుర్దాయంలో ఎనిమిదేళ్లు తగ్గిపోతుందని అంచనా।

పొగ త్రాగడం మనిషి ఆరోగ్యానికి హానికరం కాబట్టి పొగాకు విషప్రాయమే అని జమకట్టలేము. ఎందుకంటే దానికి కొన్ని ఔషధ గుణాలు వున్నాయి. పొగాకు కషాయం మలబద్ధం, వరిబీజంలాంటి రుగ్మతలను నయం చేస్తుంది. ఊపిరికుట్టు, ఊపిరాడక పొరలడం లాంటి ఇబ్బందులను తగ్గిస్తుంది. పచ్చి పొగాకును నూరి పట్టించడంవల్ల గజ్జి నయమౌతుంది. తలలోని పేలను పోగొట్టడానికి కూడా పొగాకును వాడతారు. అంతేకాదు. పొగాకులోని ఔషధ పదార్థాలతో నాడీ మండల వ్యాధులు, పళ్ల నొప్పులు పోగొట్టడానికి సాధ్యమవుతుంది. అంచేత ప్రకృతి సిద్ధంగా పొగాకు విషప్రాయం కాదు. కాని మనమే దాన్ని విషతుల్యంగా, హానికారిగా మార్చుకుని పతనమౌతున్నాము. □

## మీ భాషాభివృద్ధికి

మన తెలుగు పదాల్లోని కొన్ని–దిగువ రెండు రకాలుగా రాయబడి వున్నాయి. వాటిల్లో ఏది ఒప్పు? ఏది తప్పు? – మీరు చెప్పండి. అన్నీ సరిగ్గా చెప్పగలిగితే, మీ భాషా జ్ఞానం బాగానే వుందన్నమాట. ప్రయత్నించండి.

| | |
|---|---|
| ఇదమిత్థము | ఇదమిద్ధము |
| ఉచ్ఛ్రదశ | ఉచ్చ్రదశ |
| ఉచ్చారణ | ఉచ్ఛారణ |
| ఉచ్ఛ్వాస నిశ్వాసము | ఉచ్చాస్వ నిస్వాసము |
| ఊర్థ్వ దృష్టి | ఊర్ద్వ దృష్ఠి |
| ఖర్మ | కర్మ |
| ధృడము | దృఢము |
| ఖచ్చితము | కచ్చితము |
| స్తూపము | స్థూపము |
| సౌథము | సౌధము |

సరైన మాటలు : ఇదమిత్థము, ఉచ్ఛ్రదశ, ఉచ్చారణ ఉచ్ఛ్వాస నిశ్వాసము, ఊర్ధ్వదృష్టి, కర్మ, దృఢము, కచ్చితము, స్తూపము, సౌధము.

“ నేను చెప్పిన విషయం ఏం ఆలోచించేరు ?” అడిగింది శారద భర్త పక్కనే కూర్చుని.

“ ఏ విషయం ” అడిగేడు మూర్తి.

“ అదే పద్మ విషయం.”

“ ఏమిటది ?”

“ అప్పుడే మర్చిపోయేరా ? రేపే వాళ్ళు వస్తున్నారు. నా చెల్లెలు క్రిందటిసారి వచ్చినప్పుడే-




పద్మని తనతో తీసికెళ్తానని పట్టుబట్టింది. మొన్న రాసిన ఉత్తరంలో కూడా - బావతో పద్మని తీసి కెళ్ళటం విషయం అడిగి వుంచూ అని రాసింది.”

“ రాస్తే ” చిరాగ్గా అన్నాడు మూర్తి.

“ అది కాదండి పెళ్ళయి పదేళ్ళయినా దానికి పిల్లలు పుట్టలేదు. మన పద్మను కొన్నాళ్ళు సాకితే పిల్లలు పుడతారని దాని నమ్మకం.”

“ ఇవన్నీ.... పిచ్చినమ్మకాలు.”

“ కావచ్చు. వాళ్ళపిచ్చి వాళ్ళకానందం. పంపితే ఏం పోయింది? అది నోరు తెరచి అడిగి కళ్ళనీళ్ళు పెట్టుకుంటే - నా మనసు కరిగిపోయిందండి.”

“ దానివల్ల వచ్చే ఇబ్బందులు నీకు తెలియవు.”

“ ఏమిటో ”

“ మనపిల్ల ఎంతకాలం వాళ్ళయింట్లో ఉంటుంది? వాళ్ళకసలు పిల్లలే కలగకుంటే ఉంచేయగలవా? ఒకవేళ చేరిక అయిపోయిన పద్మరానంటే.... ఒకవేళ వాళ్ళు....వదలలేకుంటే....”

“ మీవన్నీ వితండవాదాలు.”

“ అవును నావన్నీ వితండవాదాలు. మనకి మాత్రం ఏం పదిమంది వున్నారని.... శైలజ. ..గిరిజ పద్మ అంతేగా. అందులో పద్మ ఆఖరిది, ఆరుఏళ్ళు లేవు .. అది ఉండగలదా ? ఏం ముగ్గుర్ని సముదాయించలేవా ?”

“ సముదాయిస్తాను....ఎందుకు సముదాయించ లేను ? మీరు క్లబ్బులు, షికార్లు, స్నేహితులతో తిరిగిరండి. నేను వీళ్ళని సముదాయిస్తాను.”

“ దానికి - దీనికి సంబంధం ఏమిటి ”

“ అదికాదండి .... మనం ముగ్గురి పిల్లల్ని సమానమైన శ్రద్ధ - ఓపికా చూపి - వాళ్ళ అభిరుచులు - అలవాట్లు గ్రహించి పెంచలేం కదా ? నా చెల్లెలుకయితే పద్మతోటే లోకం కనుక అది ఎంతో శ్రద్ధగా పెంచుకుంటుంది.”

“ నువ్వొక ఫూల్‌వి. నువ్వేం....మాట్లాడతావో నీకు తెలియదు. దానివల్ల వచ్చే సాధక బాధకాలు నువ్వు ఆలోచించటంలేదు.” అన్నాడు మూర్తి అసహనంగా.

“ అవును. నేను ఫూల్‌నే....పిల్లలు లేరని అఘోరిస్తున్న చెల్లెలు నా పిల్లని సాకుతానంటే- కాదనలేని సెంటిమెంటల్ ఫూల్‌ని ” అంటూ విసురుగా వెళ్ళిపోయింది శారద.

*

రెండు రోజుల తర్వాత పూర్ణ .... స్వామి వచ్చేరు. శారద వాళ్ళకి ఊరంతా చూపించింది. రేపు తిరిగి వెళ్ళిపోతారనగా మూర్తి, శారద, పూర్ణా, స్వామి అంతాగుడికెళ్ళేరు. పూర్ణ వచ్చిన దగ్గర నుంచి పద్మని మాలిమి చేసుకోవటం మూర్తి

గ్రహించకపోలేదు. అంతా గుడి మెట్ల మీద కూర్చున్నారు.

"పద్మా....నాతో విశాఖ వస్తావా?" అడిగింది పూర్ణ. కొబ్బరికాయి ముక్క తింటున్న పద్మ తలూపింది.

"ఇకనేం బావా...పద్మని నేను తీసి కెళ్ళచ్చు" అంది పూర్ణ.

"బహుశా పద్మ విశాఖ అంటే....సినిమా అనుకుంటోందేమో!" అన్నాడు మూర్తి.

స్వామి నవ్వేడు.

శారద, పద్మ మీదకు వంగి "పిన్నితో వాళ్ళ ఊరు....విశాఖపట్నం వెళతావా?" అంది.

పద్మ మాట్లాడలేదు.

"చెప్పు పద్మా...." లాలనగా అడిగింది పూర్ణ.

"అక్కడికెళ్ళి బోలెడు రోజులుండగలవా?" అడిగేడు మూర్తి.

"ఓ ఉంటాను. పిన్ని వాళ్ళింటి దగ్గర బోలెడు బొమ్మలున్నాయి. రంగులరాట్నం వుందిట...." అంది పద్మ.

"ఎవరు చెప్పేరు"

"పిన్ని చెప్పింది."

పూర్ణ తల ఎటో తిప్పుకొంది.

కాస్సేపు నిశబ్దం అవరించింది. ఆ నిశబ్దం అందరికి ఇబ్బందిగానే వుంది.

పూర్ణ నిశబ్దతను చీలుస్తూ "ఏం బావా....పద్మని తీసికెళ్ళనా" అడిగింది.

"మీ అక్కనడుగు"

"ఈ పైమాటలకేంలెండి. మీరే ఏదో తేల్చి చెప్పండి అంతేకాని నువ్వే పంపేవని...ఆ తర్వాత అనద్దు"

"నేను అనేదేముంది శారదా....దాన్ని వదిలి ఉండగలనంటే పంపించు...నీ ఇష్టం"

"ఏం పరాయిచోటా....నేను భయపడ్డానికి..."

"ఆ భయం నీకక్కర్లేదు. ప్రాణంలా చూసుకుంటాం" అంది పూర్ణ.

"సరే....అయితే తీసికెళ్ళండి."

"థాంక్స్" అన్నాడు స్వామి లేస్తూ.

అందరూ లేచేరు.

*

ఆ రోజే ప్రయాణం. శారద ఇల్లంతా వెతికి పద్మ బట్టలు, జోళ్ళు అన్ని ప్యాక్ చేసింది. పద్మ ఊరుకెళ్ళే ఉత్సాహంలో వుంది. పెద్దవాళ్ళు భోజనాలు చేస్తున్నారు.

శైలజ – గిరిజ పుస్తకాలు చేత్తోపట్టుకొన్నా- చూపులు మాత్రం పద్మ మీదే వున్నాయి. ఏదో పని మీద గదిలోకొచ్చింది పద్మ. అంతవరకు చదువుకుంటున్నట్లు కూర్చున్న ఇద్దరూ ఆమెకు చేరోపక్క చేరారు.

"పద్మా....వెళ్తున్నావా?" అడిగింది శైలజ.

"ఆ! రైలెక్కుతాను."

"మరింకెప్పుడూ రావా" అడిగింది గిరిజ.

"ఊహూ, అక్కడ రంగులరాట్నం వుంది."

"మన వూళ్లోనూ ఎగ్జిబిషన్‌లో జెయింట్ వీల్ వుందిగా."

"ఉంది....వుంటేనేం....నేను రంగులరాట్నం ఎక్కుతా."

"వెళ్ళు-పో....మేం నీజట్టు ఉండము" పచ్చి కొట్టింది-గిరిజ.

"పోనీ...." రెండు బుగ్గలలో గాలి నింపి గుప్పెళ్ళతో కొట్టుకుంటూ అంది పద్మ.

భోజనం చేసి సావిట్లోకొచ్చిన మూర్తి అది చూసి గదిలోకెళ్ళి-

"శైలా....పద్మ వెళ్ళటం నీకిష్టం లేదా?" అడిగేడు.

శైలజ మాట్లాడలేదు.

"గిరిజా....నీకూ"

గిరిజ మాట్లాడలేదు.

"అబ్బో. మా పద్మ రడీ అన్నమాట" గదిలోకి వస్తూ అంది పూర్ణ. వెనుకగా శారద....స్వామి వచ్చేరు.

"మీ పద్మ ఏంటో....మా పద్మ" గిరిజ దాదాపు అరిచింది.

ఆమె అరుపుకి పెద్దవాళ్ళు ఆశ్చర్యపోయారు. పూర్ణ తల దించుకొంది.

"నోర్ముయ్. పిన్నిని అలా అనవ్చా" చాచి లెంపకాయి కొట్టింది శారద-కూతుర్ని.

"చిన్నపిల్ల....కొడతావెందుకే...." అంది పూర్ణ. అంతా చూస్తూ నిలబడిన మూర్తి నిట్టూర్చేడు. గిరిజ ఏడుస్తూ వెళ్ళిపోయింది.

"టైము అయిపోయింది" అన్నాడు స్వామి. టాక్సీని పిలిచేరు.

పూర్ణ-భర్త పద్మ టాక్సీ ఎక్కేరు.

టాక్సీ కదలబోతుంటే....శారదకు కళ్ళనీళ్ళు తిరిగేయి.

"పద్మని జాగ్రత్త....రాత్రి పక్క పాడు చేస్తుంది. ప్రొద్దున్నే పాలు తాగించు." అంటూ ఏమేమో చెప్పింది. టాక్సీ కదలబోయింది.

"పోనీ నేను స్టేషన్‌కి వస్తానే" అంది శారద అకస్మాత్తుగా అక్కలో వచ్చిన మార్పు గ్రహించిన పూర్ణ.

"నువ్వు రడీగా లేవు. ఆలస్యమవుతుంది. పద డ్రైవర్..." అంది పూర్ణ. టాక్సీ బయలుదేరింది.

"అమ్మయ్య" అనుకుంది పూర్ణ.

*

"మీరు అంతగా...వాదించేరుకదా....చూడండి పద్మ చాలా హుషారుగా వుందట సెంట్రల్ స్కూల్లో వేసేరట - బాగా చదువుతోందిట పూర్ణ రాసింది" అంది శారద ఉత్తరం చదివి.

"మంచిదేగా" అన్నాడు మూర్తి.

"ఏమిటా నిర్లక్ష్యం? నేను చెబుతున్నది మన అమ్మాయి పద్మ విషయం. రెండు నెలలకే దాన్ని మర్చిపోయేరా?"

"మర్చిపోవటానికి ప్రయత్నిస్తున్నాను."

"అవును...మీరు మగాళ్ళు...తేలిగ్గానే మర్చిపోతారు. పేగులోంచి పేగు ఇచ్చి కన్నాం కనుక మేము పాకులాడతాం." అంటూ శారద విసురుగా వెళ్ళిపోయింది.

పద్మ వెళ్ళిన దగ్గర నుంచి శారదలో వచ్చిన మార్పు మూర్తి గమనించకపోలేదు. అందుకే మౌనంగా ఉండిపోయాడు.

*

"అది వెళ్ళి నాలుగు నెలలు అయిందికదా. మీకు దాన్ని చూసిరావాలని లేదండీ?" అంది శారద చిలకల్చుట్టి ఇస్తూ. "లేదు" అన్నాడు మూర్తి.

"అది కాదండి పిల్లలు గోలపెడుతున్నారు. ఆ గిరిజకయితే అస్తమాను పద్మధ్యాసే....రోజుకి పదిసార్లు అడుగుతుంది."

"పిచ్చిది."

"ఎవరూ" అంది శారద.

"గిరిజ."

"ఎందువల్లా" అడిగిందామె.

మూర్తి సమాధానం చెప్పలేదు.

# మహిళా పోలీస్



వి. విజయకుమారి,

ఒక ప్రముఖ కవి చెప్పినట్టు మహిళలు ఈ రోజులలో అబలలు ఎంత మాత్రం కారు. వారు సబలలు. స్త్రీలు పురుషులతో సమానంగా అన్ని రంగాలలో ముందంజ వేస్తున్నారు. స్త్రీలు చేయలేని పని అంటూ లేదు. అందుకే పోలీసు, తంతి తపాలా, రైల్వే, ఇంజనీరింగ్, రెవెన్యూ మొదలైన శాఖలలో ఈనాడు మహిళలను చూస్తున్నాము.

విజయవాడలో 1971లోనే మహిళలతో పోలీసు విభాగాన్ని నెలకొల్పారు. ఇందులో ఆరుగురు మహిళా పోలీసు కానిస్టేబిల్స్ ఉన్నారు. వీరంతా డైరెక్టు రిక్రూట్‌మెంట్‌లో సెలెక్టు అయినవారు.

ఈ మహిళా పోలీసులు చేసే పనులు ఏమిటంటే- బస్సుస్టాండులోను, సినిమా థియేటర్ల వద్ద స్త్రీల క్యూలు సరిగా ఉండేటట్టు చూడడం, స్త్రీలు ప్రదర్శనలు, నిరాహారదీక్షలు, ఘెరావ్‌లు, ధర్నాలు జైరాయింపులు చేస్తే వారిని అరెస్టు చేయడం, గన్నవరం విమానాశ్రయంలో లేడీ ప్యాసింజరులను తనిఖీ చేయడం, ట్రాఫిక్‌ను కంట్రోల్ చేయడం.

ఉదయం 8 నుండి 12 గంటల వరకు, సాయంత్రం 4 నుండి 8 గంటలవరకు స్త్రీ పోలీసులు డ్యూటీ చేస్తారు. వీరి జీతం రు 450 లు. హైదరాబాద్ అంబర్ పేటలో వీరికి శిక్షణ ఇచ్చారు. మహిళా పోలీసు అవడానికి కావలసిన కనీస అర్హత పదవ తరగతి ప్యాసు కావడం. విజయవాడలో శ్రీమతి పి. వరలక్ష్మి, వి. విజయకుమారి, కుమారి ఎస్. ఎఫ్. ఇందిరాదేవి, ఎం. సంతోషమ్మ, డి. వి. ఆర్. ఆర్. మేరీ, ఎం. కస్తూరిబాయి పోలీసు కానిస్టేబిల్స్‌గా పని చేస్తున్నారు.

ధరల పెరుగుదలకు నిరసనగా ఆ మధ్య జరిగిన ఆందోళనలలో మహిళా కార్యకర్తలను అరెస్టు చేయడంలోనూ ప్రత్యేక ఆంధ్ర ఉద్యమంలోను, తాము అనేక ఇబ్బందులకు గురి అయ్యామని మహిళా పోలీసులు చెప్పారు. కనకదుర్గ దసరా ఉత్సవాలలో యాత్రికులకు సేవ చేయడం ఉత్సాహంగా ఉంటుందని అన్నారు.

మహిళ పోలీసు విభాగాలు ఆంధ్రప్రదేశ్‌లో కాకినాడ, గుంటూరు, వైజాగ్, శ్రీకాకుళం, హైదరాబాద్, కర్నూలు, ఒంగోలు మొదలైన పట్టణాలలో వున్నాయి.

ఈ మహిళా పోలీసులకు ప్రభుత్వం అద్దె లేని క్వార్టర్స్ ఇచ్చింది. బయట పట్టణాలకు వెడితే వీరికి రోజుకు రు 4-50 చొప్పున అలెవన్స్ యిస్తారు. లాఠీచార్జి, రైఫిల్ షూటింగ్‌లో వీరు శిక్షణ పొందారు.

త్వరలోనే విజయవాడకు ఒక మహిళా హెడ్ కానిస్టేబిల్ కూడా రాబోతున్నారు.

—మీరా



" ఏం మాట్లాడరు. చూస్తున్నా...ముందు నుంచి మీకు శైలజ-గిరిజా...అంటే ఇష్టం. మూడోసారి ఆడపిల్లే పుట్టిందని పద్మను చూస్తే...చిరాకు-అవునా ?"

మూర్తి మాట్లాడలేదు.

" ఏం మాట్లాడరేం..."

" పద్మ గురించి నేనెందుకు మాట్లాడాలి? నేను పెంచే పిల్లలు గూర్చే మాట్లాడతాను " కోపంగా అన్నాడు మూర్తి. శారద కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగేయి.

" ఏమిటా అఘాయిత్యం మాటలూ ? ఆ పిల్ల మాత్రం మన పిల్ల కాకపోతుందా ? నాలుగు రోజులు ఉంచుకొంటానంటే పంపేము. పోని.... మీకంతగా యిష్టం లేకుంటే తీసికొచ్చేయండి."

" నా పూర్తి యిష్టంతోటే పంపేను. ఇక ఆ ప్రసక్తి నా దగ్గర తేకు " అంటూ పడుక్కున్నాడు మూర్తి.

శారద చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయింది.

*

మూర్తి ఆఫీసు నుంచి వచ్చేసరికి శైలజ-గిరిజా వున్నారు.

" శైలా....అమ్మ ఏది "

" గుడికెళ్లింది డాడీ."

" ఏం...."

పిల్లలిద్దరు మాట్లాడలేదు. ఒకరి మొహాలొకరు చూస్తూ వుండిపోయారు.

" పూజ చేయించటానికెళ్లిందా ?"

శైలజ తల వూపింది.

" రేపు చేయించచ్చుగా " అన్నాడు మూర్తి విసుగ్గా.

" పద్మ పుట్టినరోజు ఈవాళే కదా ! రేపు చేయిస్తారేంటి."

మూర్తి ఆశ్చర్యంగా చూశాడు.

శైలజ నోరు జారిన గిరిజకేసి కోపంగా చూసింది.

"ఏం శైలా-అమ్మ నాతో చెప్పవద్దందా ?"

శైలజ మాట్లాడలేదు.

" ఫరవాలేదు చెప్పు."

" అవును. పద్మ గురించి మీరు ఉండగా మాట్లాడితే తిడతారంది " అంది శైలజ.

మూర్తి భారంగా వూపిరి వదిలి గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నాడు. బీరువాలోంచి ఆల్బమ్ తీసి తెరిచేడు. పద్మ ఫోటోని ముద్దు పెట్టుకొని మనసులోనే పద్మని దీవించేడు.

తలుపు తట్టిన చప్పుడయింది.

ఆల్బమ్ బీరువాలో పెట్టి తలుపు తెరిచేడు. ఎదురుగా కళ్ళనీళ్ళతో వుంది శారద. ఆమె చేతిలో కవరుంది.

" ఏమండి.... ఈ ఉత్తరం చూశారా " అందామె కంగారుగా.

మూర్తి ఆమె చేతిలోని కాగితం అందుకున్నాడు. చిన్న కాగితం మీద పెన్సిలుతో తాటికాయంత అక్షరాలతో రాసి వుంది - " అమ్మా....నన్ను తీసుకొని వెళ్ళు " అని వుంది.

ఆశ్చర్యంగా చూశాడు మూర్తి.

" ఏమిటలా చూస్తారు. అది పద్మ రైటింగ్.... ఏమిటిది ఎందుకిలా రాసింది....నాకేదో భయంగా వుంది. ప్లీజ్ వెళ్ళండి. పద్మని తీసికొని రండి. మిమ్మల్నే-వెళ్ళండి పద్మని చూడాలి" పిచ్చిదానిలా మూర్తి రెండు చేతులు పుచ్చుకొని ఏడ్చింది శారద.

మూర్తి చలించేడు.... నిలదొక్కుకొని.

"ఏమిటా పిచ్చి శారదా ! అలాగే లే.... బెంగ పెట్టుకుని రాసిందేమో. అదేంటి కవరు మీద స్వామి రైటింగ్."

**[లోకజ్ఞానం-సమాధానాలు]**

1. ' లాండ్ ఆఫ్ ది ఫ్రీ ' (Land of the free) లేక ' స్వతంత్ర భూమి ' దక్షిణ ఆసియాలో కల్లా ' వలస రాజ్యంగా ' వుండని ఏకైక దేశం థాయ్‌లాండ్ మాత్రమే. రాజధానీ నగరం - బాంగ్‌కాక్.
2. గురుముఖి.
3. నలభై ఎనిమిదిసార్లు. 1,971,000 కిలోమీటర్ల దూరం ఆమె అంతరిక్షంలో ప్రయాణం చేసింది.
4. సంవత్సరం పడుతుంది. నెలకి సుమారు అరంగుళం చొప్పున పెరుగుతుంది.
5. స్వామి వివేకానంద. 1897లో స్థాపించబడినది.
6. ఐ. బి. ఆర్. డి. (I. B. R. D.) - ఇంటర్నేషనల్ బ్యాంక్ ఆఫ్ రికన్‌స్ట్రక్షన్ అండ్ డెవలప్‌మెంట్. అంతర్జాతీయ పునర్నిర్మాణము, అభివృద్ధి కార్యకలాపాలకోసం ఏర్పాటు చేయబడిన బ్యాంకు కాబట్టి ప్రపంచ బ్యాంకుకి ఈ పేరు కూడా వచ్చింది.
7. గ్రేట్ నికోబార్ దీవులు. కన్యాకుమారి దక్షిణ భాగంలో 8° కన్న కాస్త అధికంగానే ఉత్తరం వైపుకి వుంది. కాని గ్రేట్ నికోబార్ దీవులు 7° కన్న తక్కువగా ఉత్తరం వైపుకి మొగ్గి వున్నాయి.
8. పారిస్ (ఫ్రాన్స్)
9. పునరుత్పత్తి గల మగ, ఆడ చీమలన్నిటికి రెక్కలు వుంటాయి. ఈ రెక్కల చీమలు సాధారణంగా తమ ' తొలిరాత్రి ' రోజున పుట్టగా గుమిగూడి తిరుగుతూ కనిపిస్తాయి. తక్కిన చీమలన్నీ కూడా కష్టజీవులు. ఇవి కేవలం చాకిరీ చెయ్యడానికి మాత్రమే పనికి వస్తాయి. ఈ ఆడ, మగ చీమలని కార్మిక చీమలు అంటారు. వీటికి రెక్కలు వుండవు.
10. ' విహారా ' కాలక్రమేణ బీహారుగా మారింది. ' విహారా ' అంటే బౌద్ధుల ఆరామ మందిరం అని అర్థం.



**కొందరి తల మీద పురుగు కొట్టినట్లు ఒకేచోట గుండ్రంగా జుట్టు రాలిపోవడం కద్దు. ఇది చూడ డానికి అసహ్యంగా వుంటుంది. అలాంటి వారు నాలుగు మిరియపు గింజలను బాగా పొడి చేసి అందులో ఒక చిన్న నీరుల్లిని నలిపి కలుపుకుని అక్కడ బాగా మర్దించాలి. ఇలా పది రోజులపాటు రుద్దుతూ వచ్చినట్లయితే ఆ స్థలంలో శిరోజాలు పెరుగుతాయి.**

—రాధా పరిమళం

" మీరు వెళతారా—లేక పద్మని తీసికొని రమ్మని టెలిగ్రాం ఇవ్వనా " ఆవేశంగా అంది శారద.

"పద్మకక్కడ ఏ లోటూ లేదు. నువ్వు కంగారు పడకు."

" నేను నమ్మను. మీరు వెళతారా వెళ్ళరా.... ఆ ఉత్తరం చూసి మీ గుండె నీరయిపోవటం లేదండీ ?"

" లేదు....నాది రాతి గుండె. అందుకే పూర్ణ వంపమన్నప్పుడు కరిగిపోలేకపోయాను. ఇప్పుడూ కరగలేదు."

" నాకు తెలుసండి. మీరు వద్దంటే పంపేనని సాధిస్తున్నారా ? పోని....నేనే పంపేను. నేనే తీసి కొచ్చేయమంటున్నాను. తీసికొచ్చేయండి.''

" ఆ ఛాయస్ మనకు లేదు. నువ్వు ఎరువిచ్చి నది బుక్ కాదు - పద్మని. ఈపాటికి దానిమీద వాళ్లు కొంత అభిమానం పెంచుకొని వుంటారు. ఒకసారి సెలవుల్లో వెళ్ళి చూసి వద్దాం. కొద్ది రోజులు పోతే దానికీ అలవాటు అవుతుంది.''

" అంతే కాని మీరు వెళ్ళరన్నమాట.''

" వెళ్ళను. వెళ్ళి వాళ్ళ మనసులు నేను కష్టపెట్ట లేను...." శైలజ గిరిజ ఏడుపు మొదలెట్టారు.

" నా పద్మ నా క్కావాలి. ప్లీజ్ వెళ్ళండి." గట్టిగా అరిచింది శారద. మూర్తికి కళ్ళ నీళ్ళు తిరిగేయి.

" ఇదిగో పద్మ...." గుమ్మంలోంచి వినిపించింది. అందరూ అటుకేసి చూశారు.

పద్మనెత్తుకొని నిలబడి వున్నాడు స్వామి.

శారద ఒక్క అంగలో గుమ్మంకేసి వెళ్ళి స్వామి చేతిలో పద్మని అందుకొంది. పిల్లని ఒళ్లో పెట్టుకొని చతికిల పడిపోయింది. పిల్లలు ఆమె చుట్టూ చేరేరు.

మూర్తి అలాగే చూస్తూ వుండిపోయాడు.

" మీ పద్మ నాలుగు రోజులుగా నిరాహార దీక్ష చేస్తోంది. ఉత్తరం రాయడానికి కవరు మీద ఎడ్రసు రాశాను. మీకు ఉత్తరం రాసేసింది....పసి పిల్లని బాధపెట్టడం ఇష్టంలేక నిన్న బయలు దేరేను " అన్నాడు స్వామి.

అతను చెప్పేవేమి వినపడటం లేదు శారదకు - పద్మని కౌగలించుకొని గుండెకు హత్తుకుంది. పద్మ – తల్లి మెడ పట్టుకొంది. ఆ యిద్దరి కళ్ళల్లోనూ అశ్రువులే !.... □

## నెమళ్ల ముగ్గు

ఈ ముగ్గు వెయ్యడానికి ముందుగా 25 చుక్కలు 5 వరుసలు 1 చుక్క తగ్గించి 23 చుక్కలు ఒక వరుస, 3 చుక్కలు తగ్గించి 17 చుక్కలు ఒక వరుస పెట్టుకోవాలి. తరువాత ఒక చుక్క చొప్పున తగ్గించి 15, 13, 11,9 చుక్కలు పెట్టుకోవాలి. ఆ తరువాత 7 చుక్కలు 3 వరుసలు, 5 చుక్కలు ఒక వరుస పెట్టుకుని ఈ ముగ్గులో చూసినట్లుగా కలుపుకుంటే చూడ ముచ్చటైన నెమళ్ల ముగ్గు పూర్తవుతుంది.

—ముంగర పద్మాపార్థసారధి





# గుజరాత్ గ్రామీణ జీవితం - స్త్రీలు

- సుసర్ల జయారావు

[వనితలో మీరు 'ఒరిస్సా గ్రామీణ జీవితం-స్త్రీలు' వ్యాసంలో అక్కడి స్త్రీల గురించి, వారి జీవిత విధానం గురించి ఈ మధ్య చదివారు. ఆ విధంగానే గుజరాత్‌లోని కచ్ ప్రాంతపు స్త్రీల జీవన విధానం గురించి, ఆచార వ్యవహారాల గురించి ఈసారి ప్రచురిస్తున్నాము]

'కచ్' అనగానే అందరికి అందమైన రంగు దారాలతో మధ్య మధ్య అద్దాలు పెట్టి కుట్టిన డిజైన్స్ జ్ఞాపకానికి వస్తాయి. అవి ఎంత అందంగా వుంటాయో ఆ నైపుణ్యాన్ని ప్రదర్శించిన వారి జీవిత గాధ అంత బాధాకరంగా వుంటుంది. పూర్వం (అనగా స్వతంత్రానికి ముందు) రాజులచే పరిపాలింపపడిన 'కచ్ ప్రాంతం' అన్ని విధాల ప్రపంచంలో సంబంధం లేక కనీసం రైలు, తంతి, తపాల శాఖల సంబంధం కూడా లేకుండా వెనుక బడివుండేది. 1950 తరువాత కచ్ "C" స్టేట్‌గా గుర్తింపబడి రైల్వే, తంతి, తపాల శాఖలు "కోరి" (Currency) అనే నోట్ల స్థానే హిందూదేశపు నోట్లు, కొలతలు మొదలయినవి వాడుకలోకి వచ్చాయి. ఇక్కడ ఎడారి ప్రాంతం మూలాన నీటి కరువు ఎక్కువ. త్రాగే నీరు కూడా అతి కష్టం మీద దొరుకుతుంది; చిన్న చిన్న నదులు ఎన్నో వున్నప్పటికి వానా కాలంలో కూడా నదిలో నీరు అంతగా వుండదు. అంటే మిగతా నీరంతా యిసుక పీల్చివేస్తుంది. అందుచేత యిక్కడి వారికి వాన, వరద అంటే ఏమిటో కూడా తెలీదు.

1971 లెక్కల ప్రకారం ఇక్కడి జనాభా: 8,49,769. పల్లె ప్రాంతీయులు: 2,14,454. పై లెక్క ప్రకారం చూస్తే పల్లెకంటే పట్టణవాసం పోయి-కూలి నాలి చేసుకు బ్రతకవచ్చని ప్రజలు మిగతా ప్రాంతాలకి వలస వెళ్ళిపోతున్నారని తెలుస్తుంది. పల్లె ప్రజలకి చుట్టు ప్రక్కల ఉన్న బుజ్, అంజార్, గాంధీధామ్‌వంటి పట్టణాలకి వెళితే కనీసం వారంలో నాల్గురోజులైనా తిండి దొరుకుతుందని వారికి ఆశ! అందుచేత యిక్కడ పేరుకి పల్లెలు వున్నా అక్కడి జనాభా చాలా తక్కువ.

ఈ ప్రాంతం ఉప్పు నీటితోను, యిసుకతో కూడిన ఖాళీ మైదానాలతో నిండి ఉండటం వలన దీనికి "కచ్" అనే పేరు సార్ధకమైంది.

ఇటీవల ఒక మధ్యాహ్నం నేను, మా వారు, మా బాబు, పాపతో సహా "నూతక్, నాగఓలాడియా" అనే పల్లెటూళ్ళని చూడడానికి వెళ్ళాం. కారులో కూర్చున్నది మొదలు నా ఊహ నాకంటె ముందు పల్లె చేరింది. అక్కడ గలగలా పారే నది, గట్టు ఒడ్డున ఓ పెద్ద రావిచెట్టు, రోడ్డుకి యిరువైపులా వుండి మాకు స్వాగతం పలుకుతున్నట్టుగా పచ్చని పైరులు, వింత శబ్దాలని చేస్తూ అనేక పక్షులు....యిలా నా ఊహ సినిమాలో రీలులా వెళ్ళిపోతోంది. నా ఊహకి బ్రేక్ వేస్తూ కారు దిగమన్నారు మా ఆయన. చుట్టూ ఒక్కసారి చూశాను. ఏది-నా ఊహలోని పచ్చని పైరులు, రావిచెట్టు.... ఏవిలేవు. బహుశా యింకా ముందుకు పోవాలేమో అనుకున్నాను. మనసులో మాట చదివినట్టుగా "ఇది కోనసీమ అనుకున్నావా చెట్లూ చేమలుండడానికి ఇది అసలైన ఎడారి" అన్నారు ఆయన.

నిజమే. కనుచూపు మేరలో ఎక్కడా ఒక్క గడ్డిమొక్కలేదు. పైగా క్రింద పాదం మునిగే యిసుక, వెనకనించి త్రోసుకొస్తున్న వేడిగాలి. దీనిని "ఆంధీ" అంటారు. ఏప్రిల్ నెలలో అయితే గాలితోపాటు యిసుక కూడా వస్తుందిట. కారులో దిగిన మమ్మల్ని అక్కడి వాళ్ళు దివినుండి భువికి దిగివచ్చిన దేవతామూర్తులో లేక ఎలక్షన్ వాళ్ళో అనుకుని చుట్టుముట్టారు. గుమ్మాల వద్దనుండి ఆడవారు మొహాలు ముసుగుతో కప్పేసుకుని మరీ లేచి నిల్చున్నారు. ముఖ్యంగా భర్తకంటే వయసులో, పెద్ద అయిన లేదా కాస్త ధనవంతులు, పలుకుబడి వున్నవాళ్ళు వస్తే ఆ విధంగా "గూంఘట్" (మేలిముసుగు) వేసుకుని నిలబడడం వీరి ఆచారమట. మేము ఫలానా పనిమీద వచ్చేమని తెలియగానే ఆ వూరి సర్‌పంచ్ శ్రీమతి జమణీబెన్ వారి భర్తవచ్చి వాళ్ళ యింటికి మమ్మల్ని తీసుకువెళ్ళారు.

ఊరంతటికి వారి యిల్లు ఒక్కటే బంగాళాపెంకు, యిటుకలు, సిమెంట్‌తో తయారుచేయబడివుంది. మిగతా యిళ్ళన్నీ పెద్ద పెద్ద రాళ్ళు బంకమట్టితో కట్టినవి. లోపల గదులు ఒక దానిలోనించి మరో దానికి పోవడానికి అర్చిలాంటివి వేసుకున్నారు. వీధికి పెరటికి మాత్రం పేకేజీ డొక్కులు బద్దలకొట్టి తలుపుల ఆకారంలో అడ్డం పెట్టుకున్నారు. వారానికి ఒకమారు ముఖ్యంగా శుక్రవారంనాడు పేడా, తెల్లని మట్టి కలిపి యింటి గోడలు, నేల అంతా అలుక్కుంటారు. ప్రతీ యింటికి చిన్న అరుగు వుంటుంది. వంటగది కాకుండా పడుకుందికి; వారికున్న పాత్ర సామాను, డబ్బు, నగ, దిండులు, బట్టలు యివన్నీ భద్రపరచుకుందికి ఒక గదీ ప్రత్యేకంగా ప్రతీ యింటా వున్నాయి. డబ్బు, నగలు జాగ్రత్త పరచడానికి చిన్న చిన్న బూసిమూతలున్న కుండలు వాడుతారు. అన్నిటిని గుడ్డ మూటలో కట్టి, కుండలో పెట్టి గదికి మధ్య, భూమిలో చిన్న లాకర్‌లా చేసుకుని అందులో దాచుకుంటారు. ఇంటికి పెద్ద ఎవరైతే వారు గది గుమ్మంలో పడుకుంటారుట.

### ఉపయోగించే వస్తువులు

వీరు ఎక్కువగా యిత్తడి, రాగి, సామాన్లు వాడుతారు. వంటకి జర్మన్ సిల్వరు, యిత్తడి సామాన్లు వాడుతారు. ఎంత పేదవారైనా కుండలతో

వండడం తెలీదు వీరికి. భోజనం కూడా యిత్తడి కంచాలకి, లోపల కళాయి పూసినది వాడుతారు. మంచినీళ్ళకి, కాఫీలకి యిత్తడి గ్లాసులు వాడుతారు. ప్రతీ మనిషికి తినడానికి ఒక కంచం, కూర, పప్పు వేసుకుంది రెండు కటోరీలు, నీళ్ళకి గ్లాసు చొ॥న యింటిలో వున్న సభ్యులందరికి విడివిడిగా వుంటాయి. ఇక వీరు వంట పొయ్యి మీద అంటే మన వేపులా మట్టిలో కట్టెల పొయ్యి వేయడం రాదు వీరికి. మూడు రాళ్ళు పెట్టి, రాళ్ళకి మూడు వైపులా ముళ్ళకంపలు (ఎండినవి) పెట్టి మంట పెట్టి వండుకుంటారు. ఒకవైపు కంప పెట్టి వండా రంటే, గిన్నెకి మంట అన్నివైపులా సమానంగా తగలాలి కదా—అందుకని మూడు వైపుల కంప పెడతామని అన్నారు. పొయ్యి అంటించుకుందుకి మాత్రం కిరసిన్ వాడుతారు.

## ఆహార వ్యవహారాలు

వీరు ముఖ్యంగా గోధుమ, జవ్వార్ (జొన్నలు) బాజ్‌రీలతో రొట్టెలు చేసుకుని తింటారు. సామాన్యంగా రొట్టె చేసుకుని బెల్లం నంచుకు తింటారు. కాస్త డబ్బు ఉన్నరోజు కూర కొనుక్కొని పల్చని కూర (బాజీ అంటారు) చేసుకుంటారు. రొట్టె కూడా పొడిగా పెనం మీద కాల్చుకుంటారు. కూర వండుకునే రోజు మాత్రం కూరతోపాటు నూనె కొనుక్కుంటారు. మిగతా రోజులలో నూనె అవసరం లేదు వీరికి. పండగలు వస్తే 'కిచడి' (బియ్యం, పెసరపప్పు కలిపి) 'గాటయా' (సెనగ పిండితో చేసినది) 'పాపిడి' (యిదీ సెనగ పిండితో చేసినదే) ఈ మూడు తప్పక చేసుకుంటారు. వీరిలో హరిజనులు మాత్రం మాంసాహారులు. మిగతా వారంతా ఉల్లిపాయ కూడా తినరు.

## వేషధారణ

స్త్రీలు మూడు మీటర్ల బొందు పరికిణీలు, పైన జాకెట్టూ వేసుకుంటారు. జాకెట్టు వెనుక (వీపు భాగాన) గుడ్డ అసలు వుండదు. పైన, క్రింద రెండు వైపులనించి రెండు తాళ్ళు తీసి కట్టుకుంటారు. జాకెట్టు కూడా (కటోరి బ్లౌజు అంటారు మన వాళ్ళు) చక్కటి షేపులో కుట్టుకుని వేసుకుంటారు. పరికిణీలని "గాగిరి" అంటారు. ఎంత పేదవారైనా సరే పరికిణీలని అద్దాలతో, రంగు రంగు దారాలతో కచ్‌వర్క్ చేసినవే వేసుకుంటారు. పువ్వుల ప్రింట్‌గాని, ప్లెయిన్‌గాని వేసుకోరు. జాకెట్టుకి చేతులకి అద్దాలతో కచ్‌వర్క్, గొలుసు కుట్టుతో ఎంబ్రాయిడరీ చేసినవి వేసుకుంటారు. మధ్య భాగాన పైపింగ్‌లా ప్లాస్టిక్ గుండీలు, చిన్న చిన్న ముచ్చి పూసలతో కుట్టినవి వేసుకుంటారు. ముదురు రంగులవి ఎఱ్ఱటి ఎఱుపు, కెంపురంగు, ఆకుపచ్చ, నీలం రంగులవే పరికిణీలకి వాడుతారు. పెళ్ళికి సాటన్ పరికిణీలు జరీ అంచులతో కుట్టిన జాకెట్టూ, టై అండ్ డై డిజైన్‌లో (బాందిణీ డిజైన్ అంటారు) చేసినటువంటి ఎఱ్ఱని గూంఘట్ వేసుకుంటారు. ప్రతీవారు ఈ బాందిణీ డిజైన్ వున్న ముసుగులనే వాడుతారు. ఇది కూడా మూడు మీటర్ల గుడ్డ వుండాలి వీరికి. ఎంత చిన్న పిల్ల అయినా సరే పరికిణీ, జాకెట్టు, తల మీద ముసుగు వుండాలి. ఫోటోలో చూస్తే మీకే తెలుస్తుంది. మగవారికంటే స్త్రీలు ఎక్కువ కాయకష్టం చేస్తారు.

## పురుషులు

వీరికి సామాన్యంగా ఆరు మీటర్ల గుడ్డ పడుతుంది. క్రింద పైజామాలా వుండేదానికి, పైన కుచ్చెళ్ళతో కుట్టిన జాకెట్టులాటి దానికి అన్నమాట. మీద తలపాగాకి ఒక మీటరు గుడ్డ పడుతుంది. చిన్నా, పెద్ద అందరూ యిలాంటి వస్త్రాలే ధరిస్తారు. తెల్ల రంగులో మాత్రం పైజామా జాకెట్టు వేసుకుంటారు. తలపాగ ఏ రంగుదైనా వేసుకుంటారు. కాని ఎక్కువగా తెల్లనిదే వాడతారు.

## పండగలు

వీరికి అన్నిటికంటే దసరా పండగ ముఖ్యమైనది. పది రోజులు దుర్గని పెట్టి 'గర్బా'లనే చిన్న చిన్న కుండలలో గోధుమలు పోసి మొలక కడతారు. మరో గర్బాలో దీపం వెలిగించి వుంచుతారు. ప్రతీ రోజు రాత్రి దుర్గని పెట్టిన చోటున అందరూ సమావేశమై గర్బా ఆడతారు. ఇది మనవైపు "గుమ్మి, కోలాటం"లా వుంటుంది. పట్టణాలలో "రాస్ గర్బా" అంటే మగవారు, ఆడవారు కలసి ఆడుతారు. పల్లెలో పిల్లలు, మగవారు మాత్రం ఆడుతారు. ఇదిగాక దీపావళి, దీపావళి మరునాడు కొత్త సంవత్సరాది పండుగ హోలీ కూడా చేసుకుంటారు వీరు. కచ్ గ్రామాలనుంచి గత సంవత్సరం ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ వుత్సవంలో (పాల్గొనడానికి) రాస్ గర్బా ఆడడానికి వీరు వెళ్ళారు.

## వివాహ పద్ధతులు

వీరిలో యింకా బాల్య వివాహాలు జరుగుతున్నాయి. ఆడపిల్లకి ఆరునుండి పది సంవత్సరాల లోపలే వివాహం చేస్తున్నారు. మగవారి వివాహ వయస్సు పదహారు మొదలు యిరవైవరకు. ఇరవై ఏళ్ళు దాటిన మగపిల్లాడికి చాలా డబ్బు (కట్నం రూపంలో) యిచ్చుకోవాలి. లేకపోతే వీరిలో కట్నం ప్రసక్తి లేదు. ఆడపిల్లకి ఆరు సంవత్సరాలు రాగానే గ్రామంలో వుండే పౌరోహితుడు (బారోట్) దగ్గర కెళ్ళి వరుస చూడమని చెప్తారు వధువు తరపువారు. బారోట్ వీళ్ళ శక్తిసామర్థ్యాలను చూసి తగిన వరుని గురించి వీరికి చెప్తాడు. ఇంటి పెద్ద వెళ్ళి బారోట్ సహాయంతో సంబంధం ఖాయపరుస్తాడు. అది మొదలు రెండు సంవత్సరాల వరకు వధువు తరపున వరుడుకి ప్రతీ సంవత్సరం బట్టలు పెట్టాలి. అదే విధంగా వాళ్ళు వధువుకి పెడతారు. రాకపోకలు బాగా జరిపితే పై సంవత్సరం పెళ్ళి అన్నమాట. వీరిలో ఒక్కొక్క కుటుంబం విడివిడిగా ముహూర్తాలు పెట్టుకుని పెళ్ళిళ్ళు చేయరు. గ్రామంలోని పటేల్ జాతి వారందరు వారి వారి కుటుంబాలలో వివాహానికి సిద్ధంగా వున్న జంటల పేర్లు రాసి బారోట్‌కి యిస్తారు. గ్రామంలోని వారందరి జాబితా ఒకటి తయారుచేసి శూన్యమాసం కాకుండా చూసి ముహూర్తం పెట్టుకుని అందరికీ ఒక రోజు వివాహం చేయ నిశ్చయిస్తాడు బారోట్. అంటే గ్రామంలో యాభై మొదలు రెండు వందలు పైగా వివాహాలు ఒకే రోజున జరుగుతాయి. భోజనం ఖర్చు కూడా అందరూ కలిసి పంచుకుంటారు. విడిగా ఒక్క వివాహం చేస్తే వారికి అది ఎంతో తప్పు. వివాహం రోజున వధువు అద్దాలతో కుట్టిన గాగిరి, ఓఢ్‌నీ (తలపైనించి వేసుకునే ముసుగు) జాకెట్టు వేసుకుంటుంది. వీలైనన్ని ఎక్కువ అద్దాలతో చిన్న గుండీలతో పరికిణీ అంతా డిజైన్ రూపంలో కుట్టిస్తారు.

వరుడు కూడా అద్దాలతో కుట్టిన పైజామా, అద్దాలతో కుట్టిన జాకెట్టూ (దీన్ని పటేల్ డ్రస్ అంటారు) వేసుకుంటాడు. వరుడు దంతంగాజు వివాహ సూచకంగా వధువుకి యిస్తాడు. కాబట్టి చేతికి దంతంగాజు వుంటే ఆ స్త్రీకి వివాహం అయిందని లెక్క. చెవులకి, మెడలోను, కాళ్ళకి వెండి నగలు ధరిస్తారు. మెడలోని వెండి నెక్లెసు (అంటే యించుమించు మన అడ్డిగలాటిది) వేసుకుంటారు. ఇంక "దాగిణ" అనే గొలుసు నగ, సూత్ర అనే పూసల గొలుసు కూడా ఆ రోజున వేసుకుంటారు వీరు. దాగిణ అన్నది మన కట్లకాసుల పేరులా వుంది, మొలతాళ్ళతో ఒక దాగిణకి, మరో దాగిణకి మధ్య ముడులు వేసి వుంటుంది. ఇది బంగారంతో చేసినది.

ఇక "సూత్ర" అన్నది సుమారుగా యిరవై వరసల నల్లపూసల గొలుసుతో మధ్య తాయెత్తులాంటి బిళ్ళ బంగారంతో చేసింది వుంటుంది. ఈ దాగిణ, సూత్ర వివాహం రోజున వరుడు, వధువుకి కానుకగా యిస్తాడు. వరుడు బంగారు దాగిణ యిచ్చుకునే శక్తి లేకపోతే గ్రామంలో ఎవరి వద్దనుండి అయినా ఎరువు తెచ్చి వధువుకి వేసి ఆ మరునాడు తిరిగి యిచ్చివేస్తాడు. వివాహం ఓ అరగంటలో అయిపోతుంది. ప్రొద్దున్నే వివాహం అవుతుంది. మధ్యాహ్నం పూరి, పాపిడి, గటియా, పాపడ్, బాజీలతో భోజనం చేసి సాయంకాలం వధువు, వరులను ఎద్దులబండి మీద కూర్చోపెట్టి వూరేగించి రాత్రికి అత్తవారింటికి తీసికెళతారు. ఆ రోజు ఒక్క రోజు మాత్రం వధువు అత్తవారింట వుంటుంది. మరునాడు తిరిగి పుట్టింటికి వచ్చేస్తుంది. అప్పటినుండి ప్రతీ పండగకి వరుడు వచ్చి తన భార్యని తీసికెళ్ళి తిరిగి దిగపెట్టేస్తాడు. రజస్వలానంతరం వధువు అత్తవారింట్లో వుంటుంది. అంటే పూర్వం మన సాంప్రదాయంలాగానే అన్నమాట.



## హరిజనులు

ప్రతీ గ్రామంలోనూ ఓ పది పదిహేను హరిజన కుటుంబాలు ఉన్నాయి. వీరు (యిప్పటికీ) పంచాయితీ ఆఫీసులోకిగాని, మందిరంలోనికి గాని రాకూడదు. దుకాణాలకి వస్తే దూరంగా నిలబడి తమకి కావలసినవి కొనుక్కోవాలి. వీరికి గ్రామానికి దూరంగా కొంత జాగా యిచ్చి, యిళ్ళు కట్టి యిస్తారు గ్రామ ప్రజలు. గ్రామంలో ఏదన్నా జంతువులు చనిపోతే హరిజనులు వచ్చి తీయాలిగాని వీరెవరు ముట్టుకోరు. గ్రామంలో ఎవరేనా చనిపోతే ప్రక్క గ్రామానికి హరిజను ద్వారా కబురు పెడతారు. ఈ పనులన్ని చేసి పెట్టడానికని గ్రామంలో పది కుటుంబాలకి ఒక హరిజన కుటుంబం వుంటుంది. వీరికి సంవత్సరానికి సరిపడినంత గోధుమలు బాజిరి వంటి దినుసులు గ్రామ ప్రజలే యిస్తూ వుంటారు. వీరు త్రాగే నీరు చెరువులో నుండి ఎవరేనా మంచి పొయ్యాలిగాని వీరు చెరువును ముట్టుకోకూడదు! ఇంత పురోభివృద్ధి చెందుతున్న రోజులలో కూడా ఇటువంటి మూఢాచారాలు కొనసాగుతున్నవంటే నాకెంతో ఆశ్చర్యం వేసింది.

## రబారీలు

వీరు గొర్రెల కాపరులు. ప్రతి గ్రామానికి దగ్గరలో తమకున్న కొద్దిపాటి గొర్రెలని మేపుకుంటూ కాలక్షేపం చేస్తారు. వీరు గొర్రె వున్నితో తయారు చేసినటువంటి వున్ని బట్టలే ధరిస్తారు. ఎండ, వాన, చలి ఏ కాలం అయినా వీరు ఆ బట్టలనే ధరిస్తారు. సంవత్సరానికి ఒకసారి దీపావళి నాడు స్నానంచేసి వేసుకున్న బట్టలు మళ్ళీ దీపావళికిగాని విప్పరు. ఇక్కడి నీటి కరువువల్ల వీరికి అలవాటు అయిందేమో అనిపిస్తుంది నాకు. గొర్రె మీద వున్ని అమ్మి జీవనం గడుపుతారు. కచ్ ప్రాంతాలలో నివసించే ఈ రబారీలు ఈ విధంగా వున్నా దక్షిణ గుజరాత్ ప్రాంతాలలో వుంటున్న రబారీలు-పాలు, పళ్ళు వర్తకం చేసుకుంటూ యిప్పుడిప్పుడే నాగరిక ప్రపంచంలోకి అడుగు పెడుతున్నారు.

## వసతి సౌకర్యాలు

కచ్ గ్రామాలకి వసతులు అనేవి ఏ విధంగాను లేవు. వెనుకబడిన గ్రామాలలో ఈ ప్రాంతం కూడా ఒకటిగా చెప్పవచ్చు. ప్రభుత్వం తరపున పంచాయితి ఆఫీసు తప్ప అక్కడి నుండి లభించే సదుపాయాలు లేవు. చెప్పుకుందికి, చెప్పింది విని చేసేందుకు ఎవరూ లేరు. బస్సులు కనీసం గ్రామాలవద్ద ఆగనన్నా ఆగవు. ఆపమని అడిగితే కండక్టర్ కటణ కలిగితే ఆపుతాడు. లేకపోతే ప్రక్క గ్రామంవద్ద దిగి నడిచి రావాలి. వీరికి త్రాగే నీటికి ఎప్పుడూ కరువే. మంచి నీటి చెరువు వద్దకి వెళ్ళి చూసాం. మనవేపు మురికి గుంటలో వున్నపాటి నీరు కూడా లేదు అందులో. ఆ నీరు కూడా బురద నీటి రంగులో వున్నాయి. దానిని వడబోసి త్రాగుతున్నారు ఈ పల్లె ప్రజలు. ఇండుక పిక్కగాని, స్పటిక గాని వేసి నీటిని తేర్చుకునే పద్ధతి వీరికి అసలు తెలీదు. ఈ చెరువు 'నాగ ఓలాడియా' గ్రామంలో వుంది. కాని మాతక్ గ్రామంలో ఆ చెరువు కూడా లేదు. ఒక కంట్రాక్టర్ రోజూ నీటిని చిన్న చిన్న ట్యూబ్‌వెల్స్ ద్వారా కొళాయిల్లోకి పంపు చేస్తాడు. ఒక మనిషికి డెబ్బైఐదు పైసల చొ॥న యిస్తే అతను నీరు సరఫరా చేస్తాడు. ఆ నీటిని వాళ్ళు త్రాగడానికి, బట్టలు వుతకడానికి అన్నిటికి వాడుకోవాలి. ఈ పల్లెలో విద్యుచ్ఛక్తి కూడా లేదు. ఈ అంధకారంలాగే వారి జీవితాలు కూడా రోజురోజుకి అధ్వాన్నంగా తయారవుతున్నాయి. వారి మొర వినేవాడు ఒక్క భగవంతుడే. ఆ భగవంతుడు కనికరించి వానలు బాగా పడితేవారి భుక్తికి లోపం వుండదు. 1950 తరువాత కాండ్లాపోర్ట్, 1970 తరువాత "యిఫ్కో" వారి ఎరువుల ఫ్యాక్టరీ వచ్చాక వారి జీవనంలో కాస్త మార్పు వచ్చింది. పల్లెలకి ముప్పైమైళ్ళ దూరంలో ఈ కర్మాగారాలు వున్న కంట్రాక్టర్ల లారీల్లో రోజు ఉదయం వచ్చి, సాయంకాలంవరకు పని చేస్తే రోజుకి ఎనిమిది రూపాయలు దొరుకుతాయి వీరికి. అంచేత కష్టపడినప్పటికీ తమలా, తమ పిల్లలు వారంలో నాల్గు రోజులు పస్తులు వుండక్కరలేదంటుంది నేటి కచ్ స్త్రీ.

జీవితంలో బ్రతకడానికి గాలి, నీరు ముఖ్యమంటారు. కాని వీరికి ఈ రెండు గగన కుసుమాలు. గాలి వీచిందంటే యిసుకతో నిండివుంటుంది. నీరు డబ్బుతో మనిషికింత చొప్పున కొనుక్కుని వాడుకోవాలి.

మన దేశంలో వెనకబడ్డ గ్రామాలు చాలానే వుండి వుండవచ్చును. కాని వాటిలో మొదటిగా చెప్పాలంటే కచ్ గ్రామాలనే చెప్పవచ్చును. ప్రభుత్వం వీటి అభివృద్దికి కేటాయించిన నిధులు ఏమైపోతున్నాయోగానీ ఈ ముప్పై ఏళ్ళలో కించిత్తు కూడా యిక్కడి గ్రామాలు గానీ, గ్రామస్థులు కానీ మారలేదు. మరో ముప్పై ఏళ్ళకైనా వీరు మారతారో లేదో కాలమే చెప్పాలి. □

—ఛాయా చిత్రాలు: సుసర్ల గణపతిరావు

# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక

Shingar
DELUXE
KAJAL

నకిలీవి ఉంటాయి
జాగ్రత్త. కొనేముందు
ప్యాక్‌పై శింగార్ పేరు
చూసి మరీ కొనండి

కాటుక మీ కళ్ళను అందంగా తీర్చిదిద్దాలిగానీ, అటూ ఇటూ చెదిరిపోయి కళ్ళ చుట్టూ వ్యాపించేదయితే ఇక అందమేముంటుందిమరి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక, ఆ మామూలు కాటుకలమల్లే చెదిరిపోకుండా నిలిచి, అందాన్నీ, ఆరోగ్యాన్నీ చాటిచెప్పే మీ కళ్ళకు సహజమైన, ముగ్ధమనోహరమైన రూపాన్ని సమకూరుస్తుంది.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుకకు మీ వేలి కొన తగిలిస్తే చాలు, ఆ వేడికి కావలసినంత కాటుక మాత్రమే కరిగి మీ వేలికి అంటుతుంది. ఆ కాటుకను మీ కనుకొలకులలో రాసుకుని రెండు మూడు సార్లు వేలితో రుద్దుకుని చూడండి. ఆపైన మీ కళ్ళలో కోటి వెలుగులు చిందుతాయి. లక్షలాది భావాలు, భాషలు తొణికిసలాడతాయి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక మీ కళ్ళకు మేలైనది, సాటిలేనిది షశిపాపల సున్నితమైన కళ్ళకు అనువైనది.

everest/79/SH/117-tl

## దక్షిణభారతీయ స్త్రీల కళ్ళల్లో
## కోటికాంతులను విరియింపజేసేందుకు

## శింగార్
## డీలక్స్ కాజల్ (కాటుక)

# సంస్కృత పాఠమాల [9]

**अहं** అహం = నేను (అన్ని లింగములలో) **त्वं** త్వం = నీవు (అన్ని లింగములలో)

(1) ధాతువు (క్రియాపదము) ఉత్తమ పురుష స్వరూపాన్ని తీసుకుంటుంది **अस्मद्** అస్మద్ (నా) శబ్దము కర్తయైనప్పుడు. ఉదాహరణకు **अहं पठामि** అహం పఠామి. (నేను చదువుచున్నాను) (దీన్ని ఇంగ్లీషులో First Person అంటారు)

(2) ధాతువు (క్రియాపదము) మధ్యమ పురుష స్వరూపాన్ని తీసుకుంటుంది **युष्मद्** యుష్మద్ శబ్దము కర్తయైనప్పుడు దీనిని ఇంగ్లీషులో Second Person అంటారు. ఉదాహరణకు **त्वं पठसि** త్వం పఠసి నీవు చదువుచున్నావు.

(3) ధాతువు (క్రియా పదము) ప్రథమ పురుష స్వరూపాన్ని తీసుకుంటుంది. **अस्मद्** అస్మద్, **युष्मद्** యుష్మద్ శబ్దములు కాక మరేదో శబ్దము కర్తయైనప్పుడు. దీనిని ఇంగ్లీషులో Third person అంటారు. ఉదాహరణకు **सः पठति** సః పఠతి- అతడు చదువుచున్నాడు.

(1) **अस्मद् शब्द:** అస్మద్ శబ్దః అస్మద్ శబ్దము. (ప్రథమావిభక్తి రూపములు)
**अहम्** అహమ్ ఏకవచనము. (నేను)
**आवाम्** ఆవామ్ ద్వివచనము (మేము యిద్దరము) **वयम्** వయమ్ – బహువచనము (మేము)

(2) **युष्मद् शब्द:** యుష్మద్ శబ్దః యుష్మద్ శబ్దము ప్రథమావిభక్తి రూపములు
**त्वम्** త్వమ్ – ఏకవచనము (నీవు)
**युवाम्** యువామ్ ద్వివచనము (మీరిద్దరు)
**यूयम्** యూయం బహువచనము (మీరు)

ప్రథమావిభక్తిలో క్రియారూప వాక్యములు

(1) ఉత్తమపురుష (First Person) **मि** మి (ఏక) **वः** వః (ద్వి) **मः** మః (బహు)
**अहं गच्छामि** అహం గచ్ఛామి నేను వెళ్ళుచున్నాను.
**आवाम् गच्छाव:** ఆవామ్ గచ్ఛావః మేము (యిద్దరము) వెళ్ళుచున్నాము.
**वयम् गच्छाम:** వయమ్ గచ్ఛామః మేము వెళ్ళుచున్నాము.

(2) మధ్యమపురుష (Second Person) **सि** సి (ఏక్) థః **थः** ద్వి **थ** థ బహు
**त्वम्** త్వమ్ **गच्छसि** గచ్ఛసి నీవు వెళ్ళుచున్నావు.
**युवाम् गच्छथ:** యువామ్ గచ్ఛథః మీరు (యిద్దరు) వెళ్ళుచున్నారు.
**यूयम् गच्छथ** యూయం గచ్ఛథ మీరు వెళ్ళుచున్నారు.

(3) ప్రథపురుష (Third Person) పుంలింగము—(**सः** సః వాడు **तौ** తౌ (వారిద్దరు) **ते** తే (వారు)
**ति** తి **त** తః **अन्ति** అన్తి
**सः** సః **गच्छति** గచ్ఛతి. వాడు వెళ్ళుచున్నాడు.
**तौ** తౌ **गच्छत:** గచ్ఛతః వారు (యిద్దరు) వెళ్ళుచున్నారు.
**ते** తే **गच्छन्ति** గచ్ఛన్తి వారు వెళ్ళుచున్నారు.



# పెరటితోట పెంపకం

**– లలితకుమారి**

**కె. జి. సరళకుమారి, కుప్పం**

మా ఇంట్లో 20 సంవత్సరాలుగా 'నిత్యమల్లి' చెట్టు వుండేది. ఈ మధ్య పువ్వులు సరిగ్గా యివ్వనందున దాన్ని తీసి వేశాము. ఆ స్థానంలో 'రోజా' చెట్టు పెట్టాలనుకుంటున్నాము. ఇప్పుడు మట్టి ఏమైనా మార్పిడి చెయ్యాలా? రోజా చెట్టు బాగా ఎదగడానికి ముందుగా కొత్త ఎరువులు ఏవైనా వెయ్యాలా?

ఎప్పుడూ కూడా ఒక చెట్టు వున్న చోట అది తీసేశాక అదేచోట మరో చెట్టు నాటకూడదు! ఎంచేతంటే అంతకు మునుపు వున్న చెట్టు అక్కడి భూమిలోని సారాన్నీ, చెట్టుకి కావలసిన ఆహార పదార్థాలన్నిటినీ సంగ్రహించి వుంటుంది కాబట్టి, సారం లేని భూమిలో చెట్టు నాటి ప్రయోజనం వుండదు. కనుక ఆ స్థలానికి కొంచెం పక్కగా గొయ్యి తవ్వి రోజా చెట్టు వేస్తే మంచిది.

**పి. విమల, నంద్యాల**

మేము ఒక మూర పొడవు వున్న మనీ ప్లాంట్ తెచ్చి సీసాలో నీళ్ళల్లో వుంచాము. అది బాగా పెరిగిన తరువాత దాన్ని రెండు ముక్కలుగా కత్తిరించి వుంచాము. ప్రక్కన ఆకులు వచ్చాయి. ఇక ఆ తరువాత పెరగలేదు. దాన్ని రేకులకి అన్చి వుంచేసరికి మాడిపోయింది. మనీప్లాంట్ చెట్టు త్వరగా పెరగాలంటే ఏం చెయ్యాలి? అది వుంచిన నీటిలో ఏమన్నా కలపాలా?

మనిప్లాంట్ మొక్కలు వేళ్లతోసహా వున్నవి సంపాయించి సీసాలో వేస్తే మంచిది. కాడతో వేసే మొక్కల కన్న వేళ్లతోసహా వున్న మొక్కలైతే బాగా పెడుగుతాయి. ఇటువంటి సమస్యలు రావు. 'కల్చర్ సొల్యూషన్' అని అమ్మతారు. అందులో చెట్టు ఎదగడానికి కావలసిన పదార్థాలన్నీ వుంటాయి–ఒక్క ఎండతప్ప. ఆ సొల్యూషన్ తీసుకువచ్చి నీటిలో కలిపితే ఏ మొక్కయినా చక్కగా పెరుగుతుంది.

**ఆర్. రజనీరెడ్డి, కోరగుంటపల్లి**

జినియా, డేలియా, కాస్మాస్, సన్‌ఫ్లవర్ మొదలైన పూల మొక్కల విత్తనాలు ఏ మాసంలో వెయ్యాలి? పై పూల మొక్కలను నారుగా పోసి, తీసి వేయాలా లేక విడివిడిగా వేయాలా?

జినియా, సన్‌ఫ్లవర్, కాస్మస్ – యిప్పుడు వెయ్యొచ్చు. ఆగస్ట్ నెలలోపుగా ఐతే మంచిది.

డాలియా – విత్తనాలు వేస్తే, మొక్క వచ్చి పెరగడానికి సంవత్సరం పడుతుంది. వాటి దుంపలు నాటినట్లయితే సెప్టెంబరు-అక్టోబరు నెలలలో వేస్తే క్రిస్మస్ నాటికి పెరుగుతాయి. వీటిలో సూర్యకాంతి పువ్వు (సన్‌ఫ్లవర్) మడులుగా చేసి వేసుకోవచ్చు. తక్కినవి నారుగానే మడిలో వేసి మరో చోటుకి–కుండీలలోకి గానీ, భూమిలోకి గానీ నాటాలి. అలా చేస్తే మొక్క బాగా పెరుగుతుంది. ఇక ఎరువు లంటారా – పశు పెంట, చెత్త ఎరువు, ఎర్రమన్ను వీటికి శ్రేష్ఠమైన ఎరువులు.

కుంకుడు చెట్లు పెరట్లో పెంచాలంటే ఎలా? దాని ఎరువు, నీరు సంగతి చెబుతారా?

కుంకుడు మొక్క వున్న యింట్లో–దరిద్రం తాండవమాడుతుందంటారు. అందుకే సాధారణంగా యిళ్లల్లో పెంచరు. తమాషా ఏమిటంటే అది ఎక్కడబడితే అక్కడ చాలా సులభంగా పెరుగుతుంది. ముందుగా కుంకుడు గింజ ఒక తొట్లో నాటండి అది మొలకెత్తుతుంది. ఒక అడుగు ఎత్తుకి మొక్క వచ్చాక విడిగా తీసి భూమిలో నాటండి.

**ఆర్. సంపత్కుమారి, తిరుపతి**

మా పెరటిలో ఒక కుండీలో క్రోటన్ మొక్క వుంది. అది సంవత్సరానికి ఒకే ఒక మారు ఎర్రని పువ్వు గుండ్రంగా గ్లోబు మాదిరిగా పూస్తోంది. దాని కింద దుంప వుంటుంది. ఈ మధ్య పందికొక్కులు దుంప కోసం త్రవ్వివేస్తున్నాయి. పందికొక్కులు తవ్వకుండా, చెట్టు చావకుండా వుండడానికి ఏదైనా మందు చెబుతారా?

మీరు చెప్పిన మొక్క క్రోటన్ మొక్క కాదు. దాన్ని ఇంగ్లీషులో 'పిన్ కుషన్ లిల్లీ' అని అంటారు. ఇంతకీ ఏమంటారు–పందికొక్కులు దుంపని తవ్వేస్తున్నాయని కదూ! వ్యవసాయశాఖ వారిని అడిగితే పందికొక్కులకి మందు యిస్తారు. ఆ మందు చెట్టు చుట్టూ చల్లితేచాలు–అవి దగ్గరకి రావు.

## కూరలు – పోషక పదార్థాలు

**బంగాళా దుంపలు :**

వీటికి దుంపే విత్తనము. ఈ మొక్క సుమారు గజం ఎత్తువరకూ పెరుగుతుంది. వీటిల్లో తెలుపు, ఎరుపు దుంపలు అని రెండు రకాలు వున్నాయి. కొన్ని దుంపలు కోలగానూ, కొన్ని గుండ్రంగానూ వుంటాయి. ఈ దుంపలు నెల రోజులవరకు నిలవ వుంటాయి.



ప్రతి 100 గ్రాముల బంగాళా దుంపల్లోనూ— 74.7 గ్రాముల తేమ, 1.6 గ్రా॥ ప్రొటీన్లు, 0.1 గ్రా॥ క్రొవ్వు పదార్థం, 0·6 గ్రా॥ ఖనిజ పదార్థం, 22.9 గ్రా॥ పిండిపదార్థం, 0 01 గ్రా॥ కాల్షియం, 0.03 గ్రా॥ భాస్వరం, 0.7 మిల్లిగ్రాముల ఇనుము, 40 యూనిట్ల విటమిన్ ఎ, 0.10 మిల్లి



పిన్ కుషన్ లిల్లీ

గ్రాముల విటమిన్ బి1, 1.2 మి. గ్రా॥ నికోటినిక్ ఆమ్లము, 0.01 మి. గ్రా॥ రిబోఫ్లోవిన్, 17 మి. గ్రా॥ విటమిన్ సి, 15 మి.గ్రా॥ ఆక్సాలిక్ ఆమ్లము వున్నాయి. వీటి కెలోరి విలువ-99.

బంగాళదుంపలకు ఉల్లిముక్కలు చేర్చి చేసిన వేపుడు కూర రుచిగా వుంటుంది. వీటిని కొందరు ఉడకబెట్టిన కూరగానూ, నిమ్మకాయ పిండి ఉప్మా కూరగానూ కూడా చేసుకుంటారు. బంగాళ దుంపలని యితర కూరలతో కలిపి కూడా చేసుకుంటారు. రొట్టెల పిండితో కలిపి 'ఆలూ పరోటా'లని చేసుకునే చపాతీలు కూడా రుచిగా వుంటాయి. బంగాళా దుంపలను ఏ విధంగా చేసుకున్నా నోటికి హితవుగానూ రుచిగానూ వుంటాయి.

బంగాళదుంపలకి వేడి చేసే స్వభావం వుందని చెబుతారు. కాని వీటికి చలువచేసే గుణం మాత్రమే వుంది. బలాన్ని, వీర్యపుష్టిని చేకూరుస్తుంది. చనుబాలును వృద్ధి చేస్తుంది. ఎరుపు రంగుగల బంగాళా దుంపలు హృదయమందలి కఫాన్ని హరింపజేస్తాయి. వీటిలో పోషకాహారాలు, విటమిన్లు వున్నాయి. అయితే బంగాళదుంపలకి మలబద్ధము చేసే గుణము, కఫం, వాతం, వృద్ధి చేసే గుణము వుంది – అని చెబుతుంది ఆయుర్వేద శాస్త్రం.

**డి. వత్స, బెర్హాంపూర్**

మా పెరట్లో అరటిమొక్కలు వేసి సుమారు రెండు సంవత్సరాలైంది. మొక్కలు ఏపుగా పెరిగి పువ్వు వేసి కాపుకొచ్చే సమయంలో చెట్టు మొదళ్ళతో సహా కూలిపోతున్నాయి. ఏం చేసినా ఫలితం లేకపోతోంది. కారణం ఏమిటంటారు?

చెట్టు అలా పడి పోవడానికి అనేక రకాలైన కారణాలు వున్నాయి. అందులో భూమిలోని లోపం ముఖ్యమైనది. మీరు వ్యవసాయశాఖ వారికి చూపితే వాళ్లు పరీక్ష చేసి తగిన మందు యిస్తారు.

దబ్బ, నిమ్మ, మల్లె మొక్కలు వేసి నాలుగు సంవత్సరాలైంది. మొక్కలు బాగానే పెరుగుతున్నాయి. కాని పూయటం యింతవరకూ లేదు. అసలు మల్లె త్వరగా పూస్తుందంటారు కదా. ఎంచేత పూయటం లేదు. దీనికి మీ సలహా ఏమిటి?

దబ్బ, నిమ్మ అంట్లయితే వెంటనే కాపుకి వస్తాయి. విత్తనాలయితే చాలా టైమ్ తీసుకుంటాయి. చెట్లకి సరిగ్గా ఎరువు పడకపోవడం కూడా ఒక కారణం అయివుంటుంది. అందువల్ల చెట్టు చుట్టూ రెండున్నర అడుగుల దూరంలో గొయ్యి తవ్వి ఎరువు వెయ్యాలి. సాధారణంగా చెట్టు వేళ్లు చెటు మొదలుకి కాస్త దూరంలో వుంటాయి. అందువల్ల చెట్టు మొదలులో కన్న, యిలా కొద్ది దూరంలో తవ్వి ఎరువు వేస్తే చెట్టు వేళ్లు ఆ ఆహారాన్ని అందుకుంటాయి. అప్పుడు చెట్టు బాగా కాపు కాస్తుంది. ఈ విషయం గ్రహించక చాలామంది చెట్టు మొదలు దగ్గర ఎరువు, నీరు వేసి వూరుకుంటారు. అది తప్పు ఇక మల్లె చెట్టు అంటారా – అందులో కొన్ని మొక్కలు వున్నాయి. వాటిని సన్నాసి జాతి మల్లెలు అంటారు. అవి పుయ్యవు. మొక్కని చూస్తే గానీ చెప్పలేం. ఏమైనా ఎరువు వేసి చూడండి. ఫలితం కనిపిస్తుందేమో.

**టి. సావిత్రి, ఏలూరు**

మా పెరటిలో ఒక తెల్ల పువ్వుల లిల్లీ మొక్క వుంది. అది కొని ఒక సంవత్సరం అయింది. ఇంతవరకూ ఒక్క పువ్వు కూడా పుయ్యలేదు. అది కొన్నప్పుడు ఒక మొగ్గ వుంది. అది మొగ్గగానే రాలిపోయింది. ఈ మొక్క పువ్వులు పుయ్యాలంటే ఏం చెయ్యాలి?

లిల్లీ మొక్క ఉల్లిపాయ దుంప జాతికి చెందినది. అది భూమిలో వుండి ఆకు రాల్చేస్తుంది—కంద, పెండలం లాగా. మళ్లీ వర్షాలు వచ్చినప్పుడు పువ్వు వస్తుంది. పక్కనే పిలకలు వస్తాయి. వాటిని విడిగా తీసి పాతాలి. ఎరువు బాగా వెయ్యాలి. మీరు ప్రారంభంలో పాతినప్పుడు సరైన శ్రద్ధ తీసుకుని పాతి వుండరు. ఎరువు సరిగ్గా లేకపోవడం వల్ల, సరైన పోషణలేక మొగ్గ రాలి పోయింది.

**ఆశా జోసఫ్, కాజీపేట**

కరివేపాకు చెట్టుకి ఏ ఎరువులు వేస్తే బాగా పెరుగుతుందో చెబుతారా?

పశువెంట శ్రేష్ఠమైన ఎరువు. కరివేపాకు చెట్టుకి కూడా వేళ్లు చాలాదూరం వరకూ పాకుతాయి. వేళ్లున్నచోట ఎరువు వేస్తే చెట్టుకి బలం. అందువల్ల చెట్టుకి రెండడుగుల దూరంలో గాడి తవ్వి అందులో ఎరువు వెయ్యాలి. తగిన నీరు పొయ్యాలి. అప్పుడు చెట్టు బాగా పెరుగుతుంది.

**పి. రోజా, దంగేరు**

మా పెరట్లో పంపరపనాస, పనస చెట్లు నాటి నాలుగేళ్ళయింది. ఇప్పటివరకూ కాపు రాలేదు. బలంగా, ఏపుగా ఎదగడానికి ఈ చెట్లకి ఏఏ ఆహారం వేస్తే మంచిదంటారు?

పనస చెట్లు కాపుకి రావడానికి ఆరు నుంచి ఎనిమిదేళ్ళ వరకూ పడుతుంది. చెట్టు చుట్టూ గాడి తవ్వి ఎరువు వెయ్యండి. అయితే ఇది చెట్టుకి బలం చేకూరడానికే తప్ప బాగా ఎరువు వేసినంత మాత్రాన వెంటనే కాపు కాసెయ్యవు. 'దేనికైనా టైమ్ రావాల'ని అంటారే – ఆ టైమ్ కొన్ని చెట్లకి కూడా వర్తిస్తుంది. వాటిల్లో పనస చెట్టూ వుంది. ఏం చేస్తాం....మరో రెండు మూడేళ్ళు ఆగండి. ఇప్పటి కష్టానికి తగిన ఫలితం తియ్యటి పనస తొనల్లో అప్పుడు దక్కుతుంది. □

దాసరి నారాయణరావు



శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు

అన్నపూర్ణ స్టూడియోస్

# కళ్యాణి

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: వెంకట్ అక్కినేని

అన్నపూర్ణ

Nandi

## చిట్టి కథ

# ఊహాలవీణ

సాయంత్రం 5 గంటలు కావస్తున్నది. ఎవరో తలుపు తట్టిన చప్పుడైతే తలెత్తి చూశాను నేను. మా అమ్మ యింట్లో పని చేసుకుంటున్నది. నేను వెళ్ళి తలుపు తీశాను. ఆ వచ్చిన వ్యక్తిని చూడగానే నా ఆనందానికి అంతులేదు. ఆ వచ్చినది ఎవరో కాదు! మావయ్యే! నేను మా అమ్మని పిలిచాను. అమ్మ వస్తూనే 'ఏరా? అంతా బాగున్నారా?' అంటూ కుశల ప్రశ్నలు వేస్తోంది. ఇక, అమ్మా, మావయ్యా కబుర్లలో పడ్డారు. నేను మావయ్యకి కాఫీ తెస్తూ వాళ్ళ సంభాషణ విని ఆగిపోయాను. మావయ్య అడుగుతున్నాడు – "చెల్లాయ్! ఆఖరి పిల్ల ఏం చేస్తోంది?" అని అప్పటికే మా అమ్మ–మా అక్కయ్యల సంసార విషయాలు చెప్పినట్టుంది. నన్ను గురించి అమ్మ చెప్పేలోగా, నేను ఆగలేక వెళ్ళాను. మావయ్య నన్ను చూసి నవ్వుతూ అమ్మను "దీనికి చదువా? లేక సంగీతం నేర్పిస్తున్నావా?"



అని అడిగాడు. అప్పుడు అమ్మ నవ్వుతూ యిలా చెప్పింది–"వీణ నేర్పిస్తున్నానన్నయ్యా! అందరూ బయటికెళ్ళాక యిది ఆ వీణ పట్టుకుని కూర్చుంటుంది. ఆ మాష్టారు ఏం చెప్తున్నాడోగాని, రోజూ హాలు మధ్యలో కూర్చుని ఏదో పాట అని వాయిస్తూ కూర్చుంటుంది. ఇంటికి ఎవరు వచ్చిందీ కనుక్కోదు. "ఇప్పుడింకా నయంగాదూ! వీణ నేర్పించిన వారం రోజులకే "భగ్నమైన నా వీణ" అని వాయించడం మొదలెట్టింది. ఇదీ దీని వరసన్నయ్యా!" అని చెప్పడం ముగించింది. దానికి మావయ్య నవ్వుతూ, "అయితే, దీనికి తొందరగా పెళ్ళి చేసేయమ్మా" అంటూ ఒక సంబంధం చెప్పాడు. నేను చాటుగా మావయ్య చెప్పినదంతా విని చాల బాధపడ్డాను. ఎందుకంటే యింకొన్ని రోజుల్లో నాకు వీణ వాయించుకోడానికి అవకాశం ఉండదు కదా! మావయ్య ఏదో పనుందంటూ ఆ రాత్రికే వెళ్ళిపోయాడు.

ఆ రోజు శుక్రవారం. మా యిద్దరక్కయ్యలు నాకు 'పెళ్ళి చూపులని' తెలిసి వచ్చారు. సరే, యిక ఆ మధ్యానానికే వచ్చారు పెళ్ళివారు. కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. అలాగే నేను వాళ్ళకి నచ్చడం, తాంబూలాలు పుచ్చుకోవడం, పెళ్ళి జరగడం అన్నీ కలలోలా జరిగిపోయాయి. దానివల్ల నా వీణ మూల పడింది. సంసార సాగరంలో పడిన తరువాత వీణను చూడ్డానికి కూడ వీలుబడేది కాదు. ఎప్పుడైనా వీణను తీస్తే, మా అత్తగారి సాధింపులు, ఆడపడుచుల గుసగుసలు ఎక్కువవడం మూలాన వీణ తాకడం కూడా మానేశాను. ఇంకొన్నాళ్ళకి నా సంతానానికి సేవ చేయడమే సరిపోయింది. 'వీణ' మాటే మరిచిపోయాను. రోజులు దొర్లిపోయాయి. అప్పటికి నాకు నలభయ్యో యేడు వచ్చింది. ఓసారి మా కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ, మనవరాళ్ళూ వస్తున్నారంటే యిల్లు సర్దుదాం కదా – అని వీణ వున్న పెట్టెను కూడ సవరించాను. అప్పుడు నాకు గుర్తొచ్చింది–నా దగ్గర వీణ వున్న సంగతి! సరే కదా అని వీణ శుభ్రం చేసి సరిగమలన్నా వాయించాలని కూర్చున్నాను. ఇంతలో కిలకిలమంటూ నా మనవలు, మనవరాళ్ళూ వచ్చారు. వాళ్ళని చూసిన ఆనందంలో వీణని వదిలేసి, కోడళ్ళతో మాట్లాడదామని వెళ్ళాను. అంతలో మా పెద్దాడి కొడుకు నానిగాడు వచ్చి, "బామ్మా! బామ్మా! ఈ తీగేమిటి?" అని అడిగాడు. నాకప్పుడు గుర్తొచ్చింది. నేను వీణని హాల్లో వదిలేశానని. ఇంతలో మా రెండోవాడి బాబీ పరిగెట్టుకుంటూ వచ్చి, నన్ను బరబరా హాల్లోకి లాక్కుని వెళ్ళి,



వీణకున్న గుమ్మడి బుర్రని చూపించి, ధాని తాకి చూపిస్తూ, "బామ్మా! బామ్మా! యిదేచి పులు చొండవూ! బలే బావుంటుంది" అని అడిగాడు. ఏమీ తెలియని ఆ పసిపిల్లలకి నేనేం చెప్పగలను? ఏమనగలను? ఇక చేసేదిలేక, మా మూడో వాడి కూతురికి 'వీణ' అని పేరు పెట్టుకున్నాను. ఆ విధంగానైనా 'వీణ'ని తలుచుకుందామని. మా వారు నవ్వుతూ నాకేసి అదోలా చూసి, "నీకింకా వీణ మోజు పోలేదేమిటే" అన్నారు. నేను నవ్వాను....కోరికలుండరాదంటారు అందుకేనేమో!

—చెరువు కవిత



నిర్వహణ మంగళా కందూర్

## అద్దాలు – పూసలు

అద్దాలను రకరకాలుగా కుట్టుకోవచ్చు. పెద్ద అద్దాలతో బ్యాగ్స్ కుట్టే మెరుస్తూ తమాషాగా కనిపిస్తాయి. గుండ్రటి అద్దాలను లంగాలకు, చీరలకు కుట్టుకోవచ్చు. అద్దం మందంగా వుండకూడదు. ఎంత పలుచగా వుంటే అంత తేలికగా వుంటాయి కట్టుకోటానికి. పైగా కుట్టడం కూడా ఇబ్బంది లేకుండా వస్తుంది.

Iవ బొమ్మలో చూపిన విధంగా అద్దం గుడ్డపైన పెట్టి వేలితో నొక్కి పట్టుకొని దానిపైన (1)వ బొమ్మలోలాగా రెండుపోరల ఎంబ్రాయిడరీ దారంతో కుట్టువేయాలి. అంటే ఫ్రేమ్ తయారు చేయాలి. రెండు మార్లు అలా కుట్టాలి. తర్వాత దీనిపైన కాజాకుట్టు దగ్గర దగ్గరగా వేయాలి. ముళ్లు బయటి వైపు కుండాలి. తర్వాత అద్దానికి పాయింట్ ఒక అంగుళం దూరంలో గుడ్డపైన ఈ కాజాకుట్టు నుండి ఇంటూ కుట్టు (క్రాస్ స్టిచ్) దగ్గరిగా వేస్తూ పోతే చక్కగా వుంటుంది.





III (1)



గుండ్రటి అద్దం IIIవ బొమ్మలోలాగా కుట్టుకోవచ్చు. అద్దం పెట్టి చుట్టూ గీతవేసి, అద్దం తీసివేయాలి. గీతకు కొద్ది దూరంగా చుట్టూ గొలుసు కుట్టు కుట్టాలి. ఇప్పుడు అద్దం పెట్టి వేలితో గట్టిగా నొక్కి, పట్టుకొని గొలుసుకుట్టులోని ఒక వైపు దారం గుండా సూదిని పోనిచ్చి అద్దంపైన కాజాకుట్టు



వేయాలి. ఆ రౌండంతా అలానే వేయాలి కాని అద్దం జారకుండా బాగా బిగుతుగా పట్టుకోవాలి. తర్వాత ఒక రౌండంతా క్రిందికుట్టు గుండా దారాన్ని వేస్తూ

(2) (3)



పోవాలి. అద్దం గట్టిగా నిలవకపోతే ఇంకొక రౌండ్ ఇలా వేయాలి. అద్దం అడుగున చుట్టూ కావాలంటే గొలుసు కుట్టుగాని, కొమ్మ కుట్టుగాని వేసుకోవచ్చు. అలా విడిచిపెట్టేసినా బాగానే వుంటుంది.

మరీ చిన్న అద్దాలయితే IVవ. బొమ్మలో లాగా గుడ్డమీద అద్దం వుంచి ఒక వరుస కాజా కుట్టు వేస్తే చాలు.

I (1)



(2)



(3)



II (1)




(2)



(3)



# మఫ్లర్



[వచ్చేది చలికాలం. రావడానికి ఇంకా వ్యవధి వుంది గదా అనుకున్నా - ఇప్పుడే కొన్ని పన్లు మొదలు పెట్టకపోతే, తెమలవు. 'కాలం' వచ్చేసిన తర్వాత చూసుకోడం కంటె, ముందుగా చూసుకోడం మంచిదన్న ఉద్దేశంతో 'మఫ్లర్' అల్లిక గురించి ఇప్పుడే తెలియజేస్తున్నాము.]

రెండు చెవులూ, తల కవర్ అయి మెడదగ్గర రిబ్బన్ ముడిలాగ వుండి అతి నాజూకుగ కనిపిస్తుందీ మఫ్లర్. సుమారు 50 గ్రాముల వూలు అవసరం వుంటుంది. స్వెటర్ రంగు వూలులోనే దీనిని అల్లితే మ్యాచింగ్ కూడ బాగుంటుంది. రంగులలో 2,3 అల్లుకుంటే మ్యాచింగ్ చక్కగా కుదురుతుంది. దీని అల్లకానికి 10వ నంబర్ నీడిల్స్ కావాలి. మఫ్లర్ అంతే నిట్స్ (Knits) వుంటాయి. ఇటు, అటు సన్నగ వున్న దగ్గర-అంటేగ్యాప్ దగ్గర-మాత్రం రాంగ్‌సైడ్‌లో పర్ల్స అల్లాలన్న మాట. ఎటువంటివారికైనా 1,2 రోజుల మించిపట్టదు అల్లటానికి.

ఒక రింగులో మొదలెట్టి ప్రతి లైనుకూ మొదట్లో ఒక రింగు చొప్పున ఎక్కిస్తూ 40 రింగులు వచ్చేదాకా అల్లాలి. అన్నిలైనులా నిట్ అల్లాలి. ఇంకో 2 పదవ నంబర్ సూదులు దగ్గరిగా వుంచుకొని ఈ 40 రింగులను రెండు సూదులలోకి తీసుకోవాలి. మొదటి రింగు ఒక నీడిల్‌కు, రెండవ రింగు మరొక నీడిల్‌కు మూడవ రింగు మొదటి దానికి నాలుగవ రింగు రెండవ నీడిల్‌కు....ఇలా బేసి అంకె రింగులన్నీ ఒకదానికి, సరిఅంకె రింగులన్నీ ఇంకొకదానికి ఎక్కించుకోవాలి. ఊలు కొస వున్న నీడిల్‌లోని రింగులన్నీ అలానే వుంచుకొని మిగిలే 20 రింగులను ఒక సేఫ్టీ పిన్ను లోనికి తీసుకోవాలి. ఊలు వున్న రింగులను ఒక లైను నిట్, ఒక లైను పర్ల్ చొప్పున సుమారు 15 లైనులు అల్లాలి (సుమారు 2 అంగుళాల పొడవన్న మాట). బయట కనిపించే వైపు నిట్స్, లోపలికి వెళ్ళేవైపు పర్ల్ అల్లాలన్నమాట. దీనిని అలానే వుంచుకోవాలి. తర్వాత సేఫ్టీ పిన్నులోని రింగులను వేరే నీడిల్‌కు ఎక్కించుకుని పైదాని లాగా 15 లైనులు అల్లుకొని (వేరే వూలు ముడి వేసి అతికించుకొని) రెండు నీడిల్స్‌లోని రింగులను ఒకే నీడిల్‌లోనికి తీసుకుని నిట్స్ అల్లుకుంటూ పోవాలి. తలకు పెట్టుకుని చూసుకుంటూ (సుమారు 20 అంగుళాలు) మనకు సరిపడే పొడవు వచ్చిన తర్వాత, మొదట్లో లాగా రెండు నీడిల్స్‌కు చెరో 20 రింగుల చొప్పున తీసుకుని విడివిడిగా 2 అంగుళాల పొడవు అల్లుకుని గ్యాప్ తెప్పించి, రెండు సూదులలోని రింగులనూ తిరిగి ఒక నీడిల్‌లోకి తెచ్చుకుని ప్రతి లైను మొదట్లో ఒక్కొక్క రింగు చొప్పున తగ్గించుకుని ఆఖరున ఒక రింగు వుంచుకుంటే మఫ్లర్ అల్లకం పూర్తి అయినట్టే! ఈ గ్యాప్ అల్లేటప్పుడు బయటి వైపు నిట్స్, లోవైపు పర్ల్స అల్లాలి. ఒక గ్యాప్ లోనుంచి ఇంకొక కొసను దూర్చి బయటికి తీస్తే రిబ్బన్ ముడిలాగా చక్కగా వుంటుంది. వేరే ముడి అవసరం లేదు. మాటి మాటికి సరిచేసుకునే పని వుండదు. చలికాలంలో చెవులకు చల్లగాలి సోకకుండా కాపాడుతుందీ మఫ్లర్. చీరకు చోళీలాగా ప్రతిస్వెటర్‌కు ఒక మ్యాచింగ్ మఫ్లర్ అల్లుకోవాలి.

IV



బ్యాగులమీదికయితే 1 లేక $1\frac{1}{2}$ అంగుళాల చదరం గల అద్దం ముక్కలు కావాలి. వీటికి రేకుతో ఫ్రేము కూడ కట్టించాలి. లేకపోతే కొసలకు దారం రాసుకొని తెగిపోతుంది. దీనికి కూడ II బొమ్మలో లాగా దారంతో ఫ్రేము 2 మార్లు వేసి, దానిపైన కాజాకుట్టు కుట్టాలి. తర్వాత ఈ కాజా కుట్టు నుండి గుడ్డకు ఇంటూ కుట్టు వేయాలి.

### పూసల అలంకరణ

అద్దం చుట్టూ పూసలతో కుడ్తేనే అందాన్నిస్తుంది ఈ కుట్టడం కూడా పద్ధతి ప్రకారం వుండే పూస దృఢంగా వుంటుంది. ఎలాపడ్తే అలా వంకర టింకరగ వుండకూడదు. పూస పడుకొన్నట్టుగ గాక కూచున్నట్టుగ వుండాలి. అందుకే పూస రంగులోనే దారం వుంటే, పూసగుండా దారం పోయినా కనిపించదు. పూసలు కుట్టటానికి అతి సన్నటి సూది కావాలి.

ఎంబ్రాయిడరీ దారంకన్న మిషన్ దారమయితేనే గట్టిగ వుండి బాగుంటుంది. Vవ బొమ్మను చూస్తూ చెప్పిన విధంగా కుట్టండి. బాగ అర్థమవుతుంది. బొమ్మలో 1 నుండి మొదలెట్టాలి. గుడ్డ అడుగునుండి సూదిని పైకి తీసి ఒక పూస ఎక్కించాలి. అక్కడ పూస ప్రక్కగ సూదిని క్రిందికి గుచ్చి, క్రిందినుండి 2 దగ్గిరకి పైకి తీయాలి. బొమ్మలో అర్థమవాలని దూరంగ వేశాను. కాని దగ్గరదగ్గరగ వేస్తేనే

V




బాగుంటుంది దారం కనిపించకుండా జిగ్ జాగ్ (వంకరటింకరగా) లాగ పూసలు కుట్టాలి. 2 దగ్గర పూస ఎక్కించి 1వ పూసలోనుండి 3కు వెళ్ళాలి. తిరిగి అక్కడ పూస ఎక్కించి 2 పూసగుండా 4కు వెళ్ళాలి. అక్కడ పూస ఎక్కించి 3 నుండి 5 కు వెళ్ళాలి. 5 దగ్గర పూస ఎక్కించి 4 నుండి 6 కు వెళ్ళి, అక్కడ పూస ఎక్కించాలి. తిరిగి 5వ పూస గుండా 7కు వెళ్ళి, అక్కడ పూస ఎక్కించి 6 నుండి వెళ్ళాలి. ఇలాగే చుట్టూ పూసలు దగ్గరి దగ్గరిగా వేస్తూ పోవాలి. బొమ్మలో చిన్న చిన్న గీతలున్న చోట దారం గుడ్డ అడుగు నుండి వెళ్ళాలని, పెద్ద యారో వున్న చోట గుడ్డపై నుండి వెళ్ళాలని గుర్తుంచుకోండి. అద్దం కుట్టడానికి గుడ్డ రంగులో వుండాలి దారం. పూస మాత్రం గుడ్డకు వ్యతిరేకమైన రంగులో వుండాలి. ముదురు గుడ్డకు లైట్ పూస, లైట్ గుడ్డకు ముదురురంగు పూస బాగా మ్యాచ్ అవుతుంది. పూసరంగులో దారం వుండాలి.

## 10

ఒకరోజు రాత్రి సిద్దార్థ బాగా పొద్దుపోయి ఇంటికి వచ్చాడు.

బట్టలు మార్చుకొని పడుకున్నాడు.

"భోజనం చెయ్యవూ?" కల్పన అడిగింది.

"చేసే వచ్చాను."

"ఎక్కడ? ఏదైనా పార్టీకి వెళ్ళావా?"

"లేదు. లావణ్యా నేనూ హోటల్లో భోజనం చేశాం."

"లావణ్య ఎవరూ?"

"మా ఆఫీసులో రిసెప్షనిస్ట్!" తాపీగా చెప్పాడు.

కల్పన ఓ క్షణం భర్త ముఖంలోకి చూసింది.

"బెనహర్ సినిమాకు వెళ్ళాం! ఆ తర్వాత భోజనంచేసి, ఆమెను ఇంటి దగ్గర దిగబెట్టి వచ్చాను." అంటూ

కల్పన ముఖంలోకి చూశాడు. ఆమె ముఖంలో తను ఆశించిన భావాలు కన్పించలేదు.

"నీకు ఏమీ అనిపించడం లేదూ?"

"ఏ విషయంలో!"

"అదే నేను లావణ్యతో సినిమాకు వెళ్ళానని

సశేష నవల



తెలిసి నీకు ఈర్ష్యగా లేదూ!''

"లేదు."

"బాధగా ఉందా?''

"లేదు."

"నీ భర్త పరాయి స్త్రీతో సినిమాకు వెళ్ళాడంటే నీకు ఏమీ అనిపించడం లేదా?''

"ఒకరి మనసు మీద మరొకరికి కావాలంటే అధికారం రాదని నాకు తెలుసు.''

"తనదైన వస్తువును తనదిగానే కాపాడుకోవాలని అనిపించదా?''

"మనసును ఎవరు బంధించగలరు!''

సిద్ధార్థకు చిరాకు వేసింది.

"మనసు....మనసు....నీకు ఈ మనసు పిచ్చి వదిలితేనే గాని బాగుపడవు.''

కల్పన వేదాంతిలా నవ్వింది.

సిద్ధార్థకు వళ్ళుమండిపోయింది.

"ఛీ! నువ్వు అసలు ఆడదానివేనా?'' అంటూ ఈసడించాడు.

"నేను నువ్వు కోరుకునేలాంటి అతి మామూలు ఆడదాన్ని కాదు.''

"అవును చాలా గొప్పదానివి. సిగ్గులేక పోతే సరి! పెళ్ళయాక కూడా పూర్వాశ్రమంలోని ప్రియుణ్ణి తల్చుకుంటూ నిట్టూర్పులు విడవడం ఒక ప్రత్యేకతగా భావిస్తున్నావా?'' విసురుగా అని గోడ వైపుకు తిరిగిపడుకున్నాడు సంభాషణ పెంచడం ఇష్టంలేక.

కల్పనకు నిద్రరావడం లేదు.

భర్త అన్న మాటల్ని గురించి ఆలోచించ సాగింది.

నిజమే! లావణ్యతో సినిమాకు వెళ్ళానని భర్త చెబితే తనకు అతి మామూలు విషయం విన్నట్టు అనిపించింది.

ఏ భర్తా పరాయిస్త్రీతో సినిమాకు వెళ్ళానని భార్య ముందు చెప్పడు.

మరి తన భర్త ఎందుకు చెప్పాడు?

తను ఈర్ష్య పడుతుందో లేదో చూడాలనేగా!

పిచ్చివాడు! తను ఇలాంటివాటికి అతీతంగా ఉందనే విషయాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాడు.

రవీంద్ర తన ప్రేమను ఉన్మాదం అన్నాడు.

తన భర్త తనను పిచ్చి అంటున్నాడు.

రవీంద్ర ఏం చేస్తున్నాడో? ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదట. పాపం! తనను తల్చుకుంటూ జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండిపోతాడేమో? తను ఎలాగయినా ఒకసారి రవీంద్రను కలుసుకోవాలి. పెళ్ళి చేసుకోమని ప్రాథేయపడాలి. అతని దగ్గిర మాట తీసుకోవాలి. తను ఏడిస్తే రవీంద్ర భరించలేడు. తన కన్నీటితో అతన్ని కరిగించి పెళ్ళికి ఒప్పించాలి.

ప్రేమకు-నిజమైన ప్రేమకు స్వార్థం తెలియదు. త్యాగం మాత్రమే తెలుసు. అందుకని తను ఈ త్యాగం కూడా చెయ్యాలి.

ఆ రాత్రి అర్థరాత్రిదాకా నవల రాస్తూ కూర్చుంది కల్పన.

*

తెల్లవారి ఉదయం రమేశ్ వచ్చాడు. రమేశ్ సిద్ధార్థ స్నేహితుడు. ఆ ఇంట్లో చనువుగా తిరుగుతాడు.

"రా రమేశ్! టిఫిన్ చేయ్! దోసెలు నీకు ఇష్టంగా?'' అన్నది కల్పన.

"సిద్ధార్థ లేడా?''

"ఉన్నాడు. స్నానం చేస్తున్నాడు."

"ఇద్దరం కలిసే టిఫిన్ చేస్తాం!''

"ఏమిటి విశేషాలు?''

"రాత్రి మీ ఆయనా నేనూ సినిమాకు వెళ్ళాం వదినా. అక్కడ్నుంచి నాన్‌కింగుకు వెళ్ళి భోజనం చేశాం!''

కల్పన రమేశ్ ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది.

"సినిమా చాలా బాగుంది. నిన్ను కూడా

నింగినుండి నేలకు

వాసిరెడ్డి సీతాదేవి

తీసుకురానందుకు సిద్ధార్థ చాలా ఫీలయ్యాడు. ఏదీ పట్టనివాడిలా కన్పిస్తాడు పైకి. బిజినెస్సే అతని జీవితం అనీ, చాలా మెకానికల్‌గా ఉంటాడనీ అనుకొనేవాణ్ణి. కాని సిద్ధార్థ చాలా భావుకుడు.''

''సిద్ధార్థ భావుకుడా?'' కల్పనకు నవ్వు వచ్చింది.

''మరి నాతో అబద్ధం చెప్పాడే?''

''ఏమని?''

''లావణ్యతో సినిమాకు వెళ్ళానని చెప్పాడు.''

''లావణ్య ఎవరు?''

''వాళ్ళ ఆఫీసులో రిసెప్షనిస్టు''

''ఆవిడ పేరు లావణ్యకాదే? పైగా సిద్ధార్థ తన స్టాఫ్‌తో చస్తే అలా ప్రవర్తించడు. అందర్నీ దూరంగానే ఉంచుతాడు.''

''నాకు అలాగే చెప్పాడు.''

''సిద్ధార్థ అబద్ధాలు చెప్పడు. బహుశా నిన్ను ఉడికించడానికి చెప్పాడేమో!''

అప్పుడే బాత్‌రూంలో నుంచి బయటికి వచ్చాడు సిద్ధార్థ.

''హల్లో! పొద్దున్నే ఊడి పడ్డావ్ ఏమిటి విశేషం?'' నవ్వుతూ అడిగాడు.

''ఇవ్వాళ క్రికెట్ మాచ్‌కి వస్తావేమో అడుగుదామని వచ్చాను.''

''వస్తాను టికెట్లు తెప్పించు.''

''వదినా నువ్వు కూడా వస్తావా?''

''ఆమె రాదులే!'' మధ్యలో అందుకుని సిద్ధార్థ అన్నాడు.

ఓ క్షణం సిద్ధార్థ ముఖంలోకి చూశాడు రమేశ్. ప్రణయ కలహంలో ఉన్నట్టున్నారు. బహుశా అతను నిజంగానే లావణ్య అనే స్త్రీతో సినిమాకు వెళ్ళాడని నమ్మి భర్తమీద అలిగిందేమో!

''అవును గానీ, రాత్రి మనం ఇద్దరం సినిమాకు వెళ్ళాం కదా! ఎవరో లావణ్యతో వెళ్ళానని వదినతో చెప్పావటగా? భార్యల్ని ఇలాంటి మాటల్తో ఉడికించడానికి ప్రయత్నిస్తే ముందు ముందు చాలా అనర్థాలు వస్తాయ్ భాయ్! మనకే నష్టం!'' నవ్వుతూ అన్నాడు రమేశ్.

సిద్ధార్థ ముఖంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు. రమేశ్ ఆ విషయాన్ని గ్రహించాడు.

''సరే వస్తాను! టికెట్లు తెప్పిస్తాను. వదిన కూడా వస్తుందిగా?''

''నేను మాత్రమే వస్తున్నాను.''

''నేనూ వస్తాను.'' అన్నది కల్పన.

''నువ్వు రావడం లేదు.'' ఖచ్చితంగా ఉంది సిద్ధార్థ కంఠం.

భార్యాభర్తల మధ్య ఏదో సంఘర్షణ జరిగి ఉంటుందని ఊహించిన రమేశ్ చిన్నగా జారుకున్నాడు.

''నీకు కొంచెం అయినా బుద్ధి ఉందా?''

''కొంచెం ఏం ఖర్మ! చాలా ఉందనే అనుకుంటున్నాను.''

''ఆహా చాలా గొప్ప తెలివి తేటలు. ఇంట్లో ఎన్నో అనుకుంటాం. నా ఫ్రెండ్స్ ముందు నన్ను ఎక్స్‌పోజ్ చెయ్యడం కూడా నీలోని ప్రత్యేకతే అనుకుంటున్నావా? నువ్వు ఎవడినో ప్రేమించినట్టూ, మనసువాడికీ, శరీరం నాకూ ఇచ్చినట్టు కూడా చెప్పలేకపోయావ్?''

''ఆ అవసరం రాలేదు.''

''ఛీ! సిగ్గు లేకపోతేసరి!'' విసురుగా బయటికి వెళ్ళిపోయాడు సిద్ధార్థ.

తన వైవాహిక జీవితం సుఖవంతంగా లేదు.

అందుకు తను బాధపడడం లేదు. గర్విస్తున్నది. తను రవీంద్రకు ద్రోహం చెయ్యడం లేదు.

తన ప్రేమ అతి పవిత్రమైనది. దాన్ని రవీంద్ర ఉన్మాదం అన్నాడు. పిచ్చి రవీంద్ర.

వివాహం శరీరాలను బంధిస్తుంది.

ప్రేమ మనసులను బంధిస్తుంది.

వివాహం చేసుకున్న స్త్రీ పురుషులు భార్యాభర్తలు అవుతారు. ప్రేయసీ ప్రియులు కాలేరు.

''రవీ నా ప్రేమన్ను శంకించావు. నా మనసు నీదే! జీవితాంతం నీదే!'' పదే పదే మనసులో అనుకుంది.

తను ప్రస్తుతం రాస్తున్న నవలలో తన జీవితమే ప్రతిబింబిస్తుంది. ఏదైనా పత్రికలో సీరియల్‌గా వేయించాలి. అప్పుడు గాని తనకు రచయిత్రిగా గుర్తింపురాదు.

సగం రాసిన నవలను ముందేసుకుని కూర్చుంది,

# 11

ఆ రోజు ఆఫీసు నుంచి త్వరగా వచ్చాడు సిద్ధార్థ. నవల రాయడంలో మునిగి ఉన్న కల్పన—భర్త గదిలోకి రావడాన్ని గమనించలేదు.

పెళ్ళి కార్డు ఉన్న కవర్ని ఆమె మీదకు విసిరి కోటు తీసి హాంగర్‌కు తగిలించాడు.

వెనక్కు తిరిగి వచ్చి కల్పన ఎదురుగా నిల్చున్నాడు.

కల్పన కార్డు చేతిలో పట్టుకుని చైతన్యం లేని బొమ్మలా కూర్చుండిపోయింది.

''అయ్యో పాపం! అలా కొయ్యబారిపోయావేం? నీ మనసును కాదని-అదే, కాలదన్ని పెళ్ళి చేసుకుంటున్నాడనేనా? నీ ప్రియుడు నీ మనసునే తల్చుకుంటూ జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండి పోతాడనుకున్నావు గదూ?''

కల్పన సమాధానం ఇవ్వలేదు.

''ప్రియుడి పెళ్ళికి వెళ్తావా?''

కల్పన ఉలకలేదు పలకలేదు.

''ఇక నుంచి అయినా పిచ్చి పిచ్చి ఆలోచనల్ని వదిలెయ్! జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. నీళ్ళు నేల మీదనే ఉండాలి. ఆకాశంలో ఎగరడానికి ప్రయత్నించి కాళ్ళు విరగ్గొట్టుకోకు. నీకు ఈ ఇంట్లో ఇచ్చిన స్థానాన్ని అర్థం చేసుకో. ఏనాటికైనా నీ భ్రమ తొలగిపోతుందనే ఉద్దేశంతోనే ఇంతకాలం నీ పిచ్చిని భరించాను. కేవలం నీ మీది ప్రేమతోనే. నువ్వు మారతావనే ఆశతోనే. ఇప్పటికైనా కళ్ళు తెరువు. ఇక ఎంతోకాలం నీ మూర్ఖత్వాన్ని భరించలేను. నాలో ద్వేషాన్ని రేకెత్తించకు. జీవితాన్ని అర్థం చేసుకో. ఆకాశపు అంచులు పట్టుకుని వేలాడుతున్నట్టు భ్రమ పడుతున్నావు. నింగినుంచి నేలకు దిగిరా!''

కల్పనకు సిద్ధార్థ మాటలు అర్థం కావడం లేదు. తన ఆలోచనలో తను ఉన్నది.

రవీంద్ర పెళ్ళి చేసుకుంటున్నాడా?

కనీసం తనకు ఒక ఉత్తరం ముక్క అయినా రాయలేదు.

పెళ్ళికార్డు కూడా తనకు పంపించలేదు.

రవీంద్ర ప్రేమలో స్వచ్ఛత లేదు. కాంక్ష ఉన్నది. మోహం ఉన్నది. అందుకే తన శరీరాన్ని కోరుకున్నాడు. అది లభించలేదు. అందుకే తన ప్రేమను ఉన్మాదంగా చిత్రిస్తూ ఉత్తరం రాశాడు.

తన నిజాయితీని అతను అర్థం చేసుకోలేకపోయాడు. తన ప్రేమలోని ఔన్నత్యాన్ని గ్రహించలేకపోయాడు.

అతను హేతువాది అని తనకు తెలియదు.

తన భర్తకూడా హేతువాదే!

ఈ హేతువాదుల్తో వచ్చే చిక్కు ఇది! బొత్తిగా సెంటిమెంట్సు ఉండవు వీళ్ళలో. రవీంద్రలో భావుకత్వం కన్పించేది. కాని అతని ఉత్తరం చదివాక అతను హేతువాది అని తనకు అర్థం అయింది.

రవీంద్ర వివాహం చేసుకుంటున్నాడు.

తనను మర్చిపోయాడా? నో! నో! తనను మర్చిపోలేదు. అతని మనసు తనదే.

రవీంద్ర వివాహం గురించి తను బాధపడుతోందా? లేదు! లేదు! ఎందుకు బాధపడాలి? రవీంద్ర వివాహం చేసుకున్నా తనవాడే! తనవాడే!

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? బాధగా ఉందా?"

"బాధా! ఎందుకూ?" తన మాటలు తన చెవులకే పేలవంగా వినిపించినట్టు అనిపించింది కల్పనకు.

"నీ ప్రియుడు పెళ్ళి చేసుకుంటుంటే నీకు ఏమీ అనిపించడం లేదూ?"

"ఎందుకు అనిపిస్తుంది? పెళ్ళి కేవలం శరీరాలను మాత్రమే బంధిస్తుంది."

"నీకు పిచ్చి ముదిరింది. సైకియాట్రిస్టు దగ్గరకు తీసుకెళ్ళాలి."

కల్పన వేదాంతిలా నవ్వింది.

సిద్ధార్థ బట్టలు మార్చుకొని బయటకు వెళ్ళిపోయాడు.

కల్పన ఆలోచిస్తూ డ్రాయర్ సొరుగులోనుంచి సగం రాసిన నవల తాలుకు కాగితాలను బయటకు తీసింది.

## 12

కల్పనతో సిద్ధార్థ మాట్లాడటం మానేశాడు. అయినా కల్పన పెద్దగా బాధపడటం లేదు.

రవీంద్ర వివాహం జరిగి రెండు నెలలు అయింది. ఆ వివాహానికి సిద్ధార్థ వెళ్ళి వచ్చాడు. కల్పనకు భర్తమీద చాలా కోపం వచ్చింది. ఆ విషయంలో ఇద్దరూ ఘర్షణ పడ్డారు.

కల్పనలో అశాంతి పెరిగింది. రవీంద్ర ఇప్పుడు ఏం చేస్తున్నాడో? భార్యతో సరసాలు ఆడుతున్నాదేమో? ఆమె అందాన్ని పొగుడుతున్నాదేమో! అలా చెయ్యడు! చెయ్యలేడు! రవీంద్ర తననే ప్రేమిస్తున్నాడు. వివాహం కేవలం భౌతిక అవసరాల కోసమే. వంటచేసి వడ్డించడానికి ఒక ఆడది కావాలి. బట్టలు ఉతకాలి. ఇల్లుదిద్దుకోవాలి. ఆఫీసునుంచి అలసిపోయి రాగానే కాఫీగ్లాసు అందించేందుకు ఇంట్లో భార్యకావాలి.

అంతే! అందుకే రవీంద్ర పెళ్ళి చేసుకున్నాడు.

అతను తనకోసం తపిస్తూనే ఉంటాడు.

భార్యను ప్రేమగా చూడలేడు.

పాపం ఆవిడ భర్త ప్రేమను పొందలేక ఎంత బాధపడుతూ ఉన్నదో?

ఒకసారి వెళ్ళి చూస్తే?

తనను చూసి సిగ్గుతో తలవంచుకుంటాడా?

నాన్నను చూడటానికి వెళ్ళినట్టు ఒకసారి వెళ్ళిరావాలి. రవీంద్ర భార్య ఎలా ఉంటుందో చూడాలి. ఆలోచనలతో నిద్రపట్టడం లేదు. కళ్ళు మూసుకొని పడుకుంది. బుర్ర మాత్రం కందిరీగల పుట్టలా ఉంది.

సిద్ధార్థ లేచి మంచంమీద కూర్చున్నాడు.

"కల్పనా" పిలిచాడు.

కల్పన పలకలేదు. గాఢ నిద్రలో ఉన్నట్టు నటించసాగింది. అంత నిద్రలో ఉన్న మనిషి ఎక్కడైనా పిలవగానే పలకుతుందా ఏం?

మళ్ళీ నిశ్శబ్దం!

దూరంగా ఏదో పక్షి పలికింది.

అర్ధరాత్రి అది ఎందుకు కూస్తుంది? జంట కోసమా! వియోగ వ్యథలో దానికీ నిద్రపట్టడం లేదా? నిద్ర నటిస్తూ ఆలోచించసాగింది కల్పన.

మళ్ళీ నిశ్శబ్దం!

తలుపు తెరిచిన అలికిడి అయింది.

---

చండిఘర్‌లో శ్రీమతి సుఖజీత్‌గిల్ అనే లేడీ డాక్టర్ వుంది. ఆమెగారికి ఐదునెలల వయసు గల తన బొచ్చుకుక్కపిల్ల అంటే ఎంతో ప్రేమ. ఇలా వుండగా ఓ రోజు ఆ కుక్కపిల్లని కాస్త ఎవరో ఆమె కార్లోంచి తస్కరించారు.

శ్రీమతి సుఖజీత్ గిల్‌గారు పోలీసు ఫిర్యాదు ఇవ్వడంతో వూరుకున్నారా? అబ్బే లేదు. పిల్లలు తప్పిపోతే పేపర్లో 'కనబడుటలేదు' అని ప్రకటనలు వేయిస్తారు చూశారూ.... ఆ విధంగా ఆమె చండిఘర్‌లోని ఐదు దిన పత్రికలలో 'కుక్కపిల్ల కనబడుటలేదు' అని గుర్తులతో సహా ప్రకటించారు. పైగా కుక్కపిల్ల జాడ కనుక్కొని అప్పగించిన వాళ్ళకి రూ. 200లు బహుమానం యిస్తానని తెలియజేశారు. అంతటితో ఊరుకున్నారా.... అంటే అదీ కాదు. మూడు వేలకరపత్రాలు అచ్చేయించి ఊరంతా పంచి పెట్టించారు. డిప్టీ కమిషనర్ ప్రత్యేక అనుమతితో ఓ సెలవు రోజు ఆటో రిక్షా మాట్లాడుకుని దానికో రెండు స్పీకర్లు పెట్టించి ముఖ్య వీధులన్నిటిలో 'కుక్కపిల్ల' గురించి పదే పదే చెప్పించారు. ఇక మన జ్యోతిష్కులు వుండనే వున్నారుగా.... చండిఘర్‌లోని జ్యోతిష్కులందరినీ కలుసుకున్నారు. మొత్తానికి ఆ విధంగా ఆమెగారు పన్నెండువేల రూపాయలు ఖర్చు పెట్టారట.



చివరికి ఎలాగైతేనేం ఆమె ప్రయత్నాలు ఫలించాయి. ఓ రోజు ఓ కుర్రాడు ఆమెకి ఫోన్ చేసి 'ఫలాన ఇంట్లో మీ కుక్కపిల్ల వుంది' అని చెప్పాడు. ఆవిడ వెళ్ళి తన కుక్కపిల్లని తెచ్చుకుంది. శ్రీమతి సుఖజీత్ గిల్‌గారిని చూడగానే ఆ కుక్కపిల్ల అమాంతంగా ఎగిరి ఆమెని చేరుకుంది.

ఇప్పుడు తన కుక్కపిల్ల కనిపించిన సంతోషంలో ఆమె పత్రికలలో ఆ విషయం ప్రకటించడానికీ, త్వరలోనే ఒక బ్రహ్మాండమైన పార్టీ ఇవ్వడానికీ నిశ్చయించుకున్నదట.




# "లోధ్ర" టానిక్ వనితలకు మాత్రం!

ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికీ నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికీ "లోధ్ర" టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య మయమైన జీవితాన్ని గడపండి.

Sistas

78 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
"లోధ్ర" మందుల షాపులలో దొరుకుతుంది.

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________ PIN ______________

## కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్

27, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు : శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు.

---

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి.




# MERI GOLD COVERING WORKS

ESTD: 1963
TRADE MARK (346088)

**14, RANGANATHAN STREET, T. NAGAR, POST BOX No. 1405, MADRAS-600 017**

కల్పన కళ్ళు తెరిచింది. వాకిలికేసి చూసింది.

సిద్ధార్థ బయటికి వెళ్ళి చిన్నగా తలుపులు దగ్గిరకు వేశాడు.

కల్పన హృదయం క్షణకాలం వేగంగా కొట్టుకుంది. ఈ సమయంలో ఎక్కడికి వెళ్తున్నాడు? బుద్ధుడిలా ఇల్లు వదిలేసి వెళ్ళడం లేదుకదా?

నిజంగా వెళ్ళిపోతే?

నునసు బాగుండక వరండాలో పచార్లు చేస్తున్నా దేమో!

కల్పన లేచింది. తలుపు తెరిచింది. ఉలిక్కిపడింది. క్రీనీడలో రెండు ఆకారాలు కన్పించాయి. గుండెలు భయంతో దడదడలాడాయి.

"ఇప్పుడా?" మగ కంఠం. అది—తన భర్త కంఠం.

"ఏం చెయ్యను. నిన్ను చూడకుండా ఉండ లేను."

భయం పోయింది. కుతూహలంగా వినసాగింది కల్పన.

"నన్నేం చెయ్యమంటావ్?" భర్త కంఠం.

"ఆ ఆడదాన్ని వదిలెయ్!"

"ఎవర్ని?"

"నీ పెళ్ళాన్ని."

"నాకూ వదిలెయ్యాలనే ఉంది. కాని పాపం ఎక్కడికి పోతుంది? ఏం చేస్తుంది?"

"అది నాకు అనవసరం. ఆవిడ కావాలో నేను కావాలో తేల్చుకో!"

"చిన్నగా! కల్పన వింటుందేమో?" పెద్దగానే అన్నాడు.

"భయపడుతున్నావా?"

"లీలా!"

లీల అతని గుండెల మీద వాలిపోయింది. వెక్కి వెక్కి ఏడవసాగింది.

"నీకు అన్యాయం చెయ్యను! బాధపడకు."

"నాకు బతకాలని లేదు. చచ్చిపోవాలని ఉంది."

"వీల్లేదు. నువ్వు బతకాలి. నా కోసం!"

కల్పన వరండాలోని స్విచ్ ఆన్ చేసింది.

సిద్ధార్థ బాహుబంధంలో మరో స్త్రీ.

కల్పనకు ఓ క్షణం తల గిర్రున తిరిగినట్టు అయింది.

ఒక్కసారిగా ఇద్దరూ విడిపోయి దూరంగా నిల్చున్నారు.

సిద్ధార్థ అపరాధిలా తల దించుకున్నాడు.

ఆ స్త్రీ కల్పన సౌందర్యానికి ముగ్ధురాలైనట్టు చూస్తూ నిల్చుంది. చవకరకం నైలెక్స్ చీర. మోకాళ్ళపైకి లంగా. చెవులకు గిల్టు లోలాకులు. చాలా చౌకబారుగా కన్పించింది.

కల్పనకు బాధ కలిగింది. భర్త మరో స్త్రీతో ఉన్నందుకు కాదు. అంత చౌకబారు స్త్రీతో ఉన్నందుకు! అతని అతి చౌకబారు అభిరుచి చూస్తుంటే కల్పనకు మొదటిసారిగా భర్త మీద అసహ్యం కలిగింది.

"లోపలకు రండి! ఎవరైనా చూస్తారు" అన్నది కల్పన.

సిద్ధార్థ చివ్వున తలెత్తి భార్య ముఖంలోకి చూశాడు.

ఆ స్త్రీ నోట మాటరానిదానిలా నిల్చబడిపోయింది.

"ఏమిటి చూస్తారు? లోపలకు రండి. బయట చలిగా ఉంది."

సిద్ధార్థ అలాగే నిలబడ్డాడు.

"నువ్వురా! ఆయనా వస్తారు."

ఆ స్త్రీ లోపలకు వెళ్ళింది — పసివాడు పంతులు ఆజ్ఞను పాటించినట్టు.

"కూర్చో!"

కూర్చుంది.

"నీ పేరు? ఆఁ లీలకదూ?"

"మీకెలా తెలుసు?"

"ఆయన ఇప్పుడేగా నిన్ను పేరు పెట్టి పిల్చారు?"

ఆ స్త్రీ తల వంచుకుంది.

సిద్ధార్థ వాళ్ళ ముందునుంచి లోపలకు వెళ్ళాడు.

"మీకు కోపంగా లేదా!"

"ఎవరి మీద?"

"నా మీద!"

"కోపం ఎందుకూ?"

"మీ భర్తతో........" ఆ పైని మాటలు దొరక్క ఆగిపోయింది లీల.

కల్పన అదోలా వేదాంతిలా, వీటన్నింటికీ అతీతమైన వ్యక్తిలా నవ్వింది.

"మీ భర్త పరాయి స్త్రీతో ఉండడాన్ని ఎలా సహిస్తున్నారు?"

"నువ్వు నాకు పరాయి స్త్రీవి. ఆయనకు కాదుగా?"

"అంటే?"

"మేమిద్దరం భార్యా భర్తలం. సంఘం ఏర్పరచిన కట్టుబాట్లకు బద్ధులం. కాని మీ ఇద్దరూ ప్రేయసీ ప్రియులు. మా సంబంధంకంటే మీ సంబంధమే నిజమైంది; గొప్పది."

లీల కల్పన కేసి ఈమెకు పిచ్చిగాని లేదు కదా? అన్నట్టు చూసింది.

"నీ ప్రేమను నేను అర్థం చేసుకోగలను. ఇంత అర్ధరాత్రి, ఇంత చీకట్లో, నువ్వు ఆయన కోసం వచ్చావంటే...."

"ఇక చాలు ఆపు!" సిద్ధార్థ గర్జించాడు.

కల్పన తలెత్తి భర్త ముఖంలోకి చూసింది. అతని ముఖంలో అపరాధ భావంలేదు. కోపం కన్పిస్తున్నది. చేతిలో నోట్లకట్ట ఉంది.

నోట్లకట్టను లీల వళ్ళోకి విసిరేశాడు.

"ఇక నువ్వు వెళ్ళు!"

లీల లేచి నిల్చుంది.

"థ్యాంక్యూ! ఇక వెళ్ళు!" అన్నాడు సిద్ధార్థ.

కల్పన అయోమయంగా ఇద్దర్నీ చూస్తూ నిల్చుంది.

లీల నోట్లకట్ట తీసుకుని బయటికి వెళ్ళిపోయింది.

"ఎవరామె?"

"నీలాటి ఒక వేశ్య!"

కల్పన త్రుళ్ళిపడింది. ముఖం ఎర్రబారింది.

"నన్ను అవమానిస్తున్నావ్?"

"నిజం చెప్పడం అవమానించడం కాదు."

"నేను వేశ్యను ఎలా అయ్యాను?"

"వేశ్య ఏం చేస్తుంది?"

"డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకుంటుంది."

"నువ్వు చేస్తున్నదేమిటి?"

కల్పన భర్త ముఖంలోకి అయోమయంగా చూసింది.

"వేశ్య పొట్టకోసం శరీరాన్ని అమ్ముకుంటుంది. ఆమెకు అది జీవనాధారం. ఆమెకు ఉన్న పెట్టుబడి ఆమె శరీరమే! కాని నీలాంటివాళ్ళు? నిన్నే ఉదాహరణగా చెబుతాను. ఎవర్నో ఎందుకు? నీకు సమాజంలో రక్షణ కావాలి. అందుకు నిన్ను పోషించడానికి ఒక మగవాడు కావాలి. ఆ మగ

వాడికి శరీరాన్ని ఇస్తావు. మనసులో మరొకడ్ని నిలుపుకుని....''

''ఆపండి!''

''ఏం బాధగా ఉందా? ఏ భార్యా భర్తతో మరో ఆడదానికి సంబంధం ఉండటాన్ని సహించదు. వేశ్యకు ఆ బాధలేదు. నువ్వేం చేశావు? పరాయి స్త్రీని భర్త కోసం లోపలకు ఆహ్వానించావ్! ఎలా చెయ్యగలిగావు ఆ పని? నువ్వూ వేశ్యలాంటి దానివే కనక.''

కల్పనకు ఓ ఆలోచన తట్టింది.

భర్త తర్కంలో నిజం లేకపోలేదనిపించింది.

ఈ సన్నివేశాన్ని కూడా తను రాస్తున్న నవలలో పెట్టాలనుకుంది.

''ఏం మాట్లాడవేం?''

''మీరు ఎలా అనుకున్నా నాకు బాధలేదు.''

''నీకు త్వరలోనే పిచ్చి పడుతుంది.''

''కవులూ, కళాకారులూ సగం పిచ్చివాళ్ళే!''

''ఛీ! నువ్వు అసలు ఆడదానివి కాదు.''

''ఆ మాట ఎన్నిసార్లు అంటావ్? అయితే ఇదంతా నువ్వు ఆడిన నాటకమేనన్నమాట. నాలో ఈర్ష్య కలిగించడానికి ఆ వేశ్యను ఇంటికి తీసుకొచ్చావు గదూ? ఈర్ష్యా ద్వేషాలు మనసుకు సంబంధించినవి. శరీరానికి కాదు. నా మనసు ఏనాడో....''

కల్పన చెంప ఛెళ్ళుమన్నది. కళ్ళ ముందు రంగులు కన్పించాయి. కళ్ళలో నీరు తిరిగింది.

సిద్ధార్థ తన గదిలోకి వెళ్ళి దఢాలున తలుపులు వేసుకున్నాడు.

కల్పన మూసి ఉన్న తలుపుల కేసి చూసింది.

తడుముకుంది. సిద్ధార్థ కొట్టిన చెంపను.

పాపం పిచ్చివాడు. తనను అమితంగా ప్రేమిస్తున్నాడు. అందుకే కొట్టాడు. ట్రయాంగిల్ లవ్. తను రవీంద్రను ప్రేమిస్తున్నది. తన భర్త తనను ప్రేమిస్తున్నాడు.

మరి రవీంద్ర? భార్యను ప్రేమిస్తున్నాడా?

నో! నో! అలా ఎన్నటికీ కాదు.

జీవితానికి థ్రిల్ ఉండాలి. వైవిధ్యం ఉండాలి. సంఘర్షణ ఉండాలి. ఏదీ లేకుండా సాదాగా మామూలు బతుకులు చాలామంది బతుకుతారు. అసలు అవి బతుకులేకావు. ఆ సాదా బతుకుల్లో ప్రపంచానికి చెప్పడానికి ఏం ఉంటుంది? నవలలు జనం ఎందుకు అంత ఆవురావురుమంటూ చదువుతారు? ఆ నవలల్లో సాదా మనుషులు ఉండరు. వాళ్ళ కోరికలు అతి సాదాగా నేలబారుగా ఉండవు.

పడకకుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నది. అర్థరాత్రి ఆలోచనల్లో నుంచి కల్పన నిద్రలోకి జారిపోయింది.

తెల్లవారి చూస్తే తన మీద శాలువా కప్పి ఉంది. తన భర్తే కప్పాడు. రాత్రి కొట్టాడు.

అచ్చం నవలల్లోలాగ, సినిమాల్లోలాగ నిద్రలో వున్న తను చలితో ముడుచుకు పోవడం చూడలేకపోయాడు. శాలువా కప్పాడు. ఎంతో థ్రిల్లింగ్‌గా ఫీలయింది కల్పన.

తను రాస్తున్న నవలకు బోలెడంత మేటర్! అనుకుంది కల్పన.

# 13

భార్యను చెంపదెబ్బకొట్టి సిద్ధార్థ బాధ పడ్డాడు. ఆ తర్వాత కొంతకాలం అతనిలో మార్పు కనిపించింది.

కల్పనను మాటలతో బాధ పెట్టడం మానేశాడు.

కోపం వచ్చే సన్నివేశాల్లో కూడా తన కోపాన్ని దిగమింగి పైకి నవ్వేసేవాడు. సినిమాలకూ, పార్టీలకూ ఎక్కువగా తీసుకెళ్ళేవాడు.

కల్పన రాసిన రెండు కవిత్వాలు పత్రికల్లో అచ్చు అయినయ్! అవి నచ్చకపోయినా ఆమె సంతృప్తి కోసం అద్భుతంగా పొగిడాడు. ఆమె సంతోషాన్ని చూసి నిట్టూర్పు విడిచాడు.

ఆ కవితలు చదివి అభిప్రాయం రాయమని రవీంద్రకు ఉత్తరం రాసింది. రవీంద్ర సమాధానం రాయలేదు. రవీంద్ర భార్యతో సుఖంగా ఉన్నాడనే భావం వచ్చినప్పుడల్లా ఆమె మనసును ఎవరో మొండి కత్తితో కోస్తున్నట్టు బాధపడేది.

ఆమెకు రవీంద్ర భార్య ఎలా ఉందో చూడాలనే కోర్కె కలిగింది. రవీంద్ర ఆమెను నిజంగా, మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడో లేదో చూసి అర్థం చేసుకోవాలనే అభిలాష కలిగింది. తన కోర్కెను సిద్ధార్థకు చెప్పే ధైర్యం లేదు. సిద్ధార్థకు తెలియకుండా చాటుగా వెళ్ళడం ఆమెకు ఇష్టం లేదు.

కల్పన లేడీ డాక్టర్ దగ్గిరకు వెళ్ళింది. ఆమె అనుమానం నిజం అయింది. ఆకాశంలో స్వేచ్ఛగా ఎగురుతున్న పక్షి బలమైన గాయం తగిలి నేలమీద పడిపోయినట్టు అయింది.

చంద్రుడిలోని కళంకంలా తన పవిత్ర ప్రేమకు కూడా కళంకం ఏర్పడింది.

కల్పన మనసు గ్లానితో నిండిపోయింది.

తన మీద తనకే అసహ్యం వేసింది.

తను మోసపోయింది!

గాయపడిన పక్షిలా తన ప్రేమ బురదలోపడి గిలగిల లాడుతోంది. తన మనసుకు కూడా బురద అంటింది. రవీంద్ర అన్నట్టు శరీరంతోపాటు మనసు కూడా నేలబారుకు దిగజారిపోయింది. మనసూ, శరీరం, శరీరం, మనసూ — రెండూ భౌతికమైనవే!

తను భర్తకు శరీరాన్ని మాత్రమే సమర్పించింది.

కాని తనలో పెరుగుతున్న తన భర్త ప్రతిరూపం కేవలం శరీరం మాత్రమేకాదు.

ఏమిటిది? తను ఇంత కాలం నిజంగా భావించింది భ్రమ మాత్రమేనా? జీవితం తను ఊహించే కథ కాదా! తను చదివే కథలకూ జీవితానికీ ఎక్కడా లంగరు కుదరదా? ఇంత కాలం తను జీవించింది కలల్లో నేనా? ప్రేమా, హృదయం, స్పందన, ఆర్తి, ఇవన్నీ అర్థంలేని మాటలేనా? వాటి అర్థాలు శబ్దకోశాల వరకే పరిమితమా? రవీంద్ర అన్నట్టు హృదయం అనేది ఒక మాంసం ముద్దేనా? రక్తాన్ని శుద్ధిపరిచే యంత్రం మాత్రమేనా?

కాదు....అలా ఎన్నటికీ కాదు.

తను పిల్లల్ని కంటూ వాళ్ళను పెంచుతూ జీవితం గడపాల్సిందేనా? రవీంద్ర ఏమనుకుంటాడు?

''నువ్వూ మామూలు ఆడదానివే. పిల్లల్ని కంటూ భర్తతో కాపరం చేస్తూ ఇంకానన్ను ప్రేమిస్తున్నానంటున్నావా? ఏమైంది నీ నిర్మల పవిత్ర ప్రేమ?'' అని రవీంద్ర ఎదురుగా నిల్చుని ప్రశ్నిస్తున్నట్టు అనిపించింది.

''డాక్టర్! ఇప్పుడప్పుడే నాకు పిల్లల్ని కనాలని లేదు. ఏదైనా మందు ఇవ్వండి.''

డాక్టర్ ఓ క్షణం కల్పన ముఖంలోకి చూసింది.

''మిసెస్ సిద్ధార్థ! మీకు మూడు నెలలు నిండబోతున్నాయ్. మందుల వల్ల లాభం లేదు.''

''ఏదైనా ఉపాయం ఆలోచించండి, ఆపరేషన్ చెయ్యండి.''

ఓ క్షణం ఆలోచించి "మీవార్ని తీసుకురండి. ఆయన పర్మిషన్ కావాలి." అన్నది డాక్టర్.

తన భర్త పర్మిషన్ కావాలా? తన శరీరం మీద అధికారం తనకు లేదా? తను పిల్లల్ని కనడం కనకపోవడం కూడా భర్త ఇష్టా ఇష్టాలమీద ఆధారపడి ఉంటుందా? స్త్రీకి ఇంత బానిసత్వమా?

"ఆయన ఒప్పుకోకపోతే!"

"సారీ! నేనేమీ చెయ్యలేను." అంటూ మరో కేసు చూడటానికి లోపలకు వెళ్ళింది డాక్టర్ సుజాత.

ఆ రాత్రి భర్తకు విషయం చెప్పింది.

సిద్ధార్థ కళ్ళు వెలిగిపోయాయి.

భార్యను అమాంతం గుండెలకు హత్తుకున్నాడు. కల్పనకు కంపరంగా ఉన్నది.

"ఓ నా శరీరానికి స్వామీ! నీకు దూరంనుంచే నా నమస్కారం!" అనాలనుకుంది.

కాని సిద్ధార్థ సంతోషం చూస్తుంటే ఏమీ అనలేక పోయింది.

"రేపు లేడీ డాక్టర్ దగ్గిరకు వెళ్దాం".

"నేను వెళ్ళివచ్చాను."

"మందులు ఏమైనా రాసి ఇచ్చిందా? కొంత కాలం రాతలూ కోతలూ తగ్గించి ఉల్లాసంగా ఉండు."

కల్పనకు వళ్ళుమండిపోయింది.

ఎంతశ్రద్ధ?

తనమీద లేని ప్రేమ పుట్టబోయే బిడ్డమీద.... తను తండ్రికావాలని ఎంత ఉబలాటం? తనను వేశ్య అన్నాడుగా? వేశ్య బిడ్డల్ని కంటుందా? ఒకవేళ కన్నా ఈ పెద్దమనుషులు తమ బిడ్డగా స్వీకరిస్తారా?

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"లేడీ డాక్టర్ నిన్ను తీసుకురమ్మన్నది."

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నీ పర్మిషన్ కావాలట!"

సిద్ధార్థ భార్య ముఖంలోకి అయోమయంగా చూశాడు.

"అర్థం కాలేదా?"

"ఏమిటి నువ్వనేది?"

"నాకు పిల్లలు అక్కర్లేదు."

సిద్ధార్థ భార్యను చూశాడు. అతని కళ్ళకు మొదటిసారిగా ఆమె వికృతంగా, అసహ్యంగా కన్పించింది.

"స్త్రీత్వాన్నే సిగ్గుపరుస్తున్నావు. నువ్వు ఆడదానివి కావు."

"ఈ మాట చాలాసార్లు అన్నావు."

"ఆడదానికి మాతృత్వం సంపూర్ణత్వాన్ని ఇస్తుంది."

"అది మగవాళ్లు సృష్టించిన పదం."

"నాకు పిల్లలు కావాలి."

"నాకు అక్కర్లేదు. నన్ను వేశ్య అన్నావుగా వేశ్య పిల్లల్ని నీ పిల్లలుగా ఎలా భావించగలవు?"

"అలాగైనా నీకు భార్య స్థానం లభిస్తుందని."

"నాకు అక్కర్లేదు."

"ఏమిటి?"

"పిల్లల్ని కనడమే భార్య కర్తవ్యం అయితే ఆ స్థానం నాకు అక్కర్లేదు. నువ్వు ఏ పేరుతో పిల్చినా నాకు అభ్యంతరం లేదు."

సిద్ధార్థకు లాగి కొట్టాలనిపించింది. తమాయించుకున్నాడు.

"కల్పనా! నేను ఇప్పటికే చాలా భరించాను. నీ పిచ్చి శృతిమించి పోతున్నది. ఇక భరించడం నా వల్ల కాదు."

"అయితే వదిలెయ్!"

"అది ఎంతోసేపు పట్టదు. నాకు మళ్ళీ చేసుకోవాలంటే నీకంటే అందగత్తె, బుద్ధిమంతురాలు దొరుకుతుంది."

"నాకే దొరకదు అంటావు?"

"నాకంటే మంచివాడు దొరకడు. అంతవరకు చెప్పగలను."

"అందుకే నీకు అహంకారం ఎక్కువని మిసెస్ రాజు అన్నది."

"ఆవిడ పేరు నా ముందు ఎత్తకు. పెళ్లి అయిన బిడ్డలు ఉన్నారు. ఇప్పటికే టీన్ ఏజ్ పిల్లలా వేషం వేసుకొని, అడ్డమైన వాడితో తిరుగుతూ, తను అల్ట్రా మోడ్రన్ అనుకుంటుంది."

"ఆడవాళ్ళంటే నీకు గౌరవం లేదు."



పి. కుసుమ

వ్యాయామక్రీడలలో ప్రావీణ్యం సంపాయించి ఆంధ్రరాష్ట్రంలోనే కాక జాతీయ స్థాయిలో అనేక ఛాంపియన్‌షిప్‌లు పొందిన వనిత కుమారి పడమటి కుసుమ.

**1968-69** లో లోహైద్రాబాదు జరిగిన అథ్లెటిక్ పోటీలలో ఆమె రాష్ట్ర ఛాంపియన్‌గా గుర్తింపు పొందింది. అప్పటికి కుసుమ మెట్రిక్యులేషన్ విద్యార్థిని!

హైద్రాబాద్‌లో **1973** లో జరిగిన ఇండో-జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ క్రీడల పోటీలలో ఛాంపియన్‌షిప్ పొందిన ఘనత కుమారి కుసుమకి దక్కింది. అదే సంవత్సరం కలకత్తాలో జరిగిన అఖిలభారతస్థాయి కబాడీ పోటీలలో పాల్గొని తమ జట్టు విజయానికి తోడ్పడింది.

**1974** లో బెంగళూరులో జరిగిన హేండ్ బాల్ పోటీలలో బంగారు పతకాన్ని పొందిన కుసుమ ఆ మరుసటి సంవత్సరం జాతీయ వ్యాయామక్రీడలలో ప్రదర్శించిన అత్యద్భుత ప్రతిభకుగాను మూడు నక్షత్రాలను పొందింది.

బెంగళూరులోగల జాతీయ క్రీడా సంస్థలో అథ్లెటిక్స్‌లో శిక్షణ పొందిన ప్రథమ వనిత కుమారి కుసుమ కావడం ఒక విశేషం!

తమ నేర్చిన విద్యని పదుగురికీ నేర్పాలనే వుద్దేశ్యంతో ఈ మధ్యనే కుసుమ 'మాస్టర్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ కోర్స్' పూర్తి చేసింది.

—రావినూతల రాజ్యలక్ష్మి

"అవును అలాంటి ఆడవాళ్ళంటే లేదు."

"పెళ్ళాం అంటే మీ దృష్టిలో చెప్పు కింద పురుగులా పడి ఉండాలని."

"నేనే అలా అనుకొని ఉంటే ఇంతవరకూ నిన్ను ఈ ఇంట్లో ఉండనిచ్చేవాణ్ణే కాదు. పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకుండా పడి ఉండు. ఇంత వరకూ నా ప్రేమనే చూశావ్. ఇక భర్తగా నా అధికారాన్ని చూస్తావ్."

సిద్ధార్థ ముఖం చూస్తుంటే కల్పనకు భయం వేసింది.

విసురుగా లోపలకు వెళ్లి మంచం మీద పడి వెక్కి వెక్కి ఏడవసాగింది.

సిద్ధార్థ లోపలకు వచ్చి "ఏడిస్తే తలుపులు వేసుకొని ఏడువు. ఈ ఇంటి నౌకర్లకు మన విషయాలన్నీ తెలియడాన్ని నేను భరించలేను" అన్నాడు.

*

సిద్ధార్థ భార్యతో మాట్లాడటం మానేశాడు. వారం రోజులు గడిచిపోయాయి.

సిద్ధార్థ పని మీద బొంబాయి వెళ్లి మూడో రోజుకు తిరిగి వచ్చాడు.

కల్పన పడుకొని ఉంది. అలసటగా ఉంది. కళ్లు మూసుకొని పడుకొని ఉన్న కల్పన ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

అతనికి ఏదో ఆలోచన వచ్చింది.

వెన్నెముకలోనుంచి ఏదో జరజరా పాకినట్టు అయింది.

బయటికి వచ్చి వంటమనిషి సుబ్బమ్మను కేక వేశాడు.

"ఏం బాబూ?"

"అమ్మగారు ఎందుకు పడుకున్నారు? ఆరోగ్యం బాగా లేదా?"

"ఏమైందో తెలియదు బాబూ, రాజమ్మగారు వచ్చారు."

"రాజమ్మా!"

"అదే బాబూ అమ్మగారి కోసం అప్పు డప్పుడు వస్తుంటారు. పెదవులకు రంగు వేసుకుంటారు. క్రాపింగు...."

"మిసెస్ రాజా!"

"ఆఁ అవిడే బాబూ!"

"ఆఁ అయితే?"

"ఇద్దరూ కలిసి మొన్న బయటికి వెళ్ళారు బాబూ! ఆ తర్వాత రాజమ్మగారు వచ్చి, అమ్మగారికి బాగా లేదనీ, ఆసుపత్రిలో ఉన్నారనీ చెప్పి బట్టలు తీసుకెళ్ళారు. అమ్మగారు ఇవ్వాళే ఇంటికి వచ్చారు. బాగా ఇదయిపోయినారు. రాజమ్మగారే తీసుకొచ్చినారు."

సిద్ధార్థ విసురుగా లోపలకు వెళ్ళాడు.

నిద్రపోతున్న కల్పన రెక్కలు పట్టుకొని ఊపాడు.

కల్పన తృళ్లిపడి లేచి కూర్చుంది.

సిద్ధార్థ కళ్ళు కణకణలాడుతున్నాయి.

కల్పన అతని ముఖంలోకి చూడలేకపోయింది.

"ఛీ! హంతకీ! నీ ముఖం చూడాలంటే అసహ్యం వేస్తూంది."

"నేను చూడమని అడగలేదే? నేను ఎవర్నీ హత్య చెయ్యలేదు."

"నువ్వు చేసిన పనేమిటి?"

కల్పన మాట్లాడలేదు.

"నేను నీతోసహా ఆ డాక్టర్నీ, నీ స్నేహితురాల్ని కూడా జైలుకు పంపించగలను."

కల్పన బెదురు చూపులు చూసింది.

సిద్ధార్థకు పట్టుదల వస్తే ఏమైనా చెయ్యగలడని కల్పనకు తెలుసు.

"నన్ను జైలుకు పంపించండి. మధ్యలో వాళ్లెందుకూ?"

"ఆ పని చెయ్యలేను. ఇంకా ప్రపంచం దృష్టిలో నా భార్యవే. నా పరువు బజార్లో పెట్టుకోలేను. అందుకే ఏమీ చెయ్యలేకపోతున్నాను."

కల్పన మాట్లాడలేదు.

"ఇక మనిద్దరం కలిసి బ్రతకడం అసంభవం!"

కల్పన తల దించుకుంది.

"రేపే లాయర్‌తో మాట్లాడతాను."

కల్పన హృదయం వేగంగా కొట్టుకోసాగింది.

"నిన్ను చూస్తుంటే నాకు ఒక కొండచిలువను చూస్తున్నట్టుగా ఉంది. ఇక భరించడం నావల్ల కాదు."

కల్పన మాట్లాడలేదు.

"ఛీ! నీ ముందు నిల్చోవాలంటేనే చీదరగా ఉంది," అంటూ బయటికి వెళ్ళిపోయాడు సిద్ధార్థ. అర్ధరాత్రికి బాగా త్రాగిన మత్తులో వచ్చాడు.

వారం రోజులు గడిచాయి. నెల రోజులు గడిచాయి. సిద్ధార్థ భార్యకేసి కన్నెత్తి కూడా చూడటం లేదు.

కల్పన మధన పడసాగింది.

ఇలా ఎన్నాళ్ళు?

తను చేసింది తప్పేనా? తప్పో కాదో, కాని అతన్ని లోతుగా గాయపరచింది.

ఈసారికి క్షమించమని అడిగితే?

కల్పన మనసులో మొదటిసారిగా బలహీనత చోటు చేసుకుంది.

నో! నో! తను క్షమాపణ కోరదు. తను అలా చేస్తే భర్త ముందు చులకనైపోతుంది!

నిజంగా విడాకులు యిచ్చే ప్రయత్నంలో వున్నాడా?

అదే మంచిదేమో?

తను మామూలు స్త్రీలా భయపడకూడదు. స్త్రీ అంటే ఇంటికి దాసీ, భర్తకు కాలి చెప్పుకాదని తను నిరూపించాలి. రచయిత్రి అయిన తనే భయపడితే, మామూలు ఆడవాళ్ళకు ముక్తి ఎప్పటికి లభిస్తుంది ఈ దేశంలో?

కల్పన నవల పూర్తి చేసింది. ఒక పబ్లిషర్ పుస్తకంగా వేశాడు. పత్రికలో సీరియలైజ్ చెయ్యాలనుకుంది. కాని ఒక పత్రిక నుంచి తిరిగి వచ్చాక పబ్లిషర్‌కు ఇచ్చింది.

కల్పన మరో నవల ప్రారంభించింది.

పుస్తకం రాగానే రవీంద్రకు కాపీ పంపించింది. అభిప్రాయం రాయమని కోరింది. జవాబు ఇవ్వలేదు.

# 14

ఆ రోజు ఆఫీసు నుంచి వస్తూనే సిద్ధార్థ మంచం మీద పడుకున్నాడు. అతను అలా పడుకోవడం కల్పన ఎప్పుడూ చూడలేదు.

మనసు ఉండబట్టలేదు.

"ఆరోగ్యం బాగా లేదా? జ్వరం వచ్చిందా?" నుదురు మీద చెయ్యి వేసి చూడబోయింది.

"నన్ను ముట్టుకోకు!" గట్టిగా అరిచాడు సిద్ధార్థ.

"నేను అంత అపవిత్రురాల్నా!"

"నువ్వంటే నాకు అసహ్యం! నా ప్రేమను అర్థం చేసుకోలేకపోయావ్. నా అసహ్యాన్నయినా

తెలుసుకుంటా ననుకుంటాను.'' సిద్ధార్థ చివ్వున లేచాడు.

ఫోన్ దగ్గిరకు వెళ్తుంటే కల్పన గుండెలు దడదడ లాడాయి.

లాయర్‌కు ఫోన్ చేస్తాడేమో ?

అతని కోపం తగ్గేలా లేదు. అతను ఒక మెట్టు దిగితే తను రెండుమెట్లు ఎక్కడానికి సిద్ధంగా ఉంది.

"హల్లో! డాక్టర్ చంద్రంగారేనా ?''

"యస్ !''

"నేను సిద్ధార్థను. నాకు చాలా తలనొప్పిగా ఉంది. బాగా టెంపరేచర్ కూడా ఉన్నట్లుంది.''

"టెంపరేచర్ చూశారా ?''

"లేదు. మీరు ఒకసారి రండి.'' ఫోన్ పెట్టేశాడు.

కల్పన చూస్తూ కూర్చోలేకపోయింది.

థర్మామీటర్ తెచ్చింది. సిద్ధార్థ తీసుకోలేదు. పక్కకు తిరిగి పడుకున్నాడు.

"జ్వరం చూడు !''

"అక్కర్లేదు.''

"నేను మీకు అనారోగ్యంలో కూడా .... సేవ చెయ్యకూడదా ?''

"మాట్లాడవద్దు. నీ కంఠం వినలేను.''

"హల్లో మిసెస్ సిద్ధార్థ !'' డాక్టర్ చంద్రం లోపలకు వచ్చాడు.

"హలో !''

"టెంపరేచర్ చూశారా ?'' కల్పన చేతిలోని థర్మామీటర్ చూస్తూ అడిగాడు.

"చూడలేదు. అక్కర్లేదంటున్నారు.''

చంద్రం ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.

థర్మామీటర్ అందుకుని సిద్ధార్థకు ఇచ్చాడు.

"నూటమూడు ఉంది. ఫ్లూ అయి వుంటుంది.'' అన్నాడు డాక్టర్.

"చూడమ్మా ! ఈ మందులు తెప్పించండి. ఈ జ్వరం అయిదురోజులు ఉంటుంది. రేపు నేను మళ్ళీ వచ్చి చూస్తాను. మూడు గంటలకు ఒక సారి ఈ మందు ఇవ్వాలి. ఈ మిక్చెర్ రెండు గంటలకు ఒకసారి.'' అంటూ డైరెక్షన్స్ ఇచ్చి డాక్టర్ వెళ్ళిపోయాడు.

"నువ్వు పడుకో !'' కల్పన భర్తతో అన్నది.

సిద్ధార్థ గ్లానితో ముఖం తిప్పుకున్నాడు.



మార్టినీ టైలార్డ్-బాలే నృత్యంలో ఉపాధ్యాయిని. జార్జెస్ బాబెట్ అనే అతను ఫుట్—బాల్ ఆట నేర్పుతాడు. ఫ్రాన్స్‌లోని మార్సెల్స్‌లో వుంటున్న వీరిద్దరూ ఓ రోజు హఠాత్తుగా వివాహం చేసుకునేందుకు నిశ్చయించుకున్నారు. పెళ్ళి చేసుకున్నాక ఒక ఒప్పందానికి వచ్చారు. ఆ ఒప్పందం ప్రకారం ఇద్దరూ తమ తమ తరగతులను పక్కపక్కనే నడిపించాలనుకున్నారు.

"అమ్మాయిలు వస్తున్నారు కదా అని అబ్బాయిలు ఫుట్‌బాల్ నేర్చుకునేందుకు అధిక సంఖ్యలో వస్తారు. అబ్బాయిలు చూస్తున్నారుకదా అని అమ్మాయిలు చురుకుగా నాట్యం నేర్చుకుంటారు. అబ్బాయిలూ వాళ్ళ మెప్పు పొందడానికి బాగా ఆడతారు. దాంతో మన పేరు ప్రఖ్యాతులు యినుమడించిపోతాయ్'' అనుకున్నారు యిద్దరూ.

వాళ్ళనుకున్నట్లే చాలామంది అబ్బాయిలు, అమ్మాయిలు వచ్చి చేరారుగాని తీరా ఫుట్‌బాల్ పోటీల సమయం వచ్చేసరికి ఈ అబ్బాయి—అమ్మాయిల పరిచయం ముదిరి ప్రేమ పాకానపడింది. ఇక ఆట ఆడే నాధుడెవరు ? నాట్యం ఓపిగ్గా నేర్చుకునే అమ్మాయిలెవరు ?

అలా — పాపం కథ అడ్డం తిరిగేసరికి మతిబోయినంత పనైంది మార్టీనీ, జార్జస్ దంపతులకు.

నౌకరు మందులు తెచ్చి ఇచ్చాడు.

కల్పన మంచినీళ్ల గ్లాసూ మందులూ తీసుకుని సిద్ధార్థ మంచం దగ్గిరకు వచ్చింది.

ఒంటి మీద చెయ్యి వేసింది.

"నన్ను ముట్టుకోవద్దని చెప్పాను !'' దాదాపు అరిచినట్టే అన్నాడు.

"మీకు ఒంట్లో బాగాలేదు. నేను మీ భార్యను. ఆ మాత్రం సేవ చెయ్యతగనా ?''

"భార్య! హ! హ్హా!'' గొల్లున నవ్వాడు సిద్ధార్థ.

"భార్య ఉంటే నాకీ బాధ ఎందుకు ? నువ్వు నా భార్యవు కావు.''

"మనం విడిపోలేదు ఇంకా''

"అనవసరంగా మాట్లాడకు. వెళ్ళు నా ముందు నుంచి.'' దాదాపు అరిచాడు.

ఐదో రోజు జ్వరం నార్మల్‌కు వచ్చింది. అంత వరకూ తనకు కావలసిన పనులన్నీ నౌకర్ల చేతే చేయించుకున్నాడు.

కల్పనలో ఆమెకు తెలియకుండానే మార్పు వస్తున్నది.

కల్పన జావకాచి తీసుకెళ్ళి ఇచ్చింది.

సిద్ధార్థ ఆ గ్లాసు తీసుకుని కిటికీలోనుంచి బయటికి పారబోశాడు.

కల్పన స్థాణువులా నిలబడి పోయింది.

"నీ చేత్తో ఏది ఇచ్చినా నేను తాగను. తినను. అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు !''

కల్పనలో మథన ప్రారంభం అయింది.

సిద్ధార్థ పూర్తిగా భార్యాభర్తల సంబంధాన్ని తెంచి పారేశాడు. తనను ముట్టుకోవడానికి కూడా ఇష్టపడటం లేదు. జబ్బు చేసినప్పుడు సేవ చెయ్యడం భార్య కర్తవ్యం. కాని తను భార్య కాదని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది ఎంతదూరం పోతుందో ?

తప్పు తనదేనా ? సిద్ధార్థ తనను ఈ రెండు సంవత్సరాల కాలంలో ఇంతగా ఏనాడూ అసహ్యించుకోలేదు. రవీంద్ర ఉత్తరం చదివి కూడా ఒక్కమాట అనలేదు. కాని .... కాని తను తల్లి కాలేకపోయినందుకు.... తన ప్రతి రూపాన్ని, తనను హంతకిలా చూస్తున్నాడు. ఇలా ఎంతకాలం ?

ఈ మధ్య కల్పనకు రవీంద్ర గురించి ఆలోచించే ఓపిక ఉండడం లేదు.

సిద్ధార్థ ఆఫీసుకు బయలుదేరాడు.

# సింగర్* సూదులు...

## ఆమె వాటినే కావాలంటుంది!



## ఎంచేతంటే

- సింగర్ సూదులు కుట్లు పడకుండా వుండడాన్ని, దారం మిగిలి పోవడాన్ని, తెగి పోవడాన్ని, ఆపుతాయి— ఏంచేతంటే దాని రంధ్రం అద్భుతంగా పాలిష్ చేయబడినది, సునిశితమైనది గుండ్రంగా వుంటుంది.
- సింగర్ సూదులు వాటి 'అత్యుత్తమైన మైక్రో-ఫినిష్' చేయబడిన మొన వలన సున్నితమైన వస్త్రాలను కూడా కుట్టగలవు...50 మిలియన్ల కుట్లకు పైగా కుట్టగలవు.
- అతి విశిష్టమైన పనితనం, మేలైన ప్లేటింగ్, ఫినిష్‌ల వలన సింగర్ సూదులు మృదువైన కుట్టుపనిని అందిస్తాయి.










సింగర్ సూదులు అంతర్జాతీయ సింగర్ ప్రమాణాలకు అనుగుణంగా తయారు చేయబడతాయి. అంచేతే, సింగర్ సూదులు మిగతా ఏ ఉత్పాదనా కన్నా కూడా బాగా పని చేస్తాయి. మేలైన కుట్టుపనికి ఇంతకన్నా మీకేం కావాలి!

ఉత్పాదకులు
**సింగర్-టివిఎస్ లిమిటెడ్**
మదురై

వ్యాపార వివరాలకు సంప్రదించండి:
**సింగర్ సోయింగ్ మెషీన్ కం.,**
సింగర్ బిల్డింగ్, 207 డి. ఎన్. రోడ్,
బొంబాయి 400 001

అసలైన సింగర్ సూదుల కోసం సింగర్ పేరుకై చూడండి.

అత్యద్భుతమైన కుట్టుపని **సింగర్*** సూదులతోనే ప్రారంభం!

*ది సింగర్ కంపెనీవారి ట్రేడ్‌మార్క్

maa SSM 96B TEL

"ఇవ్వాళేగా నార్మల్‌కు వచ్చింది. ఆఫీసుకు వెళ్ళకపోతేనేం?" ఉండబట్టలేక అన్నది కల్పన.

"నీ సలహాలు నాకు అక్కర్లేదు." అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

కల్పన చూస్తూ ఉండిపోయింది.

## 15

రెండు నెలలు గడిచాయి. కల్పన ఎంత ప్రయత్నించినా సిద్ధార్థ మాట్లాడటంలేదు. మంచి మూడులో ఉంటే "అవునూ కాదూ" అని క్లుప్తంగా సమాధానం ఇస్తున్నాడు.

దగ్గరి స్నేహితుల ఇళ్ళల్లో పార్టీలు అయినా తీసుకువెళ్ళడం లేదు. మొదట్లో సరిగా మాట్లాడక పోయినా పార్టీలకు తీసుకెళ్ళేవాడు. బయట వాళ్ళ ముందు "కల్పనా! కల్పనా! ఇది తిను! ఆ స్వీట్ బాగుంది చూడు" అంటూ పార్టీలలో మాట్లాడేవాడు. అందరూ ఎంతో అన్యోన్యదంపతులు అనుకొనేవారు. ఒక మిసెస్ రాజుకు మాత్రమే తెలుసు తమ మధ్యలో ఉన్న అగాథం.

కల్పన గతంలోనుంచి వర్తమానంలోకి వచ్చింది. చేతిలో రవీంద్ర ఉత్తరం ఉన్నది. ఆ ఉత్తరం మరోసారి చదువుకుంది.

రవీంద్రకు పెళ్ళి అయి కూడా సంవత్సరంన్నర అయింది. భార్యతో సుఖంగా ఉండి ఉంటాడు. తను ఎన్నో ఉత్తరాలు రాసింది. కాని ఒకదానికీ సమాధానం ఇవ్వలేదు. తనను మర్చిపోయాడా? తనమీద కోపమా?

కాదు! రవీంద్ర పిరికివాడు.

తనను ప్రేమిస్తున్నట్టు నోరు విప్పి చెప్పలేక పోయేవాడు. తన వివాహం సిద్ధార్థతో నిశ్చయం అయిందని తెలుసుకున్నరోజు తన దగ్గరకు వచ్చాడు. అతని ముఖం, అలిగిన పసివాడి ముఖంలా ఉన్నది.

"నేను విన్నది నిజమేనా?" అని అడిగాడు రవీంద్ర.

"ఏమిటి?" ఎదురు ప్రశ్న పెట్టింది తను.

"సిద్ధార్థను వివాహం చేసుకోవడానికి అంగీకరించావటగా?"

"అవును!"

రవీంద్ర ముఖంలో పారాడిన నీలి నీడల్ని స్పష్టంగా తను చూసింది.




1. ఆసియా ఖండంలో 'థాయ్‌లాండ్' అనే దేశం వుందని మీకందరికీ తెలుసు. అయితే థాయ్‌లాండ్ అంటే అర్థం ఏమిటి? ఆ దేశపు రాజధానీ నగరం ఏదో చెప్పగలరా?
2. పంజాబీ భాషను ఏ లిపిలో రాస్తారు?
3. రష్యా దేశపు వనిత వాలంతీనా తెరెష్కోవ అంతరిక్షయానం చేసిన తొలి వనిత అన్నది మీకు తెలుసు. అయితే ఆమె భూమి చుట్టూ ఎన్నిసార్లు ప్రదక్షిణ చేసింది? ఎంత దూరం ప్రయాణం చేసింది?
4. సామాన్యమైన ఆరోగ్యంగల ఒక వ్యక్తి తల వెంట్రుకలు ఆరంగుళాల మేరకు పెరగడానికి ఎంత కాలం పడుతుంది?
5. రామకృష్ణ మిషన్ స్థాపించిన వ్యక్తి ఎవరు?
6. ప్రపంచ బ్యాంకు (World Bank) కి మరో పేరు కూడా వుంది. అదేమిటో చెప్పగలరా?
7. భారతదేశంలోకల్లా దక్షిణాగ్ర భాగంలో వున్న ప్రాంతం ఏది?
8. ప్రపంచంలో మొట్టమొదట ఏ నగరంలో విమానయానం చేయవచ్చును అనడానికి నిదర్శనంగా 'వైమానిక ప్రదర్శనలు' జరిగాయో చెప్పగలరా?
9. చీమలలో కొన్నిటికి రెక్కలు వుండడం మీరు చూసే వుంటారు. అయితే అవి ఏ చీమలు?
10. 'బీహార్' రాష్ట్రానికి ఆ పేరెలా వచ్చింది?

**[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]**

"సిద్ధార్థను నువ్వు ప్రేమిస్తున్నావా?"

"లేదు!"

"మరి ఎలా పెళ్ళిచేసుకుంటున్నావ్?"

"ప్రేమకూ పెళ్ళికీ సంబంధంలేదు. ఆ మాట కొస్తే ప్రేమించేవాళ్ళను పెళ్ళి చేసుకోకూడదని నా అభిప్రాయం. ప్రేమ హృదయానికి సంబంధించింది. పవిత్రమైంది. దాన్ని శారీరక సంబంధంలోకి దించి కలుషితం చెయ్యకూడదు."

రవీంద్ర వెర్రివాడిలా తన ముఖంలోకి చూశాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు లేకుండా నేను బ్రతకలేను." అంటూ కళ్ళనీరు పెట్టుకుంటాడని తను ఆశించింది.

కాని రవీంద్ర అలా చెయ్యలేదు.

చివ్వున లేచి వెళ్ళిపోయాడు.

తను ఎన్నో చెప్పాలనుకుంది.

పవిత్ర ప్రేమను గురించి చెప్పాలనుకుంది. "నేను నిన్నే ప్రేమిస్తున్నాను. మన ప్రేమ శాశ్వతంగా ఉండాలనే సిద్ధార్థను పెళ్ళి చేసుకుంటున్నా" అని చెప్పాలనుకుంది. కాని అతను తనకు ఆ అవకాశం ఇవ్వలేదు.

పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళాడు.

వివాహం అయాక తను చెప్పదలచుకున్నది ఉత్తరంలో రాసింది. తన కవితాశక్తినంతా ఉపయోగించి గుండెలు కరిగించే ఉత్తరం రాసింది. కాని దానికి జవాబు కూడా తను ఆశించినట్టు రాలేదు.

ఈ రోజు సిద్ధార్థ తనను ఉంపుడుగత్తె అన్నాడు—తను ఎలా సహించగలిగింది?

సిద్ధార్థ నిజంగానే తనకు విడాకులు ఇస్తాడా? ఒక విధంగా అదే మంచిదేమో?

రవీంద్ర ఆ విషయం విని తప్పకవస్తాడు.

తనూ....రవీంద్రా....

ఏమిటి తను ఇలా ఆలోచిస్తున్నది? రవీంద్ర భార్యను వదిలేసి తనకు అండగా నిలుస్తాడా? తప్పక నిలుస్తాడు.

ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయింది కల్పన.

[సశేషం]



# బాలల స్వర్గం



## 2

కమలా వరదాచారి

కుటుంబ పరిస్థితులు, పరిసరాల ప్రభావం, తగని సహవాసం మొదలైన కారణాలవల్ల పాఠశాల విద్యార్థులు కొందరు దురలవాట్లకు లోనవుతారు. అలాంటివాళ్ళకు టి. సి. ఇచ్చి ఇంటికి పంపడంతో పీడ విరగడయ్యింది అని అనుకోడం సర్వసాధారణమైన విషయం. తల్లిదండ్రులు కూడా "వాడి తలరాత అంతే" అని ఒక వేడి నిట్టూర్పువదిలి తమ పని తాము చూసుకుంటారు.

మరి దీని పర్యవసానం? జీవన ఉద్యానవనంలో వికసించి పరిమళాలు వెదజల్లవలసిన ఆ పసి బాలుని జీవితపుష్పం మొగ్గగానే కొనసాగవలసిన నిర్బంధం ఏర్పడుతుంది! ఈ స్థితి మారాలంటే ప్రభుత్వం తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, సమాజం-వీరిపట్ల సానుభూతితో ఆలోచించి - వీరి సంక్షేమానికి కృషి చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

సోవియట్ దేశంలో ఇలాంటి విద్యార్థులు ఎవరైనా వున్నారంటే వారి బ్రతుకులను అలాగే గాలికి వదలి చేతులు దులిపేసుకోరు. సాషా అన్న అబ్బాయి సంగతి చూస్తే అక్కడి తీరుతెన్నులు తేటతెల్లమవుతాయి.

సాషా రెండోతరగతి చదివేటప్పుడు తల్లికి సుస్తీ చేసి-ప్రసవసమయంలో మానసిక ఆరోగ్యం బాగా దెబ్బతింది. వైద్యులు ఎంత ప్రయత్నించినప్పటికీ జబ్బు నయం కాలేదు. అంచేత ఆమె కొన్నాళ్ళు మెంటల్ హాస్పిటల్‌లో వుండవలసిన అవసరం ఏర్పడింది.

రోజులు - నెలలుగా సంవత్సరాలుగా దొర్లిపోసాగాయి. సాషా కుటుంబంలో ఓ స్తబ్దత ఆవరించింది. పోనుపోను అదో తుపానుగా రూపెత్తింది. ఇల్లాలు లేని ఇంటికి సాషా తండ్రి ఆలస్యంగా రావడం ప్రారంభించాడు. భార్య లేని ఇల్లు ఆయనకు శూన్యంగా తోచింది. నానాటికి ఇంటి జ్ఞాపకమే మాసిపోసాగింది.

ఇలాంటి స్థితిలో ఇంటిపట్టున వున్న సాషాకు తల్లిదండ్రుల చల్లని ఆదరణ కరువయ్యింది. ఇంట్లో వున్నా, బయటికి వెళ్ళినా....ఎప్పుడు వచ్చినా అడిగే దిక్కు లేకపోయేసరికి క్రమక్రమంగా స్కూలు ఎగ్గొట్టడం; తక్కువ మార్కులే తెచ్చుకోడం ఇంటి పనులు అశ్రద్ధ చేయడం మొదలైనవి ఎక్కువయినాయి.

ఈ విషయం పాఠశాల ప్రధానోపాధ్యాయుని చెవికి అందింది. సాషా ఇంటి స్థితి గమనించిన ప్రధానోపాధ్యాయుడు తనే తల్లీ తండ్రీ అయ్యాడు.



బడిలోనే సాషాకు ఉచిత భోజన ఏర్పాటు చేయ బడింది. సాషా సక్రమంగా స్కూలుకు వస్తున్నాడా అని గమనించడం, ప్రేమగా పలకరించడం, బడి ముగిసిన తర్వాత సాయంకాలం పార్కు, సినిమా, నాటకం మొదలైనవాటికి తీసుకుపోసాగాడు. రాత్రుల్లో ఒకరినొకరు వదలి వెళ్ళేప్పుడు వీడని వీడ్కోలు చెప్పుకునేవారు. ఇలా వారు ఎంతో ఆప్తులైనారు. ఇలా సాషా నాలుగో తరగతికి వచ్చేప్పటికి తరగతి నాయకుడు అయ్యాడు. చదువులో కూడా ప్రథమస్థానం అందుకోగలిగాడు. ముందు ముందు వాడి భవిష్యత్తు మూడు పువ్వులూ ఆరు కాయలే! అందులో సందేహమే లేదు. అయితే ఇలాంటి విద్యార్థులు సోవియట్‌లో చాలా స్వల్పమనే చెప్పాలి.

అసలు ఒక విద్యార్థి పెడత్రోవపట్టడానికి ముఖ్య కారణం-వాడికి ఎక్కువ విరామసమయం వుండడమే. అంచేత పిల్లలకు ఎక్కువ విరామసమయం వుంటే దానిని సద్వినియోగం చేసుకునే సౌకర్యాలు కల్పించడం పెద్దల బాధ్యత. సోవియట్ దేశంలోని పిల్లలు విరామ సమయాలను ప్రయోజనకరంగా గడపడానికి కావలసినన్ని అవకాశాలు ఉచితంగానే కల్పించ బడ్డాయి.

సాధారణంగా ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక్క విభాగంలో ఎక్కువ ఆసక్తి ఉత్సాహం వుంటుంది. ఒక విద్యార్థికి టెన్నిస్ ఆటలో ఆసక్తి వుంటే అందులో తన నేర్పు ప్రదర్శించడానికి, పెంపొందించుకోడానికే ఇష్టపడతాడు. ఇలాంటివారికి శిక్షణ ఇవ్వడానికి క్రీడా సంఘాలు వున్నాయి. అక్కడ చేరితే ఉచితంగానే శిక్షణ ఇస్తారు. ఇంకా ఆసక్తి వున్నట్టయితే క్రీడా పాఠ్య భాగాలనే ప్రత్యేకంగా బోధించే పాఠశాలలలో చేరవచ్చు.



క్రీడలకే కాదు. సంగీతం, చిత్రలేఖనం, నటన, సామాన్యశాస్త్రం, భూగోళం, సాంకేతిక విద్య మొదలైన పాఠ్య భాగాలలో ప్రత్యేక ఆసక్తిగల వారు ఆయా విభాగాలలో తమ పరిజ్ఞానం పెంపొందించుకోడానికి అనుగుణంగా ప్రత్యేక ఉచిత సదుపాయాలు వున్నాయి. మామూలు పాఠశాలలలో చదువుకుంటూనే సాయం సమయాలలో-సంగీతం, నాట్యం, నటన మొదలైనవాటిలో శిక్షణ పొంది యోగ్యతా పత్రాలు పొందవచ్చు.

చలికాలంలో పదిహేను రోజులు, వేసవికాలంలో రెండు నెలలూ సెలవులు వుంటాయి. ఈ సెలవులు ఫలవంతంగా, ఆనందంగా గడపడానికి దేశం మొత్తం మీద అక్కడక్కడ సెలవు విడుదులు, ఆరోగ్య కేంద్రాలు, బాలల క్యాంపులు వున్నాయి. ఇక్కడ అయ్యే ఖర్చులో చాలా తక్కువే విద్యార్థుల తల్లిదండ్రులు చెల్లించవలసి వుంటుంది.

అంతేకాదు. అనారోగ్యం కారణంగా విద్యార్థుల చదువులు కుంటుపడకుండా చూసుకోడానికి సకల జాగ్రత్తలూ తీసుకుంటారు. ఒకవేళ విద్యార్థి దీర్ఘ వ్యాధికి గురయినట్టయితే అలాంటి వారికంటూ ప్రత్యేకంగా చెట్టూ చేమ నిండిన తోటల మధ్య ఆరోగ్య కేంద్రాలు నెలకొల్పబడి వున్నాయి. పిల్లల అనారోగ్య స్థితిని అనుసరించి చికిత్స, చదువు ఒకే సమయంలో కొనసాగడానికి ఉచితంగానే ఏర్పాట్లు చేయబడి వున్నాయి.



బడి చదువు ముగిసే లోపల ప్రతి విద్యార్థి ఏదైనా ఒక వృత్తిలో కనీస అర్హత సంపాయించుకుంటాడు. చేతిపనులు, డ్రైవింగ్, తోటపని, టెలిఫోన్ ఆపరేషన్, నర్సులు మొదలైన వృత్తులలో శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రస్తుత విద్యా విధానం ప్రకారం సామాన్య విద్యతోపాటు ఏదైనా ఒక వృత్తిలో ప్రతి విద్యార్థి నిర్బంధ శిక్షణ పొందడానికి కూడా అక్కడ ఉచిత సౌకర్యాలు కల్పించ బడ్డాయి. □

# సమస్యలూ సలహాలూ

నిర్వహణ: కమలా వసంత కుమారి

ఒ. యస్.

నేను చదువుకున్నాను. మా కుటుంబం గొప్ప కుటుంబమే. కాని, నేనే దురదృష్టవంతురాలిని. అది కూడా సామాన్యమైన దురదృష్టం కాదు — తల్లిప్రేమకు నోచుకోని అభాగ్యురాలిని! మా అమ్మ ఎందుకనో మొదట్నుంచి నన్ను హీనంగానే చూస్తున్నది. నాకు తోబుట్టువులున్నారు. వారందర్నీ ఆమె శ్రద్ధగా గమనిస్తుంది; వారి ఆలనా పాలనా చూస్తుంది. కాని, నన్ను మాత్రం— 'నీ ముఖం చూస్తే పాపం' అంటుంది; 'తిండి కోసం పుట్టావు' అంటుంది. మరీ కోపం వస్తే 'ఎందులోనైనా పడి చావు' అంటుంది. ఈ విషయాలు మా తండ్రిగారికి తెలియకపోలేదు; తెలుసు. కాని, ఆయన ఏవీ అంతగా పట్టించుకోడం లేదు. నా జన్మలో 'రహస్యం' ఏమైనా వుందా - అంటే అదేం లేదనీ, నేను మా అమ్మ కడుపున పుట్టిన దాన్నేననీ, తెలిసినవాళ్ళు చెబుతారు. నేనేం కురూపిని కాను; అంగవైకల్యం గలదాన్నీ కాను. కాని, ఏమిటి నా పరిస్థితి? ఒక్క రోజు, ఒక్క క్షణం కూడా నేను సంతోషంగా వుండలేకపోతున్నాను. నా తల్లి, అందర్నీ ఒక్కలాగే కన్న నా తల్లి, నన్ను మాత్రం ఎందుకలా 'సవతి పిల్ల'ను చూసినట్టు చూస్తుంది? నాకేం అర్థంకాదు. నా బాధంతా అర్థం చేసుకునే ఒక మిత్రుడున్నాడు. అతనిది మా కులం కాదు. అతని మీద నాకు నమ్మకం వుంది. అయినా, అతన్ని చేసుకోడానికి నేను భయపడుతున్నాను—మా అమ్మ కారణంగా. అతని ఓదార్పు మాటలు లేని సమయాల్లో నాకు చచ్చిపోవాలనే అనిపిస్తుంది. మరి, నాకు గత్యంతరం ఏమిటి?

**మీ సమస్య చాలా చిత్రంగా, అందర్నీ ఆశ్చర్యపరిచేలా వుంది! కన్నతల్లి, సొంత బిడ్డ మీద ప్రేమ చూపకపోవడమా!....అయితే, ఇలాంటివి జరగడంలో ఏవో కారణాలు వుండే వుండాలి. నా ఉద్దేశంలో—1. ఒకరు పుట్టిన తర్వాత, వారి కుటుంబంలో ఏవో గొడవలు రేగుతాయి; అశుభాలు కలుగుతాయి. అవన్నీ ఆ పుట్టిన బిడ్డనుంచే అనుకోవడంవల్ల. 2. తల్లికి ఎక్కువ సంతానం వుండడంవల్ల 3. బీదరికపు బాధలు 4. బిడ్డ జన్మానికి కారకుడైన వ్యక్తి మీద అమితమైన ద్వేషం వున్నప్పుడు 5. తల్లిదండ్రుల్లో ఎవరో ఒకరికి ఆ బిడ్డ పుట్టుక మీద సందేహం వున్నప్పుడు 6. ఆ బిడ్డ కురూపి కావడమో, మానసికంగా స్థిమితం లేనిది కావడమో, అంగవైకల్యంతో వుండడమో-ఏదో జరిగినప్పుడు - మొదలైనవి. మరి వీటిల్లోని ఎలాంటి కారణమైనా మీ తల్లిని రెచ్చగొడుతూ వుండాలి. ఏమైనా, మీ తల్లిగారిది వింత మనస్తత్వమే! దానికి సరైన కారణం తెలుసుకోగలిగితే, మీ వ్యధ కొంతవరకూ తగ్గించడానికి అవకాశం వుంటుంది. అయితే, మీరు మాత్రం ఎప్పుడూ అదే ఆలోచనతో వుండకుండా మీ పన్లు మీరు చేసుకోగలిగితే - మరీ మంచిది. వీలు చూసుకుని, మీ తండ్రిగారితో మీ విషయాలన్నీ వివరంగా చెప్పి, ఆయన సలహా ప్రకారం నడుచుకోండి. ఆయన పట్టించుకోకపోవడంవల్ల కూడా, ఇలాంటివి అధికం అవుతూ వుండొచ్చు!**

సి. పి.

నేను మా తలిదండ్రుల్ని ఎదిరించి, ప్రేమించిన వ్యక్తిని చేసుకున్నాను. అప్పుడు నాకు 22 ఏళ్ళు. అంతకుముందు మేము బయట పార్కుల్లో, సినిమాల్లోనూ కలుసుకుంటూ కబుర్లు చెప్పుకొనేవాళ్ళం. కాని, వివాహం చేసుకున్న రోజునే అతను నన్ను వాళ్ళ సోదరి యింట దిగవిడిచి — "మనం ఇల్లు తీసుకునేవరకూ ఇక్కడే వుండు" అన్నాడు. రెండు రోజులు హోటల్లో గడపవచ్చును గదా - అనిపించింది నాకు. అతను ఉద్యోగి, వెయ్యి రూపాయల జీతగాడు. ఆటు తర్వాత కూడా చాలారోజులు బయటతిరిగేవాళ్ళమే గాని, 'సెక్సువల్ మీటింగ్స్' లేవు! ఒక్కోసారి దేనికో దానికి పోట్లాడేవాడు కూడా. 'జీవితం అంటే ఇదేనా' అనుకునేదాన్ని. నేను మరీ, అతని దగ్గరకు వెళ్తే ఏదో చెప్పి తప్పించుకునేవాడు. సెక్స్ ముఖ్యమైనది కాదనీ, తను చిక్కుల్లో వున్నాననీ, ఏవేవో సాకులు చెప్పేవాడు. కాని, అతనికి ఇంకొకతె ఎవరితోనూ సంబంధం వున్నట్టు లేదు! ఒకసారి ఇద్దరం కలిసి, బెంగుళూరు వెళ్ళి హోటల్లో వున్నాం. అప్పుడు కూడా మా మధ్య 'కలయిక' లేదు! అతను 'నపుంసకుడు' అయివుండాలని తీర్మానించుకుని-ఎంతగానో భయపడ్డాను.

కాని, ఒకరోజు ఏదో పరిస్థితిలో యాంత్రికంగా, రెండు నిమిషాలపాటు కలియడం దాని ఫలితంగా నేను గర్భవతిని కావడం జరిగాయి. తల్లినవుతున్నందుకు సంతోషించినా, నాలో ఏదో తీరని వెలితి; బాధ మిగిలిపోయాయి. మళ్ళీ మేము సంవత్సరంన్నర తర్వాత, మళ్ళీ మూడేళ్ళ తర్వాత మాత్రమే 'సెక్సువల్'గా కలిశాము. కలిసినప్పుడల్లా—నేను గర్భవతిని కావడం జరిగింది. ఇప్పుడు నేను ముగ్గురు బిడ్డల తల్లిని. కాని, ఈ విచిత్ర పరిస్థితి ఏమిటో నాకు అర్థం కావడంలేదు!....

మొత్తానికి వివాహం జరిగి, పదేళ్ళు అయిపోయింది. రానురాను, అతనిలో సహనం నశించిపోవడం, కోపం రావడం కూడా జరిగాయి. నన్నూ పిల్లల్నీ నిష్కారణంగా తీవ్రంగా హింసిస్తున్నాడు. అతని మనస్తత్వం ఏమిటో అర్థం కాదు. అతను పెట్టే బాధలు భరించలేక, ఈ మధ్య నుంచి మా అన్నయ్య ఇంట్లో వుంటున్నాను. కాని, ఇలా ఎంతకాలం వుండగలను? 'విచిత్రమైన' నా పరిస్థితి నుంచి నేను బయటపడడం ఎలా?

**మీ మానసిక వేదనకూ, పరిస్థితికీ ముఖ్య కారణం- 'సెక్సువల్ ఫీలింగ్స్' అన్నది తెలుస్తూనే వుంది. ఇది మామూలు సమస్య కాదు - తీవ్రమైన సమస్యే. ఇన్ని సంవత్సరాలు మీరు ఓర్చుకుని, మొండిగా భరించడం - మీ ఓర్పుకు నిదర్శనం! లైంగికమైన**

ఆలోచనలు, కోరికలూ లేకపోవడం అన్నదానికి చాలా కారణాలు వుంటాయి. మనస్తత్వ శాస్త్రజ్ఞులెవరైనా మీ భర్త స్థితిని, కారణాలనూ చెప్పగలుగుతారు! మీరు, మీ భర్తను ఒప్పించి, (!) మంచి 'సైకియాట్రిస్ట్'కు చూపించగలరా?—అతనికి మీ మీద కలిగే కోపం, చిరాకులకు అతని సెక్సువల్ ధోరణికీ కూడా ఏదో సంబంధం వుంటుంది. ఏమైనా ఇది మామూలు సమస్య కాదు. మీరు మొదట్లోనే దీన్ని పరిష్కరించుకోడానికి ప్రయత్నాలు చెయ్యవలసింది. ఏదైనా బలవంతం చెయ్యలేము. వివాహం, భార్య, పిల్లలు-వారి మీద తన బాధ్యతలూ మీ భర్తే, తనంతగా తాను గ్రహించుకోవాలి. 'కౌన్సెలింగ్ సర్వీసెస్' ద్వారానే ఇలాంటివి సాధ్యమవుతాయి. మీరు మాత్రం నిరుత్సాహ పడిపోవద్దు, అనవసరమైన ఆలోచనల్లో పడి బతుకు పాడు చేసుకోకండి. మీ మీద ఆధార పడిన ముగ్గురు పిల్లలున్నారు!

వై. వి.

నా వయసు ఇరవై సంవత్సరాలు. చదువుకుంటున్నాను. ఒకతన్ని నేను ప్రేమించాను. అతనికీ నేనంటే ఇష్టమే. మా యిద్దరి కులాలు కూడా ఒక్కటే. కాని, ఆయన ఎందుకనో నన్ను పెళ్ళిచేసుకోడానికి అంగీకరించడం లేదు. నేను అంటే ప్రేమేనంటారు. నేను ఎంతగానో ఆయన్ని అడిగి కూడా, విసిగి వూరుకున్నాను. కాని, వేరే వ్యక్తిని చేసుకోడానికి నా మనసు అంగీకరించడం లేదు। అతన్ని మరిచిపోలేకపోతున్నాను. పెళ్ళి ఎందుకు చేసుకోరో సరైన కారణం చెప్పడంలేదు. నాకు చాలా దిగులుగా వుంటోంది. అతన్ని మరచిపోవాలన్నా మరిచిపోలేకుండా వున్నాను. నేను ఈ పరిస్థితినుంచి ఎలా తప్పించుకోగలను?

మీరు ఒకర్ని ప్రేమించారు. అతనూ మిమ్మల్ని ప్రేమించి, మిమ్మల్ని వివాహం చేసుకోడానికి అంగీకరించనప్పుడు, దానికి వేరే మార్గం లేదు—అతన్ని మరచిపోవడమే! అతని గురించి మీరు ఇంకా ఆలోచించడంలో అర్థం లేదు. అయితే, మనసిచ్చి ప్రేమించారు గనక, మరచిపోవడం అన్నది అంత సులభం కాకపోవచ్చు. అయినా అతన్ని మరచిపోవడం తప్ప, మీకు గత్యంతరం లేదు. మనసును ఇంకొక వైపు తిప్పుకుంటూ, మీ చదువు మీదనే ధ్యానం ఎక్కువ చేసుకుంటూ, నిదానంగా అతన్ని మరిచిపోడానికి ప్రయత్నించండి. బంగారంలాంటి మీ బతుకును పాడు చేసుకోకండి!



## సీతా కామరాజ్

1977లో తుపానుకు గురైన కృష్ణా, గుంటూరు జిల్లాలలో 43 బాల్వాడీలను నెలకొల్పిన ఖ్యాతి శ్రీమతి సీతా కామరాజ్‌గారికి దక్కింది. సాంఘిక సేవా సంస్థలతో ఆమెకు ఉన్న సన్నిహిత పరిచయం అందరికన్న ముందుగా తుపాను బాధిత ప్రాంతాలకు వెళ్ళి అక్కడ బాల్వాడీలు ఏర్పాటు చేయడానికి దోహదం చేసింది. ఈ బాల్వాడీలలో 33 కృష్ణా జిల్లాలోను, 10 గుంటూరు జిల్లాలోను ఉన్నవి. ఒక్కొక్క బాల్వాడీలో 40 మంది పిల్లలు ఉన్నారు.

ఒక్కొక్క బాల్వాడీకి రు 1000లు విలువైన వంట సామగ్రి, బోధనా పరికరాలు యిచ్చారు. ఒక బాలసేవిక ఈ బాల్వాడీని 'ఆయా' సహాయంతో నిర్వహిస్తుంది. భారత శిశు సంక్షేమ వ్యవహారాల మండలి (Indian council of child welfare) ఈ బాల్వాడీల ఏర్పాటుకు ఆర్థిక సహాయం అందజేసింది.

శ్రీమతి సీతా కామరాజ్ హయాంలో విజయవాడ భారత మహిళా మండలి ఆధ్వర్యాన ఏర్పాటయిన 'వర్కింగ్ విమెన్స్ హాస్టల్'కు ప్రారంభోత్సవం జరిగినప్పుడు కేంద్ర ప్రభుత్వం రు 80 000 గ్రాంటు ఇవ్వగా భారత మహిళామండలి రు 20,000 విరాళాల రూపంలో యిచ్చింది. ఇందులో 30 మంది బాలికలకు వసతి ఉంది.

శ్రీమతి సీతా కామరాజ్ 1935లో కృష్ణా జిల్లా గుడివాడలో జన్మించారు. బి.ఏ వరకు గుడివాడలో చదివి తర్వాత ఢిల్లీ వెళ్ళి ఢిల్లీ యూనివర్శిటీ నుండి ఎం. ఏ. (సోషల్ వర్క్)లో డిగ్రీ తీసుకున్నారు. తర్వాత భారత శిశు సంక్షేమ వ్యవహారాల మండలిలో చేరి 'రిసెర్చి ఆఫీసర్'గా పని చేశారు. బాలల జీవన స్థితిగతుల మెరుగుదలకు అవసరమైన ఎన్నో చట్టాలు రూపొందడానికి ఆమె కారకురాలైనారు. బాలల గురించి ఎంతో సమాచారం సేకరించి, పత్రాలు తయారు చేశారు. అనాథశరణాలయాలు ఏర్పడటానికి ఆమె కారకులైనారు. తర్వాత బ్రిటన్‌లోని 'స్వాన్సియా' (Swansea) యూనివర్శిటీకి ఆమెను కేంద్ర ప్రభుత్వం పంపింది. అక్కడ ఆమె 'సాంఘిక సంక్షేమ వ్యవహారాలు - వాటి నిర్వహణ'లో శిక్షణ పొందారు.

విజయవాడకు చెందిన ప్రముఖ ఫిలిం పంపిణీదారు, పూర్ణా పిక్చర్స్ అధినేత శ్రీ జి. కామరాజు గారితో ఆమెకు వివాహం జరిగింది

విజయవాడకు ఆమె రాగానే సాంఘిక సేవా రంగంలో ఆమెకుగల విశేషానుభవాన్ని వినియోగించే నిమిత్తం వారిని వివిధ సేవా సంస్థలు అధ్యక్షురాలిగా ఎన్నుకున్నవి.

విజయవాడ గాంధీ పర్వతా సంఘం స్త్రీ శిశు జన సంక్షేమ విభాగానికి ఆమె అధ్యక్షురాలిగా ఉన్నారు. విజయవాడలో గాంధీ పర్వతా సంఘం ఆధ్వర్యాన భవన్స్ యూనివర్శిటీ సహకారంతో జర్నలిజం కోర్సులు ప్రారంభించడానికి ఆమె దోహదం చేశారు.

ఇన్నర్‌వీల్ క్లబ్‌కు, భారత మహిళా మండలికి ఆమె అధ్యక్షురాలిగా ఎన్నికయారు. స్త్రీల సంక్షేమ కార్యక్రమాలకు ఆమె నాయకత్వం వహించారు. ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ వ్యవహారాల బోర్డు ఉపాధ్యక్షురాలిగా రాష్ట్ర ప్రభుత్వం ఆమెను నామినేట్ చేసింది. ఢిల్లీలోని స్వామి శివానంద మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్‌కు శ్రీమతి సీతా కామరాజ్ యావజ్జీవిత సభ్యురాలిగా ఉన్నారు.

సాంఘిక సేవా కార్యక్రమాలు విజయవంతం కావాలంటే 'మనిషికి మనిషికి మధ్యవున్న మానవతా సంబంధాలు, ప్రేమ, కరుణ, దయ, జాలి పెంపొందాలి' అని ఆమె అంటూ ఉంటారు. సంఘ సేవ చేయడానికి హోదా, వయస్సు అడ్డు రావనీ, ప్రభుత్వ సంస్థలో ఉంటూగాని ప్రయివేటు వ్యక్తిగా ఏ సమయంలో ఎవరైనా సంఘ సేవ చేయవచ్చునని ఆమె అంటారు.

—మీరా

చిట్టి కథ

# గుణపాఠం

"ఏమిటి నాన్నా మీరనేది? కట్నం యివ్వలేదు గనుక యిప్పుడు అత్తయ్య చెప్పిన సామానంతా కొంటారన్న మాట. 'కట్నం' యివ్వలేదని పేరే గాని మీకు ఏం ఖర్చు తప్పింది గనుక! అయినా యీ వంకతో వాళ్ళు తీసికొన్నవి చాలానే అయి నాయి. మళ్ళీ యిప్పుడు యిదేమిటి? అయినా మా సంసారానికి కావలసినవి మేము కొనుక్కో లేమూ? ఎంత లేదన్నా అవన్నీ కలిపి రెండు మూడు వేలవుతాయి." అంది కోపంగా శశి తండ్రితో.

"అత్తయ్య సామానుతోపాటే నిన్ను అబ్బాయి దగ్గరకు పంపమంది. ఇంత ఖర్చా అయ్యాకా యిప్పుడు వెనకాడడం ఎందుకు?" ఆయన ముఖంలో నిస్పహాయత స్పష్టంగా కనబడుతోంది. తోడబుట్టిన చెల్లెలు తన కష్ట సుఖాలు ఆలోచించే-కట్నం వద్దందని పొంగిపోయాడుగాని యిదోరకం 'నిలువుదోపిడి' అనుకోలేక పోయాడాయన.

కాళ్ళు కడిగే చెంబు నుండి అబ్బాయి అమ్మాయి బట్టలవరకు అన్నగారి దగ్గరుండి కొనిపించింది. "ఏమిటన్నయ్యా! మరీ యింత చిన్న చెంబా కొనేది? ఎవరో పరాయి వాళ్లకు యిస్తున్నట్లు. నాకూ వాడొక్కడేగా! అన్ని అచ్చటా ముచ్చట్లు తీర్చుకోవాలని వుండదా? అక్కడికి అన్నయ్యవనీ కట్నం వద్దనే అంటిని. లాంఛనాలన్నా ఘనంగా యివ్వు." ఇలా మొదలయిన ఆవిడగారి ధోరణికి రామయ్యగారు మొదలే నీరుకారిపోయారు. ఏదో అన్నిట్లోనూ ఖర్చు తగ్గించి 'పిల్ల' పేరున వేసిన ఐదు వేలల్లో ముగించేద్దాం. ఎటూ చెల్లెలు కట్నం తీసుకోవడం లేదు - అనుకున్న రామయ్యగారు ఎనిమిది వేల పైచిలుకు ఖర్చు అయ్యేసరికి బాగా నిరాశ పడిపోయాడు. ఏదో యింతటితోనయినా పెళ్ళి ముగిసిందని తృప్తి పడటానికి వీల్లేకుండా "డబుల్‌కాట్, ఫర్నీచర్, బీరువా, టేబిల్ ఫ్యాను తోనే అమ్మాయిని కాపరానికి పంపించు" అని మెత్తగా చెప్పినా ఖరాఖండిగానే చెప్పింది చెల్లెలు.

"ఇక్కడ కూర్చొని ఆలోచిస్తావేం నాన్నా? 'నావల్ల గాదు' అని అత్తయ్యతో అక్కడే చెప్పకపోయావా?" అంది శశి.

"ఎలా చెప్పనమ్మా! విశ్వం కూడ యివన్నీ కావాలన్నట్లే అభిప్రాయం వెలిబుచ్చాడు."

"ఏమిటీ! బావ కూడ ఇవి తెస్తేనే నన్ను రమ్మన్నాడా?" విపరీతమైన కోపాన్నీ ఆశ్చర్యాన్నీ మిళితం చేస్తూ అడిగింది.

"అబ్బెబ్బే అలా అని గాదు" ఖంగారు పడ్డారు ఆయన. "అదే-అత్తయ్యకు మనం పెళ్లి ఘనంగా చెయ్యలేదని కోపంగా వుందిట. ఇప్పుడు యివీ కాదంటే అత్తయ్య బాధపడుతుందనేగాని వాడికి యివి కావలనేమీ పంతంలేదుట. ఎలా అయినా కనిపెంచిన వాళ్ళను ఎట్లా నిర్లక్ష్యం చెయ్యగలడు?" అన్నారు కానేపాగి.

తండ్రి సమాధానం శశి కోపాన్ని మరింత పెంచింది.

కన్నవాళ్ళు 'వద్దు మొర్రో' అంటున్నా 'హిప్పీ క్రాఫ్'లు 'బెల్‌బాటమ్'లు మానరు. పైగా 'పెద్దవాళ్ళది చాదస్తం' అంటూ కొట్టి పారేస్తారు. తల్లిదండ్రులకు యిష్టం లేదని తెలిసినా, పెళ్ళాలను వెంటేసుకొని తిరుగుతారు గాని ఇలాంటి విషయాల్లో మాత్రం వాళ్ళ మాట, గీచిన గీటు దాటనట్లే ప్రవర్తిస్తారు. కట్నాలు, లాంఛనాలు పేర్లతో డబ్బు గుంజుకోవాలనే తత్వం అసలు వీళ్ళల్లోనే వుంది. పైకి పెద్దవాళ్ళను యిరికిస్తారు. తమకు మామగారి నుండి పైసా పుచ్చుకోవటం యిష్టం లేనట్లు. ఇదో రకం కపట స్వభావం.

అసలు ప్రతివారు 'కట్నమే' ముఖ్యమైన సమస్యన్నట్లు మాట్లాడుతారు. కాదనిగాదు కాని, వివాహమప్పుడు, ఆ తరువాత కూడా, "లాంఛనాలు" పేరిట జరిగే వ్యయం కట్నానికి రెట్టింపు అవుతున్నది. పైగా యివన్నీ పైకి చెప్పుకోవటానికి వీల్లేని ఖర్చులు. కట్నం ఏదో యింత మొత్తం అని కనబడుతూ వుంటుంది.



ఇప్పుడు చూడరాదూ? 'కట్నం తీసుకోలేదన్న' ఘనత వారికి దక్కింది, నాన్నకి ఖర్చు మాత్రం కట్నం యిచ్చి చేసిన అక్కయ్య పెళ్ళికి మించిపోయింది. పైకి చెప్పినా నమ్మరు. ఇంకా తక్కువ జరిగినట్లు గుసుపొకటి. తన ముందే ఫ్రెండ్సు "నీకేమే! లక్కీఫెలోవి. పైసా కట్నం లేకుండా భర్త వచ్చాడు" అంటుంటే తనకెంత వొళ్ళు మండేదో!

అయినా బావకెలా బుద్ధి లేదూ? ఆయనగారికి ఇష్టమయిన విషయాల్లో వొక్క మాటలో తల్లి నోరు మూయిస్తాడే! ఇప్పుడు మాత్రం తల్లి కష్టపెట్టుకుంటుందని చూస్తున్నాడుట.

ఈ డబ్బు తేవటానికి తన తండ్రి ఎంత కష్టపడాలి? ఆలోచనలతో మునిగిన శశి, తండ్రి మాటలకు యీ లోకంలోకి వచ్చింది.

"రేపే మూడువేలు అబ్బాయి పేర్న డ్రాఫ్ట్ పంపుతాను. ఇంత సామానూ హైద్రాబాద్ పంపటం కష్టం గదా!" అన్నారు రామయ్యగారు.

ఏదో నిశ్చయించుకున్నదానిలా మౌనంగా ఊఁ కొట్టింది శశి.

*

పోస్టులో డ్రాఫ్ట్‌తోపాటు శశి వుత్తరాన్ని ఆనందంగా అందుకుని చదవటం మొదలు పెట్టిన విశ్వం పని మెత్తని చెప్పుతో కొట్టినట్లయింది.

బావా!

నా నిర్ణయం నీకు కోపం తెప్పిస్తుందేమో. అయినా తప్పలేదు. నాకు మాత్రం రెక్కలు కట్టుకుని నీ దగ్గర వాలాలని, నీ గుండెలో తల దాచుకోవాలనీ ఉండదా? ఏం చెయ్యను. అత్తయ్య మనస్సు నువ్వు నొప్పించవు. నాన్నను నేను కష్టపెట్టలేను. నాన్న యీ మూడువేలు పంపటానికి మార్వాడి వద్ద అప్పు చేశారు. నీకు తెలుసుగా-అది ఎంత ప్రమాదమైందో, అందుకే నేను యిక్కడ ఓ ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా చేరాను. నెలకు రు. 150/-లు యిస్తారు. దీంతో నాన్న అప్పు తీర్చి నీ దగ్గర వాలుతాను. మనిషిని దూరమైనా మనసు మాత్రం నీ చుట్టూనే వుంటుంది. అర్థం చేసుకుంటావుకదూ!

ముద్దులతో
శశి □

—కాకాని ప్రమద

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-51' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు సెప్టెంబర్ 29 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 నవంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. వనిత
2. వలపు ఎక్కువ కావడం
3. విష్ణు వాహనానికి మరో పేరు
4. శబ్దమే కావచ్చు; శ్రావ్యమైన శబ్దం
5. కలిపిపి
6. కాడులు
7. గుడ్డముక్క
8. తొలి గుణింతంలోని తొలి అక్షరాలు
9. ప్రకాశించడం
10. అభినేత్రి
11. జంతువుల బందిఖానా'
12. ఇదీ ఒక వ్యాయామం లాంటిదే.
13. అడవికి రెండక్షరాల మాట
14. ఆలోచన
15. అనుకూలంగా వుండడం
16. పలు విధాలయిన జ్యోతిష గ్రంథాలూ కలగా పులగమైనాయి.

### ఆధారములు – నిలువు

1. వేలుకు పెట్టుకునేది
2. వలపు వంటిదే
5. మాసి వుండడం
9. కళ్ళూ, నోరూ, ముక్కు, చేతులు, కాళ్ళూ మొదలైనవన్నీ పద్ధతిలో కలిస్తే?—
11. భుజింపబడేది
12. ధైర్యం చూపగలిగే వాడు
13. భూపతి ఉండేది
14. ఆధారపడడం
17. గోరు
18. ముచ్చటపడ్డానికే మరో మాట
19. పొద్దు గుంకుతూ వుండగా—వెలుగు తగ్గుతూ వుండగా...ఏమిటది ?
20. ద్వితీయాక్షరాన్ని దాంతోనే నొక్కితే, 'ఆట'కు ఉపయోగపడుతుంది.
21. అద్దంలో వున్న పదమూడు లాంటిదే — తిరగబడింది.
22. వ్రతం ఆచరించడాన్నే ఇంకోకలా అనడం.

## వనిత మాటల కొలువు-51
## రూ 150 లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 17 | | 2 | 18 | | 19 |
| | | 3 | 20 | | | | |
| | | 4 | | | | 5 | |
| 6 | 21 | | | | 7 | | |
| 8 | | | 9 | | | 10 | |
| | | 11 | | | 12 | | |
| | 13 | | | 14 | | | 22 |
| 15 | | | | 16 | | | |

పేరు ________________________________

చిరునామా ________________________________

________________________________

________________________________

________________________________

సూపర్ బాల్ పెన్....హాయిగా, మెత్తగా రాసేది.

# కేమ్లిన్ సుప్రీమ్

దృఢమైనదిగా రూపొందించబడిన నాజిల్. సొగసైనది, అధునాతనమైనది, వెండిలా మిల మిల మెరిసేది-ఉన్నత శ్రేణికి చెందిన జాటర్ పెన్.

# కేమ్లిన్ 121 జాటర్

లక్షలాది ప్రజల అభిరుచులకు అనువుగా ఉండేలా రకరకాల రంగులలో దొరుకుతుంది. ఈ ధరలో దొరికే బాల్ పెన్‌లలో దీనిని మించినది మరేది ఉంటుంది!



S 796 Tel

U-PP-16 TEL

పాప సంరక్షణలో మీరేమన్నా లోపం చేస్తారా?

**చెయ్యరు! మేమూ చెయ్యం లోపం! పప్పూఫీడర్ మరియు నిపల్ ఋజువు చేస్తుందిదే**

ఫీడర్ : ఉత్తమ నాణ్యతగల గాజుతో తయారీ శుభ్రమైనది, మన్నిక గలది, సురక్షితమైనది. పూర్తిగా 225 మి.లీ. ఆహారం.

నిపల్ : ఉత్తమమైన దుర్గంధ రహితమైన రబ్బరుతో తయారీ, సరిసమానమైన ధారనిచ్చేది. 'ట్రాన్స్‌పెరెంట్' లేదా 'మోల్డెడ్'

మూత : మన్నుతుంది. లీక్‌ప్రూఫ్, పగిలిపోదు. దాంతోబాటే నిపర్-కవర్ ఉచితం.

Papu deluxe feeder

# పప్పూ

## ఫీడర్ మరియు నిపల్

సూదర్ • టంబ్లర్ • మిక్సర్

మమతకి మరొక గుర్తు.

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ద ధ | த | ದ ಧ | ദ ധ | द ध | દ ધ | ଦ ଧ |
| దా ధా | தா | ದಾ ಧಾ | ദാ ധാ | दा धा | દા ધા | ଦା ଧା |
| ది ధి | தி | ದಿ ಧಿ | ദി ധി | दि धि | દિ ધિ | ଦି ଧି |
| దీ ధీ | தீ | ದೀ ಧೀ | ദീ ധീ | दी धी | દી ધી | ଦୀ ଧୀ |
| దు ధు | து | ದು ಧು | ദു ധു | दु धु | દુ ધુ | ଦୁ ଧୁ |
| దూ ధూ | தூ | ದೂ ಧೂ | ദൂ ധൂ | दू धू | દૂ ધૂ | ଦୂ ଧୂ |
| దృ ధృ | — | ದೃ ಧೃ | ദൃ ധൃ | दृ धृ | દૃ ધૃ | ଦୃ ଧୃ |
| దౄ ధౄ | — | — — | — — | — — | — — | — — |
| దె ధె | தெ | ದೆ ಧೆ | ദെ ധെ | — — | — — | — — |
| దే ధే | தே | ದೇ ಧೇ | ദേ ധേ | दे धे | દે ધે | ଦେ ଧେ |
| దై ధై | தை | ದೈ ಧೈ | ദൈ ധൈ | दै धै | દૈ ધૈ | ଦୈ ଧୈ |
| దొ ధొ | தொ | ದೊ ಧೊ | ദൊ ധൊ | — — | — — | — — |
| దో ధో | தோ | ದೋ ಧೋ | ദോ ധോ | दो धो | દો ધો | ଦୋ ଧୋ |
| దౌ ధౌ | தௌ | ದೌ ಧೌ | ദൗ ധൗ | दौ धौ | દૌ ધૌ | ଦୌ ଧୌ |
| దం ధం | த் | ದಂ ಧಂ | ദം ധം | दं धं | દં ધં | ଦଂ ଧଂ |
| దః ధః | — | ದಃ ಧಃ | ദഃ ധഃ | दः धः | દઃ ધઃ | ଦଃ ଧଃ |

తమిళంలో మన ద, ధ లకు—ఒకే అక్షరం [த] వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

## క్రీడావని:

తమిళనాడు వనితా క్రికెట్ అసోసియేషన్ అధ్వర్యంలో ఇటీవల మద్రాసులో జరిగిన ఆరవ జాతీయ వనితా క్రికెట్ ఛాంపియన్ షిప్ పోటీలలో పశ్చిమబెంగాల్ జట్టు విజయం సాధించి 'జాతీయ ఛాంపియన్ అవార్డు'ను ఐదోసారిగా గెల్చుకున్నది. విజయం సాధించిన పశ్చిమబెంగాల్ జట్టు కేప్టెన్ కుమారి శ్రీరూపాబోస్. ప్రస్తుతం ఈస్టర్న్ రైల్వేలో ఉద్యోగం చేస్తూ, జర్నలిజం ఎం. ఏ. రెండో సంవత్సరం చదువుతూన్న శ్రీరూపాబోస్ — పశ్చిమబెంగాల్ తరఫున బాస్కెట్ బాల్, హాకీ, క్రికెట్ మొదలైన క్రీడల పోటీలలో లోగడ పాల్గొన్నది. ఆమెతో 'వనిత' జరిపిన ప్రత్యేక గోష్ఠిని ఇక్కడ పొందుపరుస్తున్నాము.



# శ్రీరూపా బోస్

**ఆస్ట్రేలియా, ఇంగ్లండ్ మొదలైన దేశాలతో పోల్చి చూసినపుడు భారత దేశంలో స్త్రీల క్రికెట్ అంతగా అభివృద్ధి చెందలేదనే చెప్పాలి. దీనికి కారణం ఏమిటి?**

మనదేశంలో క్రికెట్ ఆడడం ప్రారంభించినది 1973లోనే. ఈ ఆరేళ్ళ స్వల్ప వ్యవధిలో మన క్రీడాస్థాయి ఇతోధికంగా పెరిగిందనే అనుకుంటాను. మునుముందు మరింత ఉన్నతస్థాయిని అందుకోగలమనే నమ్ముతున్నాను.

**మనదేశం స్త్రీలలో క్రికెట్ క్రీడ సరైన ప్రాచుర్యం పొందలేదు కదా? ఇది ఎందువల్ల? దీనికేం చెయ్యాలి?**

ఇప్పుడిప్పుడే భారతీయ వనితలు అన్ని క్రీడల లోనూ పాల్గొనడానికి ఆయత్తమౌతున్నారు. అందులోనూ క్రికెట్ మరీ లేటెస్ట్. అంచేత పాఠశాలల లోను, కళాశాలలలోనూ క్రికెట్ మీద ఆసక్తి వున్న వారిని ప్రోత్సహించాలి.

**పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం క్రికెట్ క్రీడా ప్రగతికి ఎలాంటి ప్రోత్సాహం అందిస్తున్నది?**

"స్పోర్ట్స్ కౌన్సిల్" తరఫున జరపబడే శిక్షణా శిబిరాలు మాకెంతో ఉపయోగకరంగా వున్నాయి. క్రీడాకారులకు ప్రత్యేక ఉద్యోగ అవకాశాలు కూడా ప్రభుత్వం కల్పించింది.

క్రికెట్ శిక్షణ విషయంలో ప్రముఖ క్రీడాకారుల

పశ్చిమ బెంగాల్ జట్టు



**నుంచి మీకేమైనా సహాయం లభిస్తున్నదా ?**

పశ్చిమ బెంగాల్‌కు సంబంధించినంతవరకు-ప్రముఖ క్రీడాకారుడు శ్రీ కార్తిక్ బోస్ మాకెంతో సహాయ సహకారాలు అందజేస్తున్నారు. మరి ఇతర రాష్ట్రాల సంగతి నాకు తెలియదు.

**జాతీయ స్థాయిలో ప్రత్యేకంగా స్త్రీలకంటూ ఏమైనా శిక్షణ ఇవ్వబడుతోందా ?**



**శ్రీరూపాబోస్**

సంవత్సరానికోసారి ఒక నెలపాటు శిక్షణా శిబిరాలు జరపబడతాయి. వీటిద్వారా చక్కగా ఆడే వారు కూడా మరింత బాగా ఆడడానికీ శిక్షణ పొందడానికీ అవకాశం వుంటుంది.

**ఇవాళ భారతదేశంలో వనితా క్రికెట్ ఎదుర్కొనే సమస్యలు ఏమిటి ?**

ప్రారంభ కాలంలో ప్రతి విభాగానికి-ఆ మాటకొస్తే ప్రతిపనికీ ఏవో సమస్యలు ఎదురౌతూనే వుంటాయి. కాని పోను, పోను అవన్నీ సర్దుకుపోతాయి.

**భారతీయ స్త్రీ క్రికెట్ సంస్థ – భారతీయ క్రికెట్ సంస్థతో విలీనం కావడం గురించి మీ అభిప్రాయం ఏమిటి ?**

విలీనం కావడం అవసరం లేదనుకుంటాను.

**రంజీ ట్రోఫి; రాణీ కప్, దులీప్‌ట్రోఫి లాంటి పోటీలు స్త్రీలకు కూడా ప్రత్యేకంగా జరపడంవల్ల ప్రపంచ స్థాయిలో ఉత్తమ క్రీడాకారిణులు మన దేశంలో కూడా తయారు కావడానికి దోహదం చేస్తుందా ?**

తప్పకుండా. మనదేశంలో అప్పుడప్పుడు జరిగే జాతీయస్థాయి పోటీలవల్ల దేశం నలుమూలల నుంచి వచ్చే క్రీడాకారిణుల శక్తి సామర్థ్యాలను ప్రత్యక్షంగా చూడడానికి సాధ్యమవుతుంది. కొత్త కొత్త పద్ధతులను నేర్చుకోడానికి అవకాశం ఏర్పడుతుంది. వారి మధ్య మంచి అవగాహన, సంఘీభావం ఏర్పడడానికి దోహదం చేస్తుంది. ఇలాంటి టోర్నమెంట్స్ అంతర్జాతీయ స్థాయిలో కూడా విరివిగా జరగాలని ఆశిస్తున్నాను.

**భారతీయ వనితా క్రికెట్ జట్టు విదేశాల జట్టులతో ఎప్పుడైనా పాల్గొన్నాయా ?**

ఆస్ట్రేలియా, వెస్ట్ ఇండీస్, ఇంగ్లండ్, న్యూజిలాండ్ మొదలైన దేశాల జట్లతో పాల్గొని ఎంతో నేర్పును ప్రదర్శించి ప్రశంసలు అందుకుంది.

**భారతీయ వనితా క్రికెట్ భవిష్యత్తు గురించి....**

తప్పకుండా బావుంటుంది. ఎందుకంటే ఇవాళ స్త్రీలు క్రికెట్ క్రీడపట్ల ఎంతో ఆసక్తి కనబరుస్తూ ఉత్సాహంగా పాల్గొంటున్నారు.

**మీకు క్రికెట్ మీద ఆసక్తి, ఉత్సాహం ఎలా కల్గింది ?**

మామూలుగా క్రికెట్ ఆట చూస్తున్నప్పుడు నాకు కూడా అలా అలా ఆడాలనే ఉత్సాహం కల్గింది. అందువల్ల 1973 సం॥ నవంబరులో క్రికెట్ ప్రారంభించగానే అందులో చేరాను. ఇంతవరకూ ఐదుసార్లు పోటీలలో పాల్గొన్నాను.

**మీ అభిమాన క్రీడాకారులు ఎవరు ?**

క్రీడాకారులలో విశ్వనాథ్; క్రీడాకారిణులలో మా చందనాముఖర్జీ నా అభిమానులు.

**క్రికెట్‌లో పాల్గొవాలనే వనితలకు మీరిచ్చే సలహా ఏమిటి ?**

ఏ రంగంలో పేరు సంపాయించాలన్నా అందుకు కావలసిన ఉత్సాహం కన్నా, ఎంతో ఎక్కువ కృషి, నిరంతర అభ్యాసం కావాలి. మనమూ ఒక గొప్ప క్రీడాకారిణి కావాలన్న తపన, దీక్ష ఎప్పుడూ వుండాలి. □



వర్జీనియా (అమెరికా)లో ఓ యువకుడున్నాడు. అతనికో పక్కింటమ్మాయి వుంది. ఓ రోజు యువకుడు కాస్తా ఆ పక్కింటమ్మాయితో మాట్లాడుతూ చనువుగా భుజంమీద చెయ్యి వేశాడు. దాంతో ఆ అమ్మాయికోపం వచ్చి అధికారులకి ఫిర్యాదు చేసింది. న్యాయాధికారి ముందు నిలబడి ఆ యువకుడు యిలా అన్నాడట – 'అయ్యా....స్త్రీలకి మగవారితో సమాన హక్కులున్నాయట కదా. వారి మధ్య తేడా లేదట కదా. అందుకే నేను నా స్నేహితుడి భుజం మీద చెయ్యివేసినట్లే ఆమె మీద కూడా వేశాను. ఇందులో తప్పేముంది?'

కాని 'ఆడపిల్లమీద చెయ్యివేస్తావా–హన్న' అని మందలించి ఓ అరవై రోజులు జైలు శిక్ష లేక రెండువేల రూపాయలు (మన కరెన్సీలో) జుల్మానా, వేశాడు న్యాయాధిపతి. అంతటితో వూరుకున్నాడా – స్త్రీ స్వేచ్ఛా వుద్యమం గురించి చిన్న సైజు వుపన్యాసం కూడా భరించాల్సొచ్చిందా యువకుడు. "స్త్రీ స్వేచ్ఛా వుద్యమం అనేది వున్న మాట, మునుపటికన్న స్త్రీల సమానత అధికమైన మాట–నిజమే. కాని అంతమాత్రాన పురుషులకి స్త్రీలపట్ల ప్రత్యేకమైన 'స్వేచ్ఛ' అంటూ లభించదు-ఆవతలి వ్యక్తి అంగీకరిస్తే తప్ప" అన్నాడు న్యాయాధిపతి.

విశాఖపట్నం నార్తు లయన్ లేడీస్ క్లబ్బు జూలై 4వ తేదీన మెసానిక్ లాడ్జిలో నిర్వహించిన 79-80 సం॥ కార్య నిర్వాహకవర్గపు ప్రతిష్టాపన దృశ్యం లయన్ లేడీస్ టి. సరస్వతీదేవి, జి. వై. చంద్రమణి, వి. కృష్ణవేణి అధ్యక్షురాలు, కార్యదర్శి, కోశాధికారులుగా పదవీ స్వీకారం చేసారు. విలేకరి.






శ్రీకాకుళంలో ఇటీవల రోటరీ ఇన్నర్‌వీల్ క్లబ్బు ఆరంభమైంది. ఈ క్లబ్బుకు అధ్యక్షురాలిగా శ్రీమతి బండారు విమలా రామచంద్రరావు, (మధ్యన వున్న వారు) కార్యదర్శిగా శ్రీమతి పి. మహాలక్ష్మి చల పతిరావు (కుడివైపు వున్నవారు) కోశాధికారిణిగా శ్రీమతి బరాటం అరవింద గోవిందరావు (ఎడమ వైపు) ఎన్నికైనారు. —టి

విజయవాడ ఇన్నర్‌వీల్ క్లబ్‌వారు ఇటీవల పిల్లల జైలు (రిసెప్షన్ హోమ్) అధికారికి ఆటవస్తువులను బహూకరించారు. ఈ చిత్రంలో ఆట వస్తువులను క్లబ్ తరఫున అందజేస్తున్న శ్రీమతి జమునా రమణ రావు, క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి జయశ్రీ వున్నారు. —మీరా



## వార్తావనిత

రాజమండ్రి జెసిరెట్స్‌వారు అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా మునిసిపల్ ఎలిమెంటరీ పాఠశాల బాలబాలికలకు పుస్తకాలు, పెన్సిళ్ళు పంచిపెట్టారు. ఈ చిత్రంలో కుడి నుంచి ఎడమకు- అధ్యక్షురాలు బి. సిహెచ్. రాఘవమ్మ, కార్యదర్శి డి. విజయలక్ష్మి, కె. అనుపమ. కోశాధికారిణి బి. సుబ్బలక్ష్మి, వి. వి. జయలక్ష్మి, బి. వరలక్ష్మి. కె. కనకసుందరి వున్నారు.






మధ్యప్రాచ్య దేశాలకు వెళ్లిన సాంస్కృతిక బృందానికి నాయకురాలుగా భారత ప్రభుత్వం కుమారి కె. శోభానాయుడుని ఎన్నిక చేసింది. మద్రాసు కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీకి చెందిన శోభా



ఎనమలకుదురు గ్రామంలోని లంబాడీ స్త్రీలు ఇటీవల శ్రీరామలింగేశ్వర గిరిజన నృత్య సంఘాన్ని స్థాపించారు. వారికి రాష్ట్ర - యువజన సంక్షేమశాఖ వారి ద్వారా ఐదువేల రూపాయల విలువగల దుస్తులను విజయవాడ సబ్ - కలెక్టరు శ్రీమతి ఊర్మిళా సుబ్బారావు పంచి పెట్టారు. ఆనాటి సభకు శ్రీమతి సరస్వతీగోరా అధ్యక్షత వహించారు.

—మల్లిడి కనకరత్నం

విశాఖపట్నం ఇన్నర్‌వీల్ క్లబ్బు మహిళలు తమ పన్నెండవ ప్రతిష్ఠాపనోత్సవాన్ని కిన్నెరా (ఓపెన్ ఎయిర్) ఆడిటోరియంలో జూలై 15వ తేదీన వైభవంగా జరుపుకున్నారు. సభకు శ్రీమతి కమలాచిత్రా అధ్యక్షత వహించగా, ఆంధ్ర విశ్వవిద్యాలయం లోని ఆంగ్ల భాషా విభాగానికి ప్రధానాధ్యాపకురాలు శ్రీమతి ఇలారావు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. అధ్యక్షురాలుగా శ్రీమతి లక్ష్మి ప్రభాత్‌కుమార్, కార్యదర్శిగా శ్రీమతి సునీతా జురానీ, కోశాధికారిగా శ్రీమతి కమలా శివశంకర్ - తదితరులు పదవీ స్వీకారం చేసారు. శ్రీమతి సునందా ఆనంద్ హిందీ గీతంతో సభ సమాప్తమయింది. విలేకరి.





నాయుడుతోబాటు ఈ చిత్రంలో, సాంస్కృతిక బృందం సభ్యులు, సాంస్కృతిక కార్యకలాపాల నిర్వాహకులు శ్రీ పి. రమణారెడ్డి, శ్రీ పి. శివారెడ్డి కూడా వున్నారు.

విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్బు రామ్‌నగర్ లయన్సు కమ్యూనిటీ హాలులో జూలై మొదటి తేదీన జరిగిన ప్రతిష్ఠాపనోత్సవంలో నూతన సంవత్సరానికి అధ్యక్షురాలు, కార్యదర్శి, కోశాధికారులుగా లయన్ లేడీస్ కె. చంద్రకళ, ఎ. హేమలత, ఎస్. విజయలక్ష్మి పదవీ స్వీకారం చేసారు. గత సంవత్సరపు అధ్యక్షురాలు శ్రీమతి గ్రంధి విజయలక్ష్మితో శ్రీమతి చంద్రకళ వేదికను అలంకరించిన దృశ్యం.

విలేకరి.



తిరుమల మహిళా సేవా మండలివారు ఇటీవల తమ ప్రధమ వార్షికోత్సవ సందర్భంగా ప్రముఖ దాత, సంఘసేవకుడు అయిన శ్రీరేబాల లక్ష్మి నరసారెడ్డిని సన్మానించారు. మహిళా మండలి ఆధ్వర్యంలో ఒక కుట్టుపని కేంద్రము, గ్రంధాలయం వున్నాయి.





"మానసిక స్తబ్ధత – బుద్ధిమాంద్యం" అనే విషయంపై విశేష కృషిచేసే నిమిత్తం పశ్చిమ జర్మనీ ఆహ్వానాన్ని అందుకొని ఒక సంవత్సరం పాటు విదేశ పర్యటన గావించుకొని, స్వదేశానికి యీ మధ్యనే తిరిగి వచ్చిన శ్రీమతి టి. సరస్వతీ దేవిని అభినందిస్తూ జూలై 24వ తేదీన జరిగిన విశాఖపట్నం లయన్సు క్లబ్బు సర్వసభ్య సమావేశంలో పలువురు సభ్యులు ప్రసంగించారు. సభకు అధ్యక్షత వహించిన లయన్ జి బ్రహ్మాజీ, కార్యదర్శి లయన్ ఎమ్. సత్యనారాయణ శ్రీమతి సరస్వతి సమాజానికి చేస్తున్న నిస్వార్థ సేవను కొనియాడారు.

శ్రీమతి సరస్వతి మాట్లాడుతూ చిన్ననాటి నుండి తనకు సంఘ సేవ మీద మక్కువగా ఉండేదని, ఏదో విధంగా సమాజానికి తను ఉపయోగ పడాలని, జీవితంలో ఏదో ఒక ప్రయోజనకరమైన పని చెయ్యాలని అభిలాష ఉండేదని, తనకి యీ నాటికి ఒక మంచి అవకాశం దొరికినందుకు తను ఎంతో గర్విస్తున్నానని అన్నారు.

జీవితంలో తనకు రెండు మహదవకాశాలు లభించాయని, మొదటిది "రోటరీ ఫౌండేషన్ స్కాలర్‌గా 1975-76 సంవత్సరంలో భారత దేశం తరఫున ఎన్నికై అమెరికన్ స్టేట్సుకి పంపబడి సంవత్సరంపాటు వికలాంగులకు శారీరకంగానూ, మానసికంగానూ ఆధునిక పద్ధతులలో చికిత్స చేయడంలో ఉన్నత విద్యను అభ్యసించడం", రెండవది — "పశ్చిమ జర్మనీ ఆహ్వానంపై 1978–79 లో జర్మనీ, ఇంగ్లండు, ఆస్ట్రియా దేశాలలో ఒక సంవత్సరం పాటు "మెంటల్ రిటార్డేషన్" (బుద్ధిమాంద్యం) అనే మనోరుగ్మతకు గురియైన అభాగ్యులకు ఆయా దేశాలలో చేస్తూన్న ప్రక్రియలు, అక్కడ లభిస్తూన్న ప్రత్యేక శిక్షణలను అవగాహన చేసుకొని తరిఫీదు పొందటం" - అని అన్నారు.

ఆ అనుభవాలను ఉపయోగించుకుని మన ప్రాంతాలలో యీ మనోరుగ్మతతో బాధపడుతున్న వారికి (ముఖ్యంగా పిల్లలకు) లాలనా, పాలనా అందజేసి, వారిని సమాజంలో సాటి మానవులుగా తీర్చిదిద్ది, సంఘంలో నలుగురితోపాటుగా ప్రయోజకులను చెయ్యాలనేదే తన జీవితాశయం అనీ – ఆ సదుద్దేశ్యంతో ఒక కేంద్రాన్ని మన దేశంలో నెలకొల్పుదామనే సత్సంకల్పాన్ని తను పశ్చిమ జర్మనీ సంస్థ (లేబెన్స్ హిల్‌ఫే-లాన్‌దవ్)లో తెలియజేసినపుడు, ఆ సంస్థ అధ్యక్షుడు డా॥ విల్‌బర్ట్ చాలా సంతోషించారని, అటువంటి ప్రయత్నానికి తమ సంస్థ పూర్తి సహాయ, సహకారాలను అందజేస్తుందని తెలియజేసారని, అందుచేత త్వరలోనే ఇండో – జర్మన్ సహకారంతో కేంద్రాన్ని స్థాపించటం జరుగుతుందని, దాని నామకరణానికి కూడా వారి సంస్థ బేనర్‌ను, సింబల్‌ను వాడుకోవటానికి అనుమతిని యిచ్చేరని తెలియజేసారు. అట్టి కేంద్రాన్ని నిర్వహించడానికి ఆర్థికంగా కొంతకాలం సహాయం చేయడానికి పశ్చిమ జర్మనీలోని లయన్సు క్లబ్బులు కూడ ముందుకు వచ్చాయని, నార్డన్, జౌరిష్ పట్నాలలోని క్లబ్బులు సంవత్సరానికి 1000 డిమార్కులు (1 డిమార్కు = 4 - 20 రూ.లు) చొప్పున యిస్తామని మాట ఇచ్చాయని అన్నారు. జర్మన్ సంస్థ తరఫున నెలకు 1500 డిమార్కులు అందుతాయని అన్నారు. అదిగాక జౌరిష్, ఔక్స్‌బర్గ్ పట్నాలలోని "లేబెన్స్ హిల్ ఫే" అనుబంధ సంస్థలు సంవత్సరానికి రెండు వేలు, ఒక వెయ్యి డిమార్కుల చొప్పున అందజేస్తామని మాట యిచ్చారని అన్నారు. ఈ కేంద్రాన్ని డా॥ విల్‌బర్ట్ స్వయంగా వచ్చి ప్రారంభిస్తారని కూడ అన్నారు.

—విలేకరి



గుత్తిలో ఇటీవల రాయల కళా గోష్ఠి ఆధ్వర్యంలో సాహిత్య సభలు జరిగాయి. 'గంగావతారణ శివ తాండవ' కావ్యాన్ని రచించిన శ్రీమతి కొలకలూరి స్వరూపారాణిని ఆ సందర్భంగా జానపద కవి శ్రీ రాప్తాటి ఓబిరెడ్డి సత్కరించారు.

విజయవాడ వాసవీ మహిళా మండలివారు ఇటీవల స్త్రీలకు వృత్తి విద్యా కేంద్రాన్ని ప్రారంభించారు. సాంఘిక సంక్షేమ సలహా సంఘం అధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సల్ ఈ కేంద్రాన్ని ప్రారంభించారు. మండలి ఉపాధ్యక్షురాలు శ్రీమతి చెన్నుపాటి విద్య, భారత మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి సీతా కామరాజ్ కూడా ఈ చిత్రంలో వున్నారు.

—మల్లిది కనకరత్నం



# ఇటలీ చౌచౌ



కావలసిన పదార్థాలు : 2 లేక 3 బుంగ పచ్చి మిరపకాయలు (సిమ్లా మిర్చి) 1 మీడియం సైజు కాలిఫ్లవర్, $\frac{3}{4}$ కప్పు బటాణీలు, 6 టొమాటోలు (చిన్నవి), 6 వంకాయలు (చిన్నవి), 1 చిన్న సైజు బెంగుళూరు వంకాయ, 4 ఉల్లిపాయలు, 1 చిన్న సైజు క్యాబేజీ, 1 క్యారట్, 1 కప్పు నువ్వుల నూనె గాని వేరుశెనగ నూనె గానీ, 1 వెల్లుల్లి, 8 లేక 10 బ్రెడ్ స్లైసులు. తగినంత ఉప్పు, మిరియపు పొడి.



తయారు చేయవలసిన విధానం : ముందుగా ఉల్లిపాయలు, క్యారట్ — ముక్కలుగా తరిగి, క్యాబేజీ కోరుకుని విడిగా వుంచుకోవాలి. ఆ తరువాత బాణలిగానీ, పాత్రగానీ తీసుకుని అందులో నూనె పోసి, నూనె కాగనివ్వాలి. అందులో ఉల్లిపాయ, వెల్లుల్లి ముక్కలు వేసి కొద్దిసేపు వేగనివ్వాలి. అవి బాగా వేగిన తర్వాత వాటికి కాయగూరలన్నిటినీ చేర్చి బాగా కలియదియ్యాలి. ఈ కూరలన్నీ ఉడికేదాకా మధ్య మధ్యలో కలియదీస్తూ స్టవ్ మీద వుంచాలి. ఇలా ఉడుకుతూ వుండగానే దానికి ఉప్పు చేర్చాలి. ఆ తర్వాత బాణలి కిందకి దించి మిరియపు పొడి చల్లుకోవాలి. బ్రెడ్ ముక్కల్ని త్రికోణంలా కట్ చేసుకుని చౌచౌ చుట్టూ అమర్చితే చూడటానికి బాగుంటుంది. బ్రెడ్‌తో అద్దుకుని వేడి మీద తింటే ఈ చౌచౌ ఎంతో రుచిగా వుంటుంది. దీని మీద టొమాటో సాస్ గానీ పచ్చిమిరప కారం (కాస్త పలచగా చేసినది) గానీ చల్లుకుని తింటే కూడా రుచిగా వుంటుంది. ఇటలీ దేశస్థులు అధికంగా చేసుకునే వంటకం యిది.

—శోభా రామ్‌జీ



# ఆడపిల్ల

జీతం తీసుకుని లెఖ్ఖపెట్టుకుంటూ సీటు దగ్గరకి వచ్చి, అక్కడే ఫైల్సు సర్దుతున్నట్టు నటిస్తూ నిల్చున్న ప్యూన్ వెంకటస్వామిని చూసి గతుక్కుమన్నాను. నన్ను చూడగానే, "నమస్కారం సార్!" అన్నాడు. అది వాడి 'కోడ్‌వర్డ్!' అలాగంటే "నా వడ్డీడబ్బులు యిలా పడెయ్యి!" అని అర్థం! గవర్నమెంటాఫీసులో పని చేసే వుద్యోగి వడ్డీ వ్యాపారం చెయ్యకూడదనే రూలుంది గనక వాడు పబ్లిగ్గా అడగడు. వాడికీ వుద్యోగం సైడ్ బిజినెస్ లాంటిది. వాడి మెయిన్ బిజినెస్ వడ్డీ వ్యాపారం! నాలాంటి మధ్యతరగతి కుటుంబీకులంతా వాడి కస్టమర్స్! నిజానికి పోయిన నెలదాకా నాకు వాడి వ్యాపారం సంగతే తెలీదు. వాడి కస్టమర్సంతా వాడి రహస్యాన్ని అంత జాగ్రత్తగా కాపాడతారన్నమాట! పోయిన నెల మా పెద్ద అమ్మాయి పెళ్ళికి ప్రావిడెంట్ ఫండులో తీసుకున్న లోనూ, యింటి మీద తీసుకున్న అప్పు చాలక అవస్థపడుతూ వుంటే, స్నేహితుడు రామారావు వెంకటస్వామిని గురించి చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాను. వాడు రెండు వేలు రెండు నిముషాల్లో సర్దగలడంటే నాకెంతమాత్రం నమ్మకం కలగలేదు. కాని పొద్దున్న రామారావు చెప్పడం, సాయంత్రం ఆఫీసు వదిలే వేళకి నా చేతిలో డబ్బు పడటం చూసి, వాడి శక్తిసామర్థ్యాలని చాలా తక్కువగా అంచనా వేసినందుకు నేను చాలా నొచ్చుకున్నాను. వడ్డీ వసూలు చేసుకునే విషయంలో వాడి పద్ధతులు ముందే రామారావు చెప్పి వుండటంచేత వాడు 'నమస్కారం సార్!' అనగానే వెర్రినవ్వొకటి నవ్వి, పేకెట్టు నుంచి వంద కాగితాలు రెండు తీసి వాడి చేతిలో పెట్టాను. వాడు వినయంగా వాటి నందుకుని నాకో థేంక్స్ పారేసి వెళ్ళిపోయాడు. వాడు వెళ్ళాక కవర్లో నుంచి తొంగి చూస్తున్న మరో వంద కాగితాన్నీ, కాసిన్ని పది రూపాయల నోట్లనీ చూడగానే నా గుండె ఆగినంత పనైంది. ఈ డబ్బుతో నెలంతా గడపడం యీ రోజుల్లో మానవమాత్రుడి తరమా? పాలవాడు, కూరలమ్మి, పచారీకొట్టు షావుకారూ, పెద్దమ్మాయి పెళ్ళికి చీరలు సప్లైచేసిన బట్టల మూటల వ్యాపారి వరసగా సినిమాలో విలన్స్‌లాగా నవ్వుతూ నా ముందు నిల్చున్నట్టై నాకు ముచ్చెమటలు పోశాయి. ఈ డబ్బు యెవరికి యివ్వను? ఎవరి బాకీ చెల్లుపెట్టగలను? ఏ ధైర్యంతో చేశానీ అప్పులన్నీ?

ఎప్పటిలాగా రెండు జీతాలూ అందుతాయనేకదూ? వరలక్ష్మికి పెళ్ళైపోయిందనీ, వరాలు జీతం అల్లుడికి చెందుతుందనీ నాకెందుకు తట్టలేదూ? పోనీ వరాల్ని సగం జీతం కొంత కాలంపాటు సర్దమంటే? ఛీ! ఛీ! ఇంతకాలం ఆడపిల్ల సంపాదన తిన్నది చాలక పెళ్ళయాక కూడా యే మొహం పెట్టుకుని అడగను? ఆఁ! అడిగితే తప్పేముంది? ఆడపిల్లయినా మొగపిల్లాడిలాగా చదివించేను. నానా గడ్డీకరిచి, అగ్గమైనవాళ్ళ కాళ్ళూ పట్టుకుని యీ ఆఫీసులోనే ఉద్యోగం వేయించాను. నాకా మాత్రం హక్కు లేదూ? ఎందుకు లేదూ? నిక్షేపంలాగా వుంది. ఇప్పుడే దాని సెక్షన్‌కి వెళ్ళి అడుగుతాను. ఈపాటికి వరాలు కూడా జీతం తీసుకునే వుంటుంది.

క్రిందటి నెలదాకా "ఇంత డబ్బు నా దగ్గర వుంచుకోవాలంటే పారేస్తానేమోనని భయంగా వుంటుంది నాన్నా!" అంటూ జీతం తెచ్చి నాకు యిచ్చేసేది. ఈ నెల దానికా భయం లేదేమో! ఏమైనా ఆడపిల్లలు, ఆడపిల్లలే! పెళ్ళవగానే నా సంసారం, నా మొగుడూ అనుకుంటారుగానీ, యీ తండ్రి ముండావాడు నానా గడ్డీకరిచి నాకో మొగుణ్ని సంపాదించి పెట్టాడే, వాడి బాధల్లో మనమూ పాలు పంచుకోవాలే – అన్న జ్ఞానం వాళ్ళకి వుండదు. ఛా! ఏమిటింత ఘోరంగా ఆలోచిస్తున్నానూ? కన్న తండ్రికి రావల్సిన ఆలోచనలేనా యివి? ఏనాడైతే దాన్నొక అయ్య చేతిలో పెట్టానో ఆనాడే అది పరాయిపిల్ల అయిపోయింది. ఆ పిల్ల నా కష్టసుఖాల్లో పాలు పంచుకోవాలనుకోవడం యెంత నీచం? నేనే పది రూపాయలు దాని చేతిలో పెట్టాల్సిందిపోయి, దాని జీతం తెచ్చి నా చేతిలో పొయ్యలేదని యెలా అనుకోగలుగుతున్నాను? నా ఆవేశం చప్పున చల్లారిపోయింది. ఇంకా

నయం! గబుక్కున వెళ్ళి అడిగానుకాదు! ఎంత బాధపడి వుండేదో?

"నాన్నా!" అన్న పిలుపు విని ఆలోచనల నుంచి తేరుకుని తలెత్తి చూశాను. వరాలు యెదురుగా నిల్చుని వుంది. ఎంతసేపయిందో వచ్చి! నా ఆలోచనల్ని పసిగట్టలేదుకదా?

"ఏవిటమ్మా! యిలా వచ్చావు?" అన్నాను కాస్త ఖంగారుగా.

"ఇంత డబ్బు దగ్గరుంటే పారేస్తానేమోనని భయంగా వుంది నాన్నా! నీ దగ్గరుంచు!" అంది తన జీతం వున్న కవర్ని నా ముందుకి చాపుతూ! తెల్లబోయి చూశాను. నిజానికి వరాలు డబ్బు పారేసుకుంటాననే భయంతో జీతం తెచ్చి నాకివ్వడం లేదని నాకు తెలుసు. ఎందుకంటే మా అల్లుడు కూడా దాని సెక్షన్‌లోనే పని చేస్తున్నాడు. డబ్బు పారేసుకుంటాననే భయమే దానికి వుంటే, తిన్నగా జీతం తీసుకెళ్ళి అతనికిచ్చి వుండేది.

"ఏవిటి నాన్నా? అలా చూస్తున్నావు? ప్రతి నెలా నీ దగ్గరకి యిలాగే జీతం తెచ్చి యిచ్చేదాన్ని కదా? ఇవాళేమిటి వింతగా చూస్తున్నావు?" అంది వరాలు చిరునవ్వుతో! నాకు నోటమాట రాలేదు. దాని ఆలోచన నాకు అర్థమైంది. ఈ నా బంగారు తల్లి గురించి నేనెంత ఘోరంగా ఆలోచించాను? నేనెలాంటి తండ్రిని? సిగ్గుతో నా తల వాలిపోయింది.

"వద్దు! తల్లీ! తీసుకెళ్ళి అల్లుడిగారికియ్యి! న్యాయంగా నీ జీతం యికముందు అతనికి చెందాలి! నా వుద్దేశం మీ యిద్దరికీ చెందాలి." అన్నాను తడబడుతూ! పక్కనున్న ఓ కుర్చీని లాక్కుని సావకాశంగా కూర్చుంది వరాలు.

"నువ్వెన్నోసార్లు 'నా పెద్ద కొడుకువి నువ్వే తల్లీ' అనేవాడివి! ఆ మాట అప్పుడే మరిచి పోయావా నాన్నా! నిజంగా నేను నీ పెద్ద కొడుకునే అనుకునివుంటే పెళ్లవగానే 'నీ జీతం తీసుకెళ్ళి నీ భార్యకియ్యి' అని నువ్వు చేప్పేవాడివా? నా చెవులు పిండి నా జీతం తీసుకుని వుండేవాడివి! అవునా? మన యిద్దరి జీతాలతోనే యేదో ఫరవాలేదన్నట్టు గడిచే సంసారం నీ వొక్కడి సంపాదనతో గడవటం కష్టమని నాకు తెలీదా? అదిగో! నీకప్పుడే కోపం వచ్చేస్తోంది! 'నువ్వు వుద్యోగంలో చేరకముందు, నా ఒక్కడి రెక్కల కష్టంతో మిమ్మల్ని పోషించలేదా?' అని అడగ బోతున్నావు! అప్పటి పరిస్థితులు వేరు. పిల్లలందరం చిన్నవాళ్ళం! పైగా అన్ని వస్తువులూ కాస్త చవగ్గానే వుండేవి! నా పెళ్ళికి యెంత మొత్తుకున్నా వినకుండా, 'యింట్లో జరిగే మొదటి శుభకార్యం' అంటూ అప్పులు చేసి బోలెడంత ఖర్చు చేశావు........"

వరాలు చెప్తున్న ఒక్కొక్క మాటా నాకో సమ్మెట పోటులా తగులుతోంది. ఆమెని వారించే శక్తి లేనట్టు గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాను.

"........నీ అల్లుడికి తెలీకుండా జీతం తెచ్చి నీకిస్తున్నానేమోనని భయపడకు! మన పరిస్థితులన్నీ ఆయనకి చెప్పి ఆయన అనుమతితోనే నీకి డబ్బు యిస్తున్నాను. మధుకి ఉద్యోగం దొరికాక, నువ్వు యివ్వమన్నా నేను యివ్వను. ఏమిటి నాన్నా? ఇన్ని విధాలుగా చెప్తున్నా యింకా ఆ డబ్బుని పాముని చూసినట్టు చూస్తున్నావు?"

"అమ్మా! వరాలూ........" నా కంఠం దుఃఖంతో పూడుకుపోయింది. వరాలు పుట్టినప్పుడు, 'ఆడపిల్లా!' అని నేను విరాళగా కళ్లు తేలవేస్తే–

"ఆడపిల్లా! అని అలా కళ్లు తేలేస్తావేమిట్రా? ఏనాటికైనా కన్నవారికోసం, యేం చెయ్యగలిగినా, చెయ్యలేకపోయినా వాళ్ళ కష్టాల్లో యిన్ని కన్నీళ్ళయినా కార్చేది ఆడపిల్లేరా వెర్రి వాడా!" అన్న మా అమ్మ మాటలు జ్ఞాపకానికి వచ్చాయి!

---

విజయవాడ రైల్వే మహిళల సంస్థ–రైల్వే ఉద్యోగుల భార్యలు, వారి పిల్లల సంక్షేమానికి కృషి చేస్తున్నది.

# శ్రీమతి హేమాదాస్



స్త్రీలకు తీరిక సమయాలలో కుట్టు పనులు, అల్లికలు, బొమ్మల తయారీ మొదలైన చేతి వృత్తులలో ఈ సంస్థ శిక్షణ ఇస్తున్నది. కుట్టుపని నేర్చుకుని రోజుకు ఇన్నిబట్టలు అని లెక్క ప్రకారం కుట్టి ఇస్తే నెలకు ఒక్కొక్క సభ్యురాలు రు 100ల వరకు సంపాదించవచ్చు. ఈ సంస్థకు శ్రీమతి హేమాదాస్ అధ్యక్షురాలు. విజయవాడ డివిజన్‌లోని రైల్వే ఉద్యోగుల భార్యలు, పిల్లలకు ఈ సంస్థ వారు తుపాను వచ్చినప్పుడు వస్తురూపంలో, ధనరూపంలో సహాయం అందజేశారు.

ఈ సంస్థ విజయవాడలో మూడు పాఠశాలలను కూడా నడుపుతున్నది. నర్సరీ నుండి ప్రైమరీ వరకు తరగతులు గల స్కూలులో విద్యార్థుల సంఖ్య 1050. ఇందులో ఎల్.కె.జి. యు.కె.జి తరగతులలో 18 సెక్షన్లు ఉన్నవి. రైల్వే ఉద్యోగుల పిల్లలకు ఈ పాఠశాలల్లో ప్రవేశం లభిస్తుంది. ఇటువంటి స్కూల్సు బిట్రగుంట, రాజమండ్రి, విజయవాడలలో వున్నాయి.

శ్రీమతి హేమాదాస్ విజయవాడ డివిజనల్ సూపరింటెండెంట్ శ్రీ ఎం. సి. దాస్ భార్య. మద్రాసు, కాకినాడ, విజయవాడలో చదువుకున్నారు. 1961 లో ఆమెకు వివాహం జరిగింది. సంతానం యిద్దరు అమ్మాయిలు.

వివాహానికి ముందు కూడా ఆమె సాంఘిక సేవా కార్యక్రమాలలో ఎంతో ఆసక్తితో పాల్గొనేవారు. స్త్రీకి విద్య ఎంతో అవసరమని స్త్రీ స్వతంత్రంగా జీవించడానికి ఇది తోడ్పడుతుందని ఆమె అంటూ ఉంటారు. స్త్రీ స్వతంత్రంగా ఆలోచించి అభిప్రాయాలు ఏర్పరచుకోవాలని ఆమె సూచిస్తూ ఉంటారు. తను కట్నం యిచ్చి వివాహం చేసుకోలేదు కాబట్టి కట్నం ప్రసక్తి తనకు రాలేదని ఆమె చెప్పారు.

రైల్వే ఉద్యోగులలో నాల్గవ తరగతి కార్మికునికి ఎవరికైనా జబ్బు చేస్తే నెలకు రు 50 లు. చొప్పున ఆరునెలల వరకు ఈ సంస్థ సహాయం చేస్తుంది. అకస్మాత్తుగా ఏ కార్మికుడైనా మరణిస్తే ఈ సంస్థ అతని కుటుంబానికి ఆర్థిక సహాయం అందజేస్తుంది.

రైల్వే ఉద్యోగుల పిల్లల్లో విద్యలో ప్రతిభ చూపిన వారికి స్కాలర్‌షిప్‌లను మంజూరు చేసి వారిని ప్రతి ఏడాది ప్రోత్సహిస్తున్నది. శ్రీమతి హేమాదాస్ ఎన్నో పత్రికలలో కూడా వ్యాసాలు రాశారు. రేడియోలో ప్రసంగాలు యిచ్చారు. సాంస్కృతిక కార్యక్రమాలంటే ఆమెకు ఎంతో యిష్టం. విజయవాడలో జరిగే ముఖ్యమైన కార్యక్రమాలకు వారు కుటుంబ సభ్యులతో హాజరవుతారు. —మీరా

# అద్దాల బెల్టు

కావలసిన వస్తువులు : $\frac{1}{4}$ మీటరు జేగురు రంగు ప్లాస్టిక్ గుడ్డ, $\frac{1}{4}$ మీటరు నలుపు రంగు గుడ్డ (లైనింగ్‌కోసం), 50 అద్దాలు, పసుపు, ఎరుపు, పచ్చరంగు సిల్కు దారాలు, ఒక సూది, పెన్సిలు, 2 హుక్కులు.

పాప్లిన్ గుడ్డతో 33 అంగుళాల పొడవు $2\frac{1}{2}$ అంగుళాల వెడల్పుతో బెల్టు కత్తిరించుకోవాలి. అలాగే 33 అంగుళాల పొడవు, 2 అంగుళాల వెడల్పుతో నల్లగుడ్డని లైనింగ్‌కోసం కత్తిరించుకోవాలి. ఇలా కత్తిరించుకున్న లైనింగ్ గుడ్డని పాప్లిన్ గుడ్డ మీద వుంచి ఒక వైపు మాత్రం కుట్టుకోవాలి. వర్ణ చిత్రంలో చూపిన డిజైన్‌ని పాప్లిన్ గుడ్డ మీద ట్రేస్ చేసుకుని అద్దాలను పొదిగించి చుట్టూ ఎంబ్రాయిడరీ చెయ్యాలి. మొదట నాలుగు అద్దాలు తీసుకుని వర్ణ చిత్రంలో చూపినట్లుగా కుట్టుకోవాలి. రెండుగా వున్న చోటునుంచి దారం తీసుకుని చదరంలోకి దారాన్ని దూర్చాలి. ఆ విధంగా దారాన్ని చదరంలోకి పోనిస్తున్నప్పుడు గుడ్డని కాకుండా దారాన్ని మాత్రమే తీసుకోవాలి.

బెల్టు మీద వున్న అర్ధ వృత్తాలన్నిటినీ కూడా ఎరుపురంగు దారంతోనూ, దీర్ఘ చతురస్రం గల భాగాలకి పచ్చరంగు దారంతోనూ ముద్దకుట్టుతో ఎంబ్రాయిడరీ చెయ్యాలి. ఇలా ఎంబ్రాయిడరీ చేసిన తరువాత పసుపురంగు దారంతో అర్ధ వృత్తం అంచు చుట్టూ గొలుసుకుట్టుతో క్రమంగా ఎంబ్రాయిడరీ చెయ్యాలి. ఆ తరువాత బెల్టుకి ఇరువైపులా పసుపురంగు దారంతో గొలుసుకుట్టు వెయ్యాలి.

ఇప్పుడిక బెల్టుకి అవతలి వైపు - లైనింగ్‌తో కలిపి కుట్టుకోవాలి. ఆ తరువాత బెల్టుకి ఒక వైపు హుక్స్ అమర్చుకోవాలి. రెండో వైపు హుక్స్ పెట్టుకునేందుకు తగిన విధంగా దారం కుట్టుకోవాలి. ఈ బెల్టు పిల్లలు గౌన్లమీద, మాక్సీస్కర్టుల మీద ధరించేందుకు బాగుంటుంది.






## అగ్రహారం
(నవల)

**[రచన: కావిలిపాటి విజయలక్ష్మి; ప్రచురణ: డీలక్స్ పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2, పేజీలు: 264; వెల: రూ. 8]**

చక్కని నవలా రచయిత్రిగా కావిలిపాటి విజయలక్ష్మికి పేరున్నా - ఈ నవల మాత్రం ఆ పేరును మరింత పెంచే తీరులో లేకపోవడం - నిరుత్సాహకరం. అసలు-మన రచయిత్రులు నవలలు రాయడంలో ఏ విధానం అనుసరిస్తున్నారో, ఏ పద్ధతిలో రచన చేస్తున్నారో అర్థం కావడంలేదు. మంచి పుస్తకాలతో తమకు లభించిన పేరుతో, ఏవేవో కథావస్తువులుగా తీసుకుని, పేజీలు పెంచేస్తూ నవలల పేరిట చెలామణీ చేసేస్తున్నారా? ఇందులో ఇంకోటి కూడా వుంది. పత్రికల్లో సీరియల్స్‌గా (ఈ నవల కూడా ఒక వార పత్రికలో వచ్చింది) వచ్చే నవలలన్నీ ముందే పూర్తిగా రాయక పోవడంతో, కొద్ది కొద్దిగా రాసి పంపడంతో.— 'యూనిఫార్మిటీ' ఉండకపోవడం, తీరు అడావుడిగా వుండడం కూడా జరుగుతోంది. బహుశా ఈ పుస్తకం కూడా అదే 'స్థితి'లో రాయబడిందేమో!

మరి, ఈ నవలలో చెప్పుకోదగ్గ సమస్యా లేదు; మలుపులు తిరిగే కథా లేదు. కొన్ని సన్నివేశాల కల్పన బాగుంది. ఐతే సనాతన భావాలుగల శంకరశాస్త్రిని మధ్యలోనే చంపేయకుండా, చివరి వరకూ వుంచి, అతను తన భావాలను మార్చుకుని, ఆ 'కులం లేని అబ్బాయి'కి తన కూతుర్నిచ్చి, తనే పెళ్ళి చేసినట్టయితే - కొంత ప్రయోజనం కనిపించేదేమో!

## నందిని
(నవల)

**[రచన: రాచకొండ శ్రీదేవి; ప్రచురణ: డీలక్స్ పబ్లికేషన్స్, విజయవాడ-2; పేజీలు: 372; వెల: రూ. 12.50]**

అసలు - నవలలు చదవడం (అలాగే-రాయడం కూడా) కాలక్షేపానికా - లేక కాస్త విజ్ఞానార్జనకా? అని ప్రశ్నించుకుంటే, కాలక్షేపానికి పనికొచ్చేవే ఎక్కువగా కనిపిస్తాయి. ఒక పుస్తకం చదివిన తర్వాత దాన్ని దాచుకోవాలనిపించాలి; తిరిగి చదవాలనిపించాలి. ఆ కోవలో ఇవాళ మనకి ఎక్కువ నవలలుగాని, కథల పుస్తకాలుగాని రావడం లేదు.

"పొద్దుపోక, నవల చదువుకుంటున్నాను వొదినగారూ" అంటూ వుంటారు కొందరు, పక్కింటావిడ వచ్చినప్పుడు. నిజంగా కొన్ని 'పొద్దుపోక' నవలల్లాగే వుంటున్నాయి. ఆ విధంగా కాలక్షేపానికి బాగుండే నవలల్లోనే 'నందిని' కూడా ఒకటి. బహుశా నవల పేజీలు పెంచాలన్న ఉద్దేశంతోనో ఏమో - చాలా విషయాలు తిరిగి తిరిగి చెప్పబడ్డాయి. ఒక కుటుంబం, వాళ్ళ మధ్య అనురాగ బంధం, సినిమా పరిభాషలో చెప్పుకునే ఒక సెంటిమెంటు, వీలైనన్ని పాత్రలు, ఒకటి రెండు హిందీ సినిమాల ఛాయలు, అలాగే తెలుగు సినిమాల నీడలూ ఇలా ఎన్నో మిశ్రితం చేసి 'సినిమా' లాగే ఈ నవలనూ ముద్ద చేసి నిలబెట్టారా— అనిపిస్తుంది.

కొన్నిచోట్ల భాషా దోషాలూ మరికొన్ని చోట్ల అచ్చు తప్పులూ — ఏది ఏదో చెప్పలేనట్టుగా వున్నాయి. 'వెముకల పోగు' 'నీరసగించి పోవడం' 'బ్రస్ట్ సైజు ఫోటో' 'అర్ధరాత్రి సమయంలో ఫోన్‌చేసి వాళ్ళకి డిస్టర్బ్ కలిగించడం...'- మొదలైనవి మచ్చుకి కొన్ని ఉదాహరణలు. తన 'తొలి నవలా పుష్పం'గా రచయిత్రి చెప్పుకున్నారు కాబట్టి, ముందు ముందు మంచి ఇతివృత్తాలతో హత్తుకునే విధానంలో రాయగలరని ఆశించడంలో తప్పులేదు!

## స్వప్నసౌధం
(నవల)

**[రచన: పోక్కంపల్లి కాంతాదేవి; ప్రచురణ: డీలక్స్ పబ్లికేషన్స్ ఏలూర్ రోడ్, విజయవాడ-2; వెల: రూ. 6; పేజీలు: 171]**

మధ్యతరగతి ఆడపిల్ల కనే కలలు, అనుభవాలు రెండూ సమాంతర రేఖలు. అవి సాధారణంగా ఎన్నో పణంగా ఒడ్డితే, ఎప్పుడో కానీ కలవవు.

కథానాయిక సూర్యప్రభ వివిధ కులాలకు చెందిన దంపతుల సంతానంలో పెద్దది. తండ్రి ఆత్మాభిమానం, తల్లికి ఉండే సద్గుణాలు తప్ప వారికి మరే ఆధారమూ లేదు. వారి సంతానంలో పెద్దపిల్ల ప్రభ....ఊహల్లో బోలెడన్ని పేకమేడలు, రంగురంగుల కలలు....ఇవన్నీ దాటి వాస్తవంలోకి వచ్చి కళ్ళు విప్పేటప్పటికి, ఆమెకు తను ఎదురింటి 'చందూ' వయస్సుకు, కోరికకు తనను తానుగా పణంగా పెట్టుకుని అవమానం, న్యూనత కొనుక్కున్నానని తెలుసుకున్నది. కులం లేక, డబ్బు లేక నిస్సహాయురాలైన ఆడపిల్ల అందరి దృష్టిలో ఎంత హీనమో ఆమెకు అర్థమైంది. ఆత్మహత్య చేసుకోబోయి రక్షింపబడుతుంది. ఏనాడో తమకు దూరం అయిన అమ్మమ్మగారింటిలో అడుగుపెట్టి అవమర్యాదల పాలయ్యింది. కానీ, అక్కడే ఆమెకు విజయ్ కనపడ్డాడు. ఆమె 'స్వప్నమూర్తి' అతనేనని ఆమెకు అర్థమైంది. కానీ, తనో?! స్వప్నలోకంలో నుంచి విరిగిపడిన సాలభంజిక. కథ చదివిస్తుంది. ప్రభ పాత్ర కొంతవరకు ఈనాటి ఆడపిల్లలకు అతి దగ్గరగా ఉంది. కానీ పుస్తకం వెల మాత్రం చాలా ఎక్కువ.

## చిగురాకులు
(నవల)

**[రచన: నందుల సుశీలాదేవి; ప్రచురణ: డీలక్స్ పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2; వెల: రూ. 6; పేజీలు: 143]**

ఈ నవల ఆద్యంతమూ బావుంది. కోనసీమ అందాలన్నీ అందమైన అద్దాల పరికిణీపై అస్పష్టంగా కనబడే వెలుగు జిలుగుల్లా తళతళమంటాయి అక్కడక్కడ. అన్ని పాత్రలు చక్కగా మలచబడ్డాయి. వెనకతరానికి చెందిన సూరావధాని, సుభద్రమ్మ, వెంకటచయనులు, రామశాస్త్రి పాత్రలు అన్నీ చక్కగా రూపుదిద్దుకున్నాయి. పాత్రలన్నింటిలోనూ స్పందన, మానవత్వం ఉన్నాయి. ఆ ఇంటి నుంచి, సాంప్రదాయబద్ధమైన జీవితం నుంచి విడివడి బాలవితంతువైన సరస్వతి — డాక్టరై మరొక వివాహం చేసుకోవడంతో సంకరజాతి దానికింద వెలివేయబడ్డది. ఆమె కూతురు విమల కాలేజీలో చదివే బావ సుందరంతో కోనసీమ రావడంతో కథ ప్రారంభమవుతుంది. ఛాందసాలతోబాటు చల్లటి తరవాణిలాంటి ఆప్యాయతలు, లేత కొబ్బరి నీటి లాంటి తేట హృదయాలు, కోనసీమ రసాల్లాంటి కోడెకారు విహంగాలు ఈ నవలలో మనకు అనుక్షణం ఎదురౌతారు. అతి ఛాందసుడైన రామశాస్త్రి కొడుకు మూర్తి విమలను పెళ్లి చేసుకోవడంతో కథకు రచయిత్రి తేవలసిన మలుపు తెచ్చారు. మరింత కృషి చేస్తే పలుకు, స్పష్టత, స్పందన ఉన్న ఈమె మరింత మంచి రచయిత్రి అవుతారు.

# వైద్య విశేషాలు



చిన్న పిల్లల్లో—ముఖ్యంగా ఐదు సంవత్సరాల లోపు వయసున్న పిల్లలకు అంధత్వం రావడానికి ప్రధాన కారణం 'ఎ' విటమిన్ లోపం అని, విటమిన్ 'ఎ' ఇంజెక్షన్లు ఈ అంధత్వాన్ని నిరోధించడానికి బాగా దోహదం చేస్తాయని పౌష్టికాహార జాతీయ సంస్థ (హైదరాబాదు) కు చెందిన డా॥ వినోదిని రెడ్డి ఇటీవల ఢిల్లీలో జరిగిన జాతీయ వైద్య పరిశోధనా మండలి సమావేశంలో తెలియజేశారు. ఇది యిలా వుండగా, విటమిన్ 'సి' తీసుకుంటే పుట్టకురుపు (కేన్సర్) వ్యాధి వున్నవారు తమ జీవన ప్రమాణాన్ని మరికొంత కాలంపాటు పొడిగించుకోడానికి అవకాశం వున్నట్లు సాగా విశ్వవిద్యాలయం (జపాన్) కు చెందిన డా॥ అకిరా మురాటా వెల్లడించారు. ఆయన కేన్సర్ వ్యాధిగ్రస్తులకు—'సి' విటమిన్‌ను రోజుకు 4 గ్రాముల చొప్పున కొందరికీ, 50 నుంచి 60 గ్రాముల చొప్పున మరికొందరికీ యిచ్చి ఆ తర్వాత పరిశోధనలు జరిపితే, తక్కువగా 'సి' విటమిను తీసుకున్నవారు సగటున 44 రోజులు, ఎక్కువ 'సి' విటమిన్‌ను తీసుకున్నవారు సగటున 230 రోజులు ఎక్కువకాలం జీవించారు! దీన్ని బట్టి 'సి' విటమిన్ వల్ల కేన్సర్ వ్యాధిగ్రస్తుల జీవన ప్రమాణం కచ్చితంగా పెరుగుతుందని ఋజువైనట్లు తాము భావిస్తున్నామని డా॥ అకిరా మురాటా తెలియజేశారు.

*

కేన్సర్ వ్యాధి నిరోధానికి జరుగుతున్న కృషికి సంబంధించి మరో ఆసక్తిదాయకమైన వార్త వెలువడింది. కేన్సర్ నిరోధానికి, ముఖ్యంగా కడుపు, పెద్ద పేగు, మలద్వారం, వక్షోజాలు, ఊపిరితిత్తులలో వచ్చే కేన్సర్‌ను నిరోధించడానికి బాగా ఉపయోగపడే మందును మన దేశంలోనే తయారుచేయడానికి ఇప్పుడు అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి. 'టొరాఫుల్' (Toraful) అనే ఈ మందును విదేశాలలోను, మన దేశంలోను ఉన్న కేన్సర్ ఆస్పత్రులలో ఉపయోగించి చూడగా మంచి ఫలితాలు లభించినట్లు, దాంతో మన ప్రభుత్వం—ఈ మందును ఉత్పత్తి చేయడానికి అనుమతి యివ్వడం జరిగినట్లు తెలుస్తోంది.

*

తేయాకులో ఉన్న 'టానిన్' అనే పదార్థం, కాఫీలో ఉన్న 'కాఫేన్' అనే పదార్థం వల్ల, పోలియో వ్యాధి వచ్చే అవకాశాలు చాలావరకు తగ్గుతాయని తమ పరిశోధనలవల్ల రుజువైనట్లు—రాయవేలూరు క్రిస్టియన్ మెడికల్ కళాశాలకు చెందిన డా॥ జాకబ్‌జాన్, డా॥ పి. ముకుందన్ ఇటీవల తెలియజేశారు. కాఫీ, టీలలో కొన్ని రకాల విషక్రిములను నిరోధించే శక్తి వుందని, తక్కిన ప్రయోజనాల కంటే-ప్రధానంగా 'పోలియో' నిరోధక శక్తి ఎక్కువగా వుందనీ—వారు తెలియజేశారు.

*

ఒక వ్యాధి వల్ల లభించే క్రిములు మరొక వ్యాధికి విరుగుడుగా పనిచేస్తాయన్న అంశం ఇటీవల జపాన్ విశ్వవిద్యాలయానికి చెందిన వైద్య శాస్త్రజ్ఞుల పరిశోధనల వల్ల మరోసారి రుజువైంది. ఆ పరిశోధనలను బట్టి-కోరింత దగ్గుకు కారణమైన క్రిముల బాక్టీరియా నుంచి తయారుచేసే ప్రొటీను సహాయంతో ఔషధాన్ని రూపొందించి, ఉపయోగిస్తే మధుమేహ వ్యాధిని పూర్తిగా నివారించవచ్చని తెలిసింది. ఈ వైద్య ప్రయోగాన్ని ఎలుకలు, కోతులు, కుక్కలపై చేసి చూడగా, మంచి ఫలితాలు లభించాయని, అందువల్ల ఈ ఔషధంపై ఇంకా ప్రయోగాలు జరుగుతున్నాయని ఆ వైద్య శాస్త్రజ్ఞులు వివరించారు.

*

గొంతులో కలిగే మార్పులు, వచ్చే జబ్బులు తేలికగా తెలుసుకోడానికి దోహదం చేసే ఒక ఎలక్ట్రానిక్ పరికరాన్ని కోయాటో విశ్వవిద్యాలయానికి చెందిన ఒక అసిస్టెంటు ప్రొఫెసర్ రూపొందించారు. ఈ ఎలక్ట్రానిక్ పరికరం వల్ల గొంతులో వచ్చే ధ్వనుల మార్పులను బట్టి గొంతు జబ్బుల లక్షణాలను నిర్ధారణ చేయవచ్చునట. దీని సహాయంతో వైద్యులు చాలా తొందరగా జబ్బును గుర్తించి, చికిత్స జరపడానికి వీలవుతుంది! □

"....శ్స్....హా...." అనుకుంటూ, కళ్ళమ్మట నీళ్లొచ్చేస్తూ మిరపకాయ బజ్జీ కొరుక్కు తింటుంటే, బలే బాగుంటుంది—ఆ ఆనందాన్ని అనుభవిస్తూ తినేవాళ్ళని అడిగితే, అదెలా బాగుంటుందో కమ్మగా వివరిస్తారు....

మంచి వాసనలు వెదజల్లుతూ, తమాషాలైన రుచులతో వుండే బిరియానీ—కడుపునిండా తినేయమని, ఇట్టే ఆకర్షిస్తుంది ...

వేడి వేడి అన్నంలో ఎర్రగావున్న ఆవకాయి పిండి కలిపి, అంత నెయ్యి వేసుకొని తింటూ వుంటే, 'జిహ్వ' కదుల్తుంది....

తింటున్నప్పుడు ఇవన్నీ బాగానే వుంటాయి; రుచిగా వుండడంతో ఆకలి లేకపోయినా మరో ముద్ద ఎక్కువే తినొచ్చు. కాని—

ఇలాంటివన్నీ తింటూవుంటే, అవి మన శరీరానికి ఎలాంటి హాని కలిగిస్తాయో ఎవరూ ఊహించరు!

ఆహార పదార్థాల్లో మసాలా దినుసులు, పచ్చి మిరపకాయలు, ఎండు మిరపకాయలూ ఉపయోగించడం అన్నది, ప్రపంచమంతటా వున్నదే. అంటే, కొన్ని దేశాల్లో ఒక్కొక్కరు ఒక్కో రకంగా, కొందరు మితంగా, కొందరు అమితంగా వుపయోగిస్తారు.

ముఖ్యంగా 'కారం' తినడంలో 'అందెవేసిన నాలుక' ఆంధ్రులది. అందులో కొన్ని జిల్లాల వాళ్లయితే, కారం ఎందులో ఏ మాత్రం తగ్గినా కూడా, ఆ పదార్థం ముట్టుకోరు! "ఎబ్బే! బొత్తిగా కారం తక్కువ" అని నాలిక చప్పరించేస్తారు. ఊరగాయలు, ఆవకాయలూ పచ్చడులూ అంటే, ఇక చెప్పనే అక్కర్లేదు—వాటిలో విధిగా కారం పాళ్లు ఎక్కువే వుండాలి!

'కారం' మాట చెప్పుకున్న తర్వాత, మసాల దినుసులు. లవంగం, దాల్చిన చెక్క, ఏలక్కాయలు, జీలకర్ర, మిరియాలు, ధనియాలు, ఆవాలు—మొదలైనవెన్నో వున్నాయి-పదార్థాల్ని నోరూరించేలా చెయ్యడానికి.

జీలకర్ర, అల్లం, మిరియాలు మొదలైనవి 'మసాలా'గా వాడకపోయినా, సాధారణంగా వాడుతూనే వుంటాము. అల్లం జీర్ణకారి. జీలకర్ర కూడా మంచిదే; ఆకలిని కలిగిస్తుంది. మిరి

# మసాలా దినుసులు శరీరానికి హాని కలిగిస్తాయా?



యాలూ అంతే. జలుబులూ, కఫం వంటి రోగాల్ని నయం చేస్తుంది. ఈ దినుసులన్నీ రకరకాల ధోగాలకి మందుల్లో వాడుతారు; కొన్నింటిని అలాగే కొన్ని కొన్ని జాడ్యాలకి మందులు కింద వాడతాము. మరీ, ఇలాంటి సుగుణాలువున్న ఈ దినుసులు శరీరానికి 'హాని' కలిగించడం ఏమిటి?—ఎక్కువగా తింటే, అవీ హాని కలిగిస్తాయి.

అయితే, మసాలా దినుసుల్ని ఆహారపదార్థాల్లో పూర్తిగా నిషేధించాలని కాదు; నిషేధించమన్నా చాలా మంది నిషేధించలేరు. మసాలా దినుసుల వల్ల శరీరానికి ఏ మాత్రం మేలులేదనీ, పైగా కీడేననీ—ప్రకృతి వైద్యం చెబుతుంది. ప్రకృతి వైద్యంలో ఇలాంటి వాటిని రోగికి అసలు తగలనివ్వరు! రుచుల్ని పెంచడానికి తప్ప, ఈ దినుసుల్లో కొన్నింటికి ఎలాంటి సుగుణాలూ లేవు. కొన్ని మాత్రం తిన్నతర్వాత 'రసం' కింద మారి, తిన్న పదార్థాలు జీర్ణం కావడానికి ఉపయోగపడతాయి. కొన్నిటిలో విటమిన్లూ, లవణాలూ వున్నా పెద్దగా ఉపయోగపడేటంత స్థాయిలో వుండవు. వాటి 'కాలరీ'ల విలువ కూడా చాలా తక్కువ. అంచేత, ఇవి తీసుకోకపోయినందువల్ల ఆరోగ్యానికి ఏ మాత్రం నష్టం లేదు—కాస్త తీసుకున్నందువల్ల ఎక్కువగా 'లాభం' కూడా లేదు కాబట్టి! అయితే, వీటిని అతిగా, తరచుగా వాడితేనే వస్తుంది చిక్కు!

మన ఉదరకోశంలో కొన్ని రసాలు వుంటాయి. ఈ రసాల్లో వాటికి తగినట్టుగా ఆమ్లం వుంటుంది. ఈ ఆమ్లం ఉత్పత్తి ఒక్కొక్కరూ తీసుకునే ఆహారం మీద ఆధారపడి వుంటుంది. ఊరగాయలు, ఆవకాయలు, కారం, మసాలా దినుసులు కలిపిన పదార్థాలు ఎక్కువగా తీసుకునే వారికి, కడుపులో 'మంట' లేస్తుంది. ఈ మంట తరచూ రావడంతో, కడుపులో పుండు లేస్తుంది. ఉదరకోశంలో వుండే 'మ్యూకస్ లైనింగ్'ను కారం గల ఘాటు పదార్థాలు రెచ్చగొడతాయి. దాంతో, ఆమ్లం కావలసిన దానికంటే ఎక్కువగా తయారవుతుంది. దాంతో 'మ్యూకస్ లైనింగ్' 'దిబ్బడ' వేసినట్టయిపోతుంది. రానురాను ఆ 'లైనింగ్' చెడుతుంది; అలా అలా అది 'అల్సర్' కింద మారుతుంది. నిత్యం కారం ఎక్కువగా గల పదార్థాలూ, మసాలా పదార్థాలూ తినేవాళ్ళకు, కొంతకాలానికి కడుపులో 'తిరుగుబాటు' కలుగుతుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. ''పొత్తికడుపు పై భాగంలో తరచు నొప్పిగా వుందని ఫిర్యాదు చేసేవాళ్ళు, కచ్చితంగా కారం చట్నీలు, ఊరగాయలు ఎక్కువగా తినేవాళ్ళే'' నని వైద్యులు చెబుతారు. ఇలాంటి రోగం కనిపించినప్పుడు, ఆ ఘాటు పదార్థాలు తినడం వెంటనే మానేయమని, డాక్టర్లు సలహా ఇచ్చినా చాలామంది మానలేరు—అలవాటు కావడంతో. ''కాస్త తింటే ఏం మునిగిందిలే'' అని, డాక్టర్ సలహాను చప్పరించేసి, ఘాటు పదార్థాల్ని ఆనందంగా ఆస్వాదిస్తూ చప్పరించేస్తారు. 'నోరు కట్టుకోలేకపోవడం' అంటే ఇదే. జిహ్వా చాపల్యంతో నోరు కట్టుకోలేకపోతే—అది ఎంతటి ప్రమాదానికైనా దారితీస్తుంది.

అంటే, మసాలాదినుసులు, కారం అసలు తీసుకోనేకూడదా?—అని అడిగితే, తీసుకోకూడదనీ, వద్దనీ ఎవరూ చెప్పరు. కాని, మితంగా, చాలా మితంగా తీసుకోమంటారు. అన్నింటిలో కారం బాగా వేసుకునో, మసాలా పదార్థాలు రోజూ తినడమో చెయ్యడమే కూడని పని. 'కొరివికారం' అనబడే మిరపపళ్ళ పచ్చడీ, ఆవకాయ, కారం చట్నీలూ రోజూ అసలు తిననేకూడదు; తరచుగా కూడా తినకూడదు! ఎప్పుడో, ఓసారి రుచి కోసం, లేదా ఓ మార్పు కోసం తింటే తినవచ్చు. అలా తిన్నప్పుడు దాని తీవ్రత ఏమిటో వెంటనే తెలిసిపోతుంది. ''ఇవాళ కడుపులో అదోలా వుంది. ఆవకాయ అన్నం తిన్నాను'' అని చాలామంది చెప్పడం వింటూనే వుంటాము. మరి, ఒకనాటికే దాని 'గుణం' ఎలాంటిదో అది రుచి చూపిస్తోందే, తరచు తింటే, పర్యవసానం ఏమిటో వూహించుకోలేమూ?—

తినే ఆహారపదార్థం రుచిగానూ, ఘుమ ఘుమ వాసనలుకొడుతూనూ వుండాలనేది—సిద్ధాంతమే. దానికోసం మసాలా దినుసులూ, రుచికరమైన దినుసులూ ఆహార పదార్థాలలో వేసుకోవాలి అన్నదీ సిద్ధాంతమే. అయితే, 'అతి'గా మాత్రం తీసుకోకూడదు—ఎప్పుడో అయితే పర్వాలేదు.

కడుపులో మంట, నొప్పి, వాయువు, గుండెల్లో మంట—మొదలైనవి ఎప్పుడైనా వున్నట్టు అనిపిస్తే—కచ్చితంగా అవి ఘాటు పదార్థాల వల్లనే అని మీరే తెలుసుకోవచ్చు. అలా వచ్చినప్పుడు, వెంటనే మీకు మీరుగానే కొన్నాళ్ళపాటు వాటిని తీసుకోడం తగ్గించెయ్యాలి. కడుపులో 'అల్సర్'ల వంటిదేదో వుందన్న అనుమానం వున్నవాళ్ళు, ఈ పదార్థాల్ని పూర్తిగా మానేయాలి, వాటి జోలికి మళ్ళీ అసలు పోనేపోకూడదు!

ఆరోగ్యంగా వుండడానికి గల కారణాల్లో ఒకటి—తీసుకునే ఆహారం. అలాంటి ఆహారాన్ని ఇముడ్చుకునేది ఉదరం. అలాంటి ఉదరానికే వ్యాధి కలిగితే?- అలాంటి ఉదరంలోనే పుండు పుడితే?—

నిజానికి—'ఏదీ అమితంగా తీసుకోకూడదు.' అన్నారు పెద్దలు. అందులో ఇలాంటి ఘాటు, హాటు పదార్థాల విషయంలో మరీ నియమంగా వుండాలి.



# బామ్మగారి పేజీ

## ప్రశ్నలకు జవాబులు

**యస్. కె. టి; భీమడోలు**

బామ్మగారూ! గడపమీద కూర్చుని తుమ్మితే, పెద్దవాళ్ళు నీళ్ళు చల్లుతారు. ఎందుకో చెబుతారా?

**తుమ్మడం అన్నది అనారోగానికి లక్షణం. అసలు గడప మీద కూచోడం అన్నదే మనకి తప్పు. ఎంచేతంటే, రాక్షసుడైన హిరణ్య కశిపుని-విష్ణుమూర్తి, నరసింహావతారంలో వచ్చి గడప మీదనే కూర్చుని, అతన్ని చంపాడని! అలాంటిది గడప మీద కూచుని తుమ్మడం అన్నది – మరీ తప్పు! అనారోగ లక్షణం తొలగిపోవాలని నీళ్ల జల్లుతూ 'చిరంజీవ' అని పెద్దలు ఆశీర్వదిస్తారు.**

**కె. జి. సరళకుమారి, కుప్పం**

ప్రతి ఉదయం మంత్రోచ్చారణతో దేవతార్చన చెయ్యాలని, శుభ కార్యానికి వెళ్ళే ముందు, సందర్భోచితంగా మంత్రాలు జపించాలని పెద్దలు నిర్ణయించారు గదా—వాటివల్ల లాభం ఏమిటి బామ్మగారూ?

**దేవుడి మీద నమ్మకం వున్నవాళ్ళు దేవుడిని పూజిస్తారు. కొందరు మంత్రాలతో పూజలు చేస్తారు; కొందరు వూరికే ఓ నమస్కారం పెడతారు. అలాగే శుభకార్యం జరిపే ముందు కూడా.**

సంధ్యవేళలో చిన్న పిల్లలను స్వేచ్ఛగా ఆడుకో డానికి ఆక్షేపిస్తారు పెద్దలు....ఎందుకని?

**పొద్దుగూకే వేళలో పక్షులు గూళ్ళు చేరుకుం టాయి. పురుగూ పుట్రా కూడా ఏదో ఓ మూలకు వెళ్ళిపోతాయి. ఆ విధంగా సంధ్యా సమయం గజిబిజిగా వుంటుంది. అలాంటి వేళలో పిల్లలు ఆడుకోడం మంచిదికాదు. విషజంతువుల్లాంటివి హాని కలిగించవచ్చు. అంచేత, చీకటిపడుతూ వుండగానే పిల్లల్ని ఇల్లు చేరుకోమంటాం.**

**వి. లక్ష్మీప్రసన్న, అనంతపూర్**

బామ్మగారూ! పెళ్ళి కుమారుని వయస్సు పెళ్ళి కూతురు వయస్సుకన్న తక్కువగా వుంటే— వివాహం చేసుకోవచ్చునా?

**చేసుకోకూడదని పెద్దలు చెప్పిన మాట- భర్తకంటె భార్య వయసు తక్కువగానే వుండాలి—శాస్త్ర ప్రకారం. అయితే, నూటికీ కోటికీ మీరు చెప్పినలాంటివి కూడా జరుగు తూనే వున్నాయిమరి!**

**ఆర్. రజనీరెడ్డి, కోరగుంటపల్లె**

గోళ్ళు కొరకకూడదని పెద్దలంటారు. అలాగే గోళ్ళను ఇంట్లో పడెయ్యకుండా, ఎవరూ తిరగని చోటులో పడెయ్యాలన్నారు. ఎంచేతనండీ?

**గోళ్ళలో మట్టి, మురికి చేరుతుంది. అందు కనే, గోళ్లు పెరగకుండా చూసుకుంటూ వుండాలి. అంటే కత్తిరించాలిగాని, మురికిగా వున్న గోళ్ళను నోట్లో పెట్టుకుని కొరికితే?- గోళ్ళు తీసి ఎక్కడ పడితే అక్కడ పారెయ్యడం కూడా మంచిదికాదు. అవి కాళ్ళకు అంటుకుని, తిరిగి ఇంట్లోకి రావచ్చు: ఆహారపదార్థాల్లో పడవచ్చు. కత్తిరించిన వెంట్రుకలు ఎలాగైతే ఇంట్లోకి రాకూడదో, అలాగే గోళ్ళూనూ.**

**ఎ. కాంత, కాళహస్తి**

మా యింటి ముఖద్వారము దక్షిణము వైపున వున్నది. పూజ గది తూర్పు ముఖముగా వున్నది. తూర్పు ముఖముగానే దేవుని పటము పెట్టి పూజ చేస్తున్నాము. అంటే, కొందరు అటుపక్క పెట్టి పూజ చెయ్య కూడదని. చెబుతున్నారు. అరిష్టం అంటున్నారు. ఎంతవరకూ నిజమో చెప్పండి బామ్మగారూ?

**ఇంటి ముఖద్వారం దక్షిణం వేపు వుండడం- వాస్తుశాస్త్రరీత్యా మంచిదే. అయితే, దేవుడి గది ఈశాన్యం వైపుగా వుండాలన్నది సిద్ధాంతం. తూర్పు వేపున వున్నా దోషం లేదని చెబుతారు. దేవుని ముఖం తూర్పున వుండి, మనం పడమటి వేపు తిరిగి కూచుని పూజలు చేసినా తప్పులేదని, పడమటి వేపు**



దేవుని పెట్టి మనం తూర్పుకు ఎదురగా వుండి పూజలు చేసినా తప్పులేదనీ, పెద్దలు చెప్పిన మాట. అంచేత, అది 'అరిష్టం' అని మీరేం బాధపడనక్కర్లేదు!

**టి. లలిత, కాకినాడ**

బామ్మగారూ! 'చంద్రునికో నూలుపోగు' అన్నారు. అంటే అర్థం ఏమిటండీ?

చంద్రుడు మనకు దేవతా సమానుడు. అమావాస్య వెళ్ళిన తర్వాత, తిరిగి విదియనాడు చంద్రుడు కనిపించినప్పుడు, అతన్ని నూతన వస్త్రాలతో సత్కరించడం అన్నమాట. ఈ వస్త్రాలు అక్కడికి ఎలాగూ వెళ్ళవు గనక, ఓ నూలుపోగు తీసి చంద్రుడి వేపు విసిరేస్తాము.

కొత్తగా ఇంట్లో ప్రవేశించినప్పుడు (గృహ ప్రవేశం) పాలు ఎందుకు పొంగిస్తాము?

ఉదయం లేవగానే గోదర్శనం మంచి దన్నారు. అలాగే ఆవుపాలకు కూడా ప్రసిద్ధి వుంది. కొత్తగా ఇంట్లోకి వెళ్ళినప్పుడు, మంచి ముహూర్తంలో వంట చెయ్యాలి. చెయ్యడానికి, సామగ్రి అదీ అందుబాటులో వుండదు (సర్దుకోవాలిగదా) కుంపటి మీద పాలు పొంగించడం సులువు గనక, 'పాలు పొంగిస్తే చాలు' అన్నారు—పాలల్లో 'శుభం' ఉండనే వుంది గనక, అది శుభత్కారం అయింది.

**టీ చేసుకునేప్పుడు అందులో కొంచెం అల్లం కూడా చేర్చుకున్నట్టయితే పైత్యవికారం తగ్గుతుంది. టీ తయారు చేసిన తర్వాత అందులో కాస్త ఏలకుల పొడిని కలుపుకుంటే - మంచి పరిమళంతోపాటు రుచీ వస్తుంది; అది ఆకలిని కూడా ఎక్కువ చేస్తుంది!**

**ఆర్. రజని, కడప**

పిల్లలకు విరేచనాలు వస్తే దానిమ్మ పండు గింజల రసం తాగిస్తే విరేచనాలు తగ్గుతాయంటారు. నిజమేనా? పిల్లల ఆరోగ్యానికి దానిమ్మ మంచిదేనా?

దానిమ్మగింజల రసం విరేచనాలను కడుతుంది. దానిమ్మ-పిల్లలకే అన్నమాటేమిటి—పెద్దలకూ మంచిదే.

**జి. వి. రాజమ్మ, నెల్లూరు**

బామ్మగారూ! మాకు తెలిసిన ఒక ఆవిడ, రోజూ ఉదయం ఖర్జూరపు కాయల రసం (అంటే రాత్రి వేళ నీళ్ళలో నానవేసి) పుచ్చుకుంటుంది. ఎందుకంటే, 'ఫలానా అనేం లేదు—మంచిది' అంటుంది. అది కేవలం మంచికేనా? లేక ఏదైనా ఒక జబ్బుకు మందుగా వాడడమా?

ఖర్జూరం చాలా మేళ్ళు చేస్తుందమ్మా. అది చలవ చేస్తుంది; తాపాన్ని శ్రమనీ తగ్గిస్తుంది. శ్వాసబాధల్నీ, దగ్గునీ తగ్గిస్తుంది. గుండెకు కూడా బలం కలిగిస్తుంది. 'ఫలానాదానికి' అని కాదుగాని, అది కూడా బలవర్థక ఔషధం లాంటిదే — అందులో సందేహం లేదు.

**ఆర్. భానుమతి, పాడేరు**

పొట్లకాయ, కోడిగ్రుడ్డు కలిపి వండితే, 'విషం'గా తయారవుతుందనీ, అలా వండకూడదనీ అంటారు. నిజమేనా?

అవును - అంటారు. మరి అది నిజమా కాదా అని, పరీక్షించి చూద్దాం ఎలా?....అంచేత, అలాంటివి వండుకోకుండా వుంటేసరి!

**గుత్తికొండ సుధారాణి, కొల్లూరు**

బామ్మగారూ! పెళ్లిలో భజంత్రీలు ఎందుకు వాయిస్తారు? మంగళ సూత్రధారణ సమయంలో పెద్దగా వాయిస్తారు. అలా వాయించడం ఎవరైనా తుమ్మితే వినిపించకుండా వుండడానికి—అని అంటారు. నిజమేనా? ఇంకేమైనా కారణం వుందా?

భజంత్రీలు శుభకార్యాల్లో వాయించడం సంప్రదాయం. అవి మంగళవాద్యాలు. మాంగల్యం కడుతున్నప్పుడు, మరింత గట్టిగా వాయించడం — అందరికీ ఆ ఘట్టం జరుగుతున్నదని తెలియజెప్పడం కోసమేనని నా ఉద్దేశం. ఒక్క తుమ్మడం మాత్రమే ఏం—ఎవరైనా అరిచినా, ఏడ్చినా, గోలచేసినా కూడా ఆ సమయంలో వినిపించదుగదమ్మా!

ఇటీవల యన్. టి. రామారావుకు విశాఖపట్నంలో సన్మానం జరిగినప్పుడు వాల్తేర్‌పార్క్ కాలనీలోని వనితలు, శ్రీ రామారావుకు తేనీటివిందు ఇచ్చారు. ఈ చిత్రంలో రామారావు ఎడమవేపు శ్రీమతి రామారావు, శ్రీమతి దాసరి నారాయణరావు-ఆయన కుడివైపు డాక్టర్ మహాలక్ష్మి మొదలైనవారు కనిపిస్తున్నారు.





మన దేవాలయాలు:

# శ్రీకూర్మం



మనిషి ఆలోచనలు ఇవాళ వైజ్ఞానిక పథంలో సాగుతున్నాయి. విజ్ఞాన పరిశోధనలు జరుగుతున్నాయి. ఫలితంగా రోజు రోజుకు అద్భుతమైన సాంకేతిక సాధనాలు కనుగొనబడుతున్నాయి. నూతన ప్రపంచపు ప్రగతి కవాటాలు తెరుచుకుంటున్నాయి.

ఒకనాటి మానవుని ఆలోచనా వీక్షణాలు, ఊహా విహంగాలు ఆదర్శపు ఆకాశంలో హాయిగా ఊరేగాయి. పర్యవసానంగా పరమార్థాలు ప్రబోధించే పురాణ పారిజాతాలు పరిమళించాయి।

సంపూర్ణ జీవన వికాసానికి ఈ రెండూ రెండు కళ్ళు లాంటివి.

లోక రక్షణ కోసం విష్ణువు పది అవతారాలు దాల్చినట్లు భాగవత పురాణం చెబుతుంది. దశావతారాలలో రెండవది కూర్మావతారం. కూర్మావతారం ప్రధాన దైవంగాగల ఏకైక మందిరం - తెలుగు వాకిలి శ్రీకాకుళం జిల్లా శ్రీ కూర్మంలో (శ్రీకాకుళానికి పదిమైళ్ళ దూరం) వెలుగొందే మన కూర్మనాథస్వామి దేవాలయం।

శ్రీకాకుళ ప్రాంతం కళింగ దేశ అంతర్భాగంగా వున్న కాలంలో గాంగ రాజులు ఈ గుడిని కట్టారనీ ఆ తర్వాత జయపురాధీశులూ, మరెందరో తెలుగు రాజులు ఈ గుడికి సొబగులు దిద్దారనీ ఈ గుడిలోని శిలా శాసనాలు చెబుతాయి. క్రీ. శ. మొదటి శతాబ్దం నుంచి పద్నాల్గవ శతాబ్దం వరకు సాగిన చరిత్ర జాడలను సూచించే శిలాశాసనాలు ఆలయం నిండా వున్నాయి. చాళుక్యరాజు విజయాదిత్యుడు 1273 సం॥లో వేయించిన శాసనం వల్ల-రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహంతో ఆదికవి నన్నయ్య ఆంధ్ర మహాభారతం విరచించిన విషయం వెల్లడవుతోంది.

సనాతన ధర్మ పునరుద్ధరణకు కృషి చేసిన శ్రీ శంకర, రామానుజ మధ్వాచార్యులు మువ్వురూ ఈ ఆలయం సందర్శించి దీని అభివృద్ధికి దోహదం చేశారని చరిత్ర చెబుతుంది.

ఉత్తరాంధ్ర దేశం పరిపాలించిన శ్వేత చక్రవర్తి భార్య-ఘనశీలవతి, మహాభక్తురాలు ఆమె ఏకాదశీ వ్రతం అనుష్ఠిస్తున్న పవిత్ర సమయంలో ఆమె చెంతకు చేరి పొందు కోరాడట రాజు. అందుకు ఆమె అభ్యంతరం చెప్పి దూరంగా వెళ్ళినా వదలకుండా వెంటబడ్డాడట. రాజు బారినుంచి రాజపత్నిని కాపాడడానికి వారి మధ్య ఓ నది పెల్లుబికిందట. అదే వంశధారానది. ఆ తర్వాత తన నైచ్య ప్రవృత్తికి సిగ్గుపడిన శ్వేత చక్రవర్తి ప్రాయశ్చిత్తంగా సంవత్సరాల తరబడి తపస్సు చేయగా విష్ణువు "కూర్మ రూపధారి"గా దర్శనమిచ్చాడట. శ్వేత చక్రవర్తే మొట్టమొదట ఇక్కడి కూర్మనాథ ఆలయానికి ప్రాకారాదులు కట్టాడట. పద్మపురాణం తెలియజేసే ఈ ఆలయ స్థల పురాణం ఇది।

సువిశాల పుష్కరిణితో అందాలు చిందే శిల్ప సౌందర్యంతో అలరారే స్తంభాల వరుసతో; భోగ మంటపం, పుష్పాంజలి మంటపం మొదలైన మనోహర మంటపాల మధ్య గంభీరంగా వెలు

గొందే ఈ ఆలయ గోపుర నిర్మాణ పద్ధతిని కూర్మ విమానం అనీ, గంధర్వ విమానం అనీ అంటారు.

ఆలయ గోపురం చుట్టూ, ప్రాకార కుడ్యాల మీదా శ్రీ కృష్ణ లీలలు, దశావతార దృశ్యాలు మనోజ్ఞ శిల్పాలుగా అమర్చబడి వున్నాయి. విమానానికి నాలుగు వేపులా శ్రీ ధర, నారసింహ, హయ గ్రీవ విగ్రహాలు అమర్చబడి వున్నాయి. దశావతార విగ్రహాలను అంటే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ అవతారాలను ఒక క్రమపద్ధతిలో గమనించినట్లయితే ఒక సత్యం స్ఫురిస్తుంది.

అమీబా నుంచి క్రమక్రమంగా అభివృద్ధి చెందుతూ కాళ్ళు చేతులు గల ప్రాణిగా రూపొంది కోట్లకొలది సంవత్సరాల పరిణామ పర్యవసానంగా ఆఖరికి కోతి నుంచి మనిషి పరిణమించాడు— అన్నది (ఆధునిక) డార్విన్ పరిణామ సిద్ధాంతం.

నీళ్ళలో మాత్రం జీవించే చేప; నీళ్ళలోనూ, నేల మీదా సంచరించే తాబేలు; భూమి మీద తిరుగాడే వరాహం; సగం మనిషి సగం మృగం అయిన నరసింహం; పొట్టి మనిషి ఆకారం గల వామన రూపం; బలమే ప్రధానంగా గల పరశురాముడు; ఆదర్శ పురుషుడుగా వెలసిన రామచంద్ర మూర్తి; ఘటనా ఘటన సమర్థుడు—





'నరుని' కార్యోన్ముఖునిగా తట్టి లేపిన శ్రీ కృష్ణ పరమాత్మ—అంటూ యుగ యుగాలుగా సాగిన అవతారాలలో ఒక క్రమ పరిణామ వికాసం మనకు గోచరిస్తుంది. డార్విన్ పరిణామ సిద్ధాంతానికి, దశావతారాల పరిణామ వికాసానికి విచిత్రమైన దగ్గరి పోలికలు కనబడతాయి.

ఆలయ గోపుర ద్వారం తూర్పు ముఖంగా వున్నప్పటికీ లోపలి కూర్మనాథ స్వామి మందిరం పశ్చిమాభిముఖంగా వుంది. అందుకేనేమో ఈ ఆలయంలో రెండు ధ్వజ స్తంభాలు వున్నాయి.

మరణం లేకుండా చేసే అమృతం కోసం మందర గిరిని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసుకుని సురాసురులు పాలకడలిని మథించారు. మందర పర్వతం క్రమక్రమంగా సముద్రంలో మునిగిపో సాగింది. దేవ దానవులు కాపాడమని ప్రార్థించగా విష్ణువు తాబేలుగా మారి మందరగిరి క్రింది భాగం చేరి దానిని పైకెత్తాడట. క్షీరసాగర మథనంలో మొదట హాలాహలం పెల్లుబకగా సురాసురుల ప్రార్థన మేరకు దానిని పరమశివుడు భక్షించి వారిని రక్షించాడు. పాలకడలి నుంచి శమంతకమణి, ఐరావతం, శ్రీ దేవి ఆదిగా గల అపూర్వ సిరి సంపదలు వెలువడిన తర్వాత అమృత కలశం ఆవిర్భవించింది. అయితే అమృతం పంచుకోవడంలో దేవ దానవుల మధ్య తగవులాటలు బయలుదేరాయి. అప్పుడు మహావిష్ణువు మోహిని రూపంలో వచ్చి అమృత సురభిని గ్రహించడంతో మోహిని విశ్వ మోహన రూపం చూసి మతులు చలించిన దానవులు అసలు అమృతం పొందలేకపోయారు. కాని ఏకైక లక్ష్యంతో పోరాడిన దేవతలు అమృతం పొంద గలిగారు—కొద్దిపాటి భేద రూపాలతో భాగవతంతో పాటు పద్మ, కూర్మ పురాణాలు వివరించే కూర్మావతార గాథ ఇదే! "ఈ కథ పరమార్థం జీవిత సత్యం! సర్వజనా మోదం!" అంటారు విజ్ఞులు. ఇంతకూ ఏమిటా పరమార్థం?

సూర్య చంద్రులలో, నదీనదాలలో తరులూ, గిరులలో దేవుని అడుగుజాడలను గమనించిన వేద కాలంనాటి ఋషి పుంగవులు క్రమక్రమంగా అణువణువునా వ్యాపించిన భగవంతుని గుర్తించగల్గారు. మంచి మనసే ఈశ్వర చరణ కమలాలయం అని ఉపనిషత్తులలో ఉద్ఘాటించి దానిని తెలుసుకునే మార్గం కూడా సూచించారు. ఈ పరమ సత్యం ప్రతివారూ గ్రహించి తరించాలన్న ధ్యాసతో సామాన్య జన సుబోధకంగా రచింపబడిన గాథలలో ప్రథమ గణ్యం క్షీరసాగర మథన కథనం!

మంత్రం అనే 'మంథరగిరి'కి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అనే 'వాసుకి'ని బంధించి హృదయ 'సాగరం' మథించాలి. అందుకు మంచి ఏకాగ్రత అవసరం. ఏకాగ్రతకు ఆధారం ఇంద్రియ నిగ్రహం. ఇంద్రియ నిగ్రహానికి సంకేతమే—అవసరమైతే గాని కాళ్ళు వెలికి తీయని 'తాబేలు' అందుకేనేమో యజ్ఞయాగాదులు, హోమాలు చేసేవారు— కూర్మాకారంగా వున్న—అత్తిపీట మీద కూర్చోవాలంటారు. మంచి పనులలో ఏర్పడే ఆరంభ కష్టనష్టాలు, సంకటాలు సూచించేదే హాలాహలం. ఆ తర్వాత ఏర్పడే ఆరోగ్యకరమైన పరిణామాలే ఐరావతాది దివ్య సంపదలు. ఆఖరుగా లభించిన అమృతం జ్ఞానానికి, ఆనందానికి సంకేతం. సాధించిన దానిని జాగ్రత్తగా కాపాడుకోకపోతే ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరే - అని హెచ్చరిస్తుంది మోహిని అవతార కథనం!

క్షణ క్షణం జరిగే జీవన సమరంలో ఎదురయ్యే కష్ట నష్టాలు - వాటిని పరిష్కరించే విధానం మంచిని సాధించడానికి చేయవలసిన ప్రయత్నం కావలసిన పట్టుదల, ఏకాగ్రత, జాగ్రత్త మొదలైన విషయాలను సూక్ష్మంగా తెలియజేయడమే కూర్మావతార గాథలోని పరమార్థం!

[ఈ వ్యాస రచనకు కొంత విషయం సేకరించి, ఛాయా చిత్రాలు పంపిన శ్రీమతి వి. లక్ష్మీదేవిగారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

—వ. సం.]



కె. హరిత (అయికావగర్) పుట్టిన తేదీ: 10-9-77
తల్లి పేరు : కె. హేమలత



కె. కిరణ్‌కుమార్ (కారు మంచి) పుట్టిన తేదీ : 30-9-76 తల్లి పేరు : కె. అనసూయ



బేబి హిమచందన (ఆర్మూర్) పుట్టిన తేదీ: 8-9-78
తల్లి పేరు : అమృతలత.

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో బేబి హిమ చందన; రెండేళ్ళ పిల్లల గ్రూపులో కె. హరిత; మూడేళ్ళ గ్రూపులో కె. కిరణ్ కుమార్ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురి




తోపాటు, మొత్తం మీద మూడు గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి ప్రచురిస్తున్నాము. అక్టోబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపే వారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) సెప్టెంబర్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంప గోరుతున్నాము.



సంగీత (బెంగళూరు) పుట్టిన తేదీ: 19-9-78
తల్లి పేరు : మంజులా ప్రకాష్



పి. బాలక్రిష్ణ కిశోర్ (హైదరాబాద్) పుట్టిన తేదీ: 3-9-78 తల్లి పేరు: పి. అరుణాదేవి



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

ప్రకృతి:

# మీ మహత్తర సౌందర్య సాధనం.

ప్రకృతి మీకు మచ్చలేని నునుపైన చర్మాన్ని యిచ్చినప్పుడే, దాన్ని అదే విధంగా ఉంచగల సాధనాలపై దృష్టి సారించింది.

మీ చర్మానికి మరింత రంగొచ్చేలా నునుపుగా, ఆరోగ్యంగా చేసేందుకు పసుపు యిచ్చింది (ఇది క్రిమి నిరోధకంగా పనిచేస్తుందని మీకు తెలుసా?)

మరి గంధపు చెక్కను మీ చర్మాన్ని చల్లగా చేసి మొటిమల్ని మటుమాయం చేయడానికి యిచ్చింది.

మీ చర్మానికి వాపులూ, 'ఎలర్జీ' లేకుండా కాపాడటానికి కుంకుమ పువ్వునిచ్చింది.

నిజానికి ప్రకృతికి మీ చర్మాన్ని ఎలా సంరక్షణ చెయ్యాలో తెలుసు. అందుకే మేం యీ మూడింటిలోని లక్షణాలన్నిటినీ ఒకే క్రీమ్‌లో రూపొందించాం.

అదే కొత్త శింగార్ టర్మరిక్ బ్యూటీ క్రీమ్.

కొత్తది

## శింగార్

### టర్మరిక్ బ్యూటీ క్రీమ్

మీ చర్మ సంరక్షణ కోసం ప్రకృతి సహజమైన సాధనం.







శింగార్ కాస్మటిక్స్
ప్రయివేట్ లిమిటెడ్
809, ప్రసాద్ చాంబర్స్,
బొంబాయి 400 004

